


“నా విశ్వాత్మక ప్రేమరూపు మాసిపోతున్న తరుణంలో దానిని పునరుజ్జీవింపచేసి, మతాల పేరుతో క్రతువులు, కర్మకాండలతో వూపిరాడకుండా చేస్తున్న సిద్ధాంతాల ప్రహసనాన్ని అంతమొందించేందుకే నా రాక.

– మెహేర్‌బాబా

౧౧౧

# మెహెరామృతం

సంకలనం :

జి.వి.జి.కె. చన్ద్రమౌళీశ్వర రావు (మెహెర్ చంద్ర)



ప్రచురణ కర్త :

**శ్రీ తాడేపల్లి హనుమంతరావు**

**11-45-125, తవ్వావారి వీధి,**

**విజయవాడ - 520 001**

G. V

# MEHARAMRUTHAM

*Completed by :*
Sri G.V.G.K. Chandra Moleswara Rao (Meher Chandra)

Ist Edition : 31-1-1999

Copies - 500

Price | Rs. 15-00 |


In Commemoration of Avatar Mehar Baba 30th Amarathithi
Inagurated at Beloved Avatar Mehar Baba's Holy Tomb
Meherabad on 31-1-99



***For Copies :***
**G.V.G.K. Chandra Moleswara Rao (Meher Chandra)**
Mehar Nilayam, Ramayammaraopet,
Nuzividu - 521 201

***Type Setting By :***
Sri Sai Ram D.T.P.
*V.D. Puram VJA-12, Ph : 0866 - 425824*

# తొలిపలుకు

బాబా ప్రేమికులుగా ఈనాడు మనందరకు ముఖ్యంగా కావలసింది, అవతారునితో ప్రత్యక్ష సంబంధం. ఆయన నిరంతరం మన కొరకు ఎదురు చూస్తారు. కానీ మనమలా ఎదురు చూడలేక పోతున్నాం. ఆయన అవతార ఔన్నత్యంపై సరియైన అవగాహన లేనందున పైకి ఆయన వారలుగానే జీవిస్తున్నా అంతరంగంలో అంతర్బంధాన్ని కలిగించలేక పోతుతున్నాం. అందుకే అవతారునిగా మెహెర్ బాబా స్థాయిని అనుభవంతో అర్థం చేసుకొనుటకు, ఆయన జీవిత కాలములో మాటలతో పనిలేకుండా చేతల ద్వారా మానవాళి కందించిన కొన్ని అద్భుత ఘట్టాల్ని సందేశాత్మకంగా సంకలనపరచిన గ్రంథమే ఈ "మెహెరామృతం".

ఏటా మాదిరిగానే అవతార్ మెహెర్ బాబా 30వ అమరతిథి సందర్భంగా ఈ గ్రంథాన్ని ప్రచురించేందుకు అముద్రిత సంఘటనలను సేకరించి వివిధ సందర్భాల్లో అందించిన బాబా సందేశాలతో మేళవించి పుస్తక రూపంలో మీముందుంచే ప్రయత్నం చేశాను. ఇది నా 35వ గ్రంధ రచన. మానవులు పరిపూర్ణులుగా జీవించాలంటే ఎలా గడపాలో ఆచరణాత్మకంగా మేల్కొలిపిన విధానం, ఈ సంకలనానికి ప్రధాన భూమిక. మనమంతా బాబా సాహిత్యజ్ఞాన సముపార్జనలో ఇంకా విద్యార్థులమే. ఆయన ప్రేమలో ఉత్తమ ప్రేమికులుగా తయారయ్యేందుకు, బాబా జీవిత కాలంలో అందించిన ఈ అనుభవ సేకరణ సద్వినియోగపడుతుందని విశ్వశిస్తున్నాను. "నా ప్రేమను, నా ప్రేమికులకందించు -- నేను నీతో ఉన్నాను. నేను నీ తోటే వస్తున్నాను" అన్న బాబా అభయాన్ని ఆదేశంగా తీసుకొని ఈ సంకలన ప్రయత్నాన్ని చేశాను. ముఖ్యంగా సో॥ తాడేపల్లి హనుమంతరావు గారు నా. ఈ ప్రయత్నంలో అచ్చులో అక్షరకూర్పుకు సంపూర్ణ సహకారాన్నందించారు. ఇప్పటివరకూ ఆయన ఏర్పాటు చేసిన రివాల్వింగు నిధి ద్వారా సర్వము - శూన్యము, మెహెర్ లీల అనే గ్రంథాలు ప్రచురించాము. ఇది లాభనష్టాలు లేకుండా చేసిన మూడవ ప్రచురణ. మచలీపట్నం కన్యకాపరమేశ్వరీ రైసు మిల్లు మేనేజింగు పార్టనర్లు శ్రీ గుడివాడ రామచంద్రరావు, తాడేపల్లి మెహెర్ బాబాగారలు టైటిలు ప్రింటింగుకు సహకరించారు. వారందరికి బాబా ఆశీస్సులందించాలని ప్రార్థిస్తూ కృతజ్ఞతలర్పిస్తున్నాను. ఇది ప్రియతముని 30వ అమరతిథి నాడు, దివ్య సమాధి సన్నిధిలో ఆవిష్కరించటం బాబా ఇచ్ఛగా భావిస్తూ బాబా చరణ సన్నిధికి సమర్పించుకుంటున్నాను. - జై బాబా

నూజివీడు

31-1-1999

జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు

# నా విన్నపము

జై బాబా ! ఈనాడు రాష్ట్రంలో ఎందరో అదృష్టవంతులు మెహెర్ బాబా సత్య ప్రేమ సందేశాల్ని అనేక విధాలుగా వ్యాప్తి చేయటంలో చాలా చురుకుగా పనిచేస్తున్నారు. కొందరు పత్రికలద్వారా బాబా సాహిత్యాన్ని ప్రచురిస్తున్నారు. సమావేశాలు నిర్వహించి, అనుభవజ్ఞుల ప్రసంగాలను ఏర్పాటు చేస్తున్నారు. భవనాలు నిర్మించి బాబా విగ్రహాలు చిత్రపటాలు నెలకొల్పి ఎందరో కొత్తవారికి పరిచయం చేసే కృషి చేస్తున్నారు. మరి కొందరు ఇలా ఎందరో ఎన్నెన్నో ప్రయత్నాలు చేస్తుంటే మన సో॥ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు ఆల్ ఇన్ వన్‌గా సెంటరు నిర్వహణ, సహవాస్‌ల నిర్వాహణ, బాబా సత్యప్రేమ సందేశాలపై ప్రసంగాలందించటంతో పాటు ఎనలేని బాబా సాహిత్యాన్ని గ్రంధ రూపంలో గత 30 ఏళ్లుగా ఆంధ్రా ప్రేమిక పాఠకలోకానికి అందిస్తున్నారు. బాబా ప్రేమను గత 40 ఏళ్లుగా నేను ఆస్వాదిస్తున్నప్పటికి నేనింకా ఆయన ప్రేమలో పశివాడినే. ఇప్పటి వరకు బాబా సేవలో చేస్తున్న దానికంటే గొప్ప కార్యక్రమమేదో చేయాల్సి ఉన్నదని ఇప్పుడిప్పుడే అనుభవమవుతుంది. బాబా కోసం ఎంత ఎక్కువగా పనిచేస్తే, అంత తక్కువగా మన గురించి ప్రాధాన్యతనివ్వగలుగుతామన్న బాబా సందేశం ఇప్పుడిప్పుడే అనుభవమవుతోంది. బాబా కార్యక్రమం ఏ రూపంలో చేసినా, ఆదాయన మనకిచ్చిన అపూర్వ అవకాశమేనన్న ఉద్దేశ్యంతో ఒక రివాల్వింగు నిధిని ఏర్పాటు చేసి సో॥ చంద్రమౌళీశ్వర రావు గారి సహకారంతో సర్వము - శూన్యము, మెహెర్ లీల అనే గ్రంథాలను లాభ నష్టాలకు అతీతంగా ప్రచురించి పాఠకులకు అందించాము. అవి రెండూ పాఠకుల అభినందనలను చూరగొన్నందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. ప్రియతమ బాబా తన అనంత ప్రేమామృతాన్ని మా మూడవ ప్రయత్నం మేము చేస్తున్న ప్రేమ పూర్వక సేవలో పాఠక లోకంపై కురిపించి పునీతుల్ని చేయాలని ప్రార్థిస్తున్నాను. శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు గారు మరింత బాబా సాహిత్యాన్ని తెలుగులో వెలుగుకు తెచ్చే శక్తిని ప్రసాదించమని వేడుకుంటూ అందరికీ జై బాబా !

మీ విధేయుడు

**తాడేపల్లి హనుమంతరావు**

# మెహెరామృతం




మానవ మనస్సు అనిశ్చత స్వభావానికి పుట్టిల్లు అవిచ్ఛన్నంగా ముసురుకునే కోరికలు మనస్సు నెప్పుడూ అనిశ్చలంగా ఉంచుతాయి. గురు సాంగత్యం లభించి, అపార ప్రేమా శీనస్సులందు కున్నా, భౌతిక వాంఛల ప్రలోభంలో చిక్కి తన నిజస్థితిని మరచి మనస్సుకు బానిసలవుతున్న మానవాళి నుద్ధరించేందుకు దివ్య ప్రియతముని రాక అవసరమవుతుంది. అవిశ్రాంత మనస్సు అనుక్షణం కోరికలతో నిండి, వాటిని పొందేందుకు మాయాకల్పిత ఊహాల్లో సుఖాన్ని సృష్టించు కుంటుంది. కోరికలున్నంత వరకు స్వేచ్ఛలేదు. నిష్కాముడైన వాడు రాజులకే రాజవుతాడు. కోరికల నుండి స్వేచ్ఛను పొందాలంటే, వాటి కతీతులు కావాలి. గురు కృప ఉంటే కానీ ఇది సాధ్యపడదు.

గత అవతార కాలాల్లో ఈ నగ్న సత్యము ప్రవచించబడినా మానవుడ్ని ప్రభావితం చేయలేక పోయింది. ఈ ప్రస్తుత అణుయుగంలో అధునిక మానవ మేధస్సును జాగృత పరచుటకు భగవంతుడు నవీన అవతారుడిగా ఏ ప్రాంతానికో, ఒక జాతికో పరిమితం కాకుండా, సకల ప్రపంచానికి విస్తృతమై అన్ని మతాలు, జాతుల వారికి మేల్కొలుపు నిచ్చింది. భగవంతుడు సృష్టి మధ్యకు దిగివచ్చినప్పుడు కనిపించే దైవంగా అవతారుడు అవుతున్నాడు. అలా అవతరించిన ప్రతిసారి తాను ఈ సృష్టి కోసమే జీవిస్తాడు.

ఈ యుగంలో మనము సమకాలికులుగా ఉండే అదృష్టాన్ని ప్రసాదించి అవతరించిన నవీన అవతారుడు అవతార్ మెహెర్ బాబా. మానవోద్ధరణకు మానవులను అధ్యాత్మిక బాటలో నడిపేందుకు మూర్తీభవించి రూపుదాల్చిన పరాత్పర పరబ్రహ్మ మెహెర్ ప్రభువు కడు అనురాగ శాలి. అతి సుందర ప్రేమ స్వరూపుడు. పూనా నగరంలో 25 ఫిబ్రవరి 1894న షెరియార్జీ, శిరీన్ మాయిలను పుణ్య దంపతులకు ముద్దు బిడ్డగా జన్మించిన రెండవ సంతానమైన యీయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు మెర్వాన్ షెరియార్జీ ఇరానీ బాల్యంలోనే ఎన్నో

అద్భుతాలు ప్రదర్శించి తాను పరమాత్మ నన్న భావాన్ని వ్యక్తపరచాడు. కాలేజీలో ఇంటర్ మిడియట్ చదువుతున్న రోజుల్లో 1914 జనవరిలో కాలేజీ నుండి సైకిలుపై ఇంటికి వస్తుండగా ఒక రోజున నగర నడి రోడ్డుపై నున్న వేపచెట్టు క్రింద ఎంతో కాలంగా తిష్ట వేసుకొని కూర్చున్న సద్గుర్విణి బాబా జాన్ కను సౌంజ్ఞలతో చేరబిలిచి, మేర్వాన్ నొసటిపై ముద్దు పెట్టుకున్నది. ఆక్షణంలో అతడు తన అనంత దివ్య సనాతన స్థితిని అనుభవించాడు. మాటలకతీతంగా ఈ దివ్యానుభూతి ఆయనలో శాశ్వతంగా ఉండిపోయింది. అది ఎటువంటి అనుభవమో అర్థమయ్యేందుకు బాబా స్వయంగా ఇలా వివరించారు. "గురు చుంబన స్పర్శాను భవం ద్వారా నేను అనంత ఆకాశంలో ప్రవేశించాను. అక్కడేమీ లేదు. ఎవరూ లేరు. ఆదిమ ద్రవ్యమూ లేదు. స్థూల, సూక్ష్మ, మానశిక ప్రపంచాల ఉనికి ఆగిపోయి కనీసం మాయగానైనా లేకుండా అంతరించి పోయాయి. ఆ పిమ్మట ఆత్మ సాక్షాత్కారపు అనంతానందం అనుభవమైంది".

ఈ స్థితిలో మేర్వాన్ 9 నెలలపాటు వర్ణించనలవి కాని ఆధ్యాత్మిక వేదనను అనుభవించాడు. అంతట తనకు మళ్లీసాధారణ మానవ చైతన్యానికి దిగిరమ్మనమంటూ ఆయన్ని ఏదో ప్రేరేపించింది. ఫలితంగా తన తలను నుదుటిని, గోడల మీద రాళ్ల మీద బాదుకోసాగాడు. నుదుటి నుండి రక్తం స్రవిస్తుంటే చేతి రుమాలును తలచుట్టూ కట్టుకొనేవాడు. చివరికి ప్రేరణ మేర్వాన్‌ని షిరిడీకి చేర్చింది. సాయిబాబా ముందు నడిరోడ్డు మీద మట్టిలో సాష్టాంగ పడి ప్రణామాలర్పిస్తుంటే సాయిబాబా "పర్వర్దిగార్" అంటూ ఉచ్ఛస్వరంతో బిగ్గరగా 3 సార్లు అరిచారు. పర్వర్దిగార్ అంటే సర్వ రక్షకుడైన భగవంతుడు అని అర్థం. సాయి బాబాతో జరిగిన ఈ స్పర్శానుభవం ఖండోబా దేవాలయం వద్దకు తీసుకుపోయింది. అప్పుడది చాలా అపరిశుభ్రంగా ఉంది. ఉపాశినీ మహరాజ్ దిగంబరిగా అస్థిపంజరంలా శుష్కించి పోయి అక్కడ కూర్చొని ఉన్నారు.

ఇక్కడ జరిగిన తన అనుభవాన్ని మెహెర్ బాబా ఇలా వివరించారు. "నాకక్కడ ఎటు చూచినా నేను తప్ప వేరెవ్వరూ నాకు కనిపించ లేదు. నేను మహరాజ్‌ను సమీపించే సరికి ఆయన నావైపు గురిచూచి ఒక గులక రాతిని విసిరి కొట్టారు. అది తిన్నగా వచ్చి నానుదుటిని తాకి గాయపరచగా నెత్తురు

కారింది. సరిగ్గా అదే చోటున బాబాజాన్ నన్ను ముద్దుపెట్టు కున్నది. ఈదెబ్బ ధ్యానము యొక్క తొలిదెబ్బ. నా అనంత సనాతన స్థితి నుండి క్రిందికి దిగి వచ్చేందుకు, ఈ దెబ్బ ఎంతగానో పని చేసింది. ఉపాశినీ మహరాజ్‌తో జరిపిన అనేక సమావేశాలనంతరం, ఏడేళ్లు గడిచాక, నేను దైవీమానవుడిగా పరిపూర్ణ సాధారణ మానవ చైతన్యమున్న మానవుడిగా స్థిరపడ్డాను. ఆ పిమ్మట నా అనంత దైవత్వం సాధారణ మానవత్వం రెండూ ఏక కాలంలో నాలో పొందికగా ఒనగూడాయి."

ఆ కాలపు పంచ సద్గురువులలో నాల్గవ వారైన తాజుద్దీన్ బాబా, అయిదవ వారైన నారాయణ మహరాజులు మాయ పరణలో ఉన్న మేర్వాన్ యొక్క అవతార తత్వాన్ని విశదపరచే బాధ్యతను, తమ భుజ స్కంధాలపై వేసుకొని, ఆయనలో పరిపూర్ణ వికాసాన్ని మేల్కొలిపారు. ఆయనదే ఆయన, స్వీయ ప్రపంచాన్ని, దాని నిర్వహణా బాధ్యతను మేర్వాన్‌కు వప్పచెప్పారు. 1922 నుండి మేర్వాను మెహెర్ బాబాగా సర్వ స్వతంత్ర పరిపూర్ణ అవతారుడి పాత్రను పోషించారు. అనూహ్యమైన ఆధ్యాత్మిక కారణాల వల్ల ఆయన 1925 జూలై 10 నుంచి అఖండ మౌనాన్ని ఆరంభించి 1969 జనవరి 31న తన భౌతిక శరీర పరిత్యాగం చేసే వరకు కొనసాగించారు. తన మౌనంలోనే 13 పర్యాయాలు ప్రపంచ పర్యటనలు చేసి అనేక ప్రజా దర్శనలిచ్చి జాతికుల మత వివక్షత లేకుండా ఎందరికో ఆరాధ్య దైవమయ్యారు.

మెహెర్ బాబా, ప్రభు ధర్మము, సేవకా ధర్మాన్ని ఏకకాలములో ప్రకటించిన అవతార మూర్తి. ఆ కాలపు ఆధ్యాత్మిక గురు పీఠానికి సర్వాధికారిగా, సకల సృష్టికి నూతన శక్తిని, నవ చైతన్యాన్ని కలిగించిన కరుణామయుడాయన. పూనాలోని కస్బాపేటలో కొద్ది మంది శిష్యులతో తన ఆశ్రమాన్ని 27-1-1922న ప్రారంభించారు. కొద్ది నెలలకే భిన్న మతాలవారు ఆయనకు శిష్యులయ్యారు. పిమ్మట 45 మంది శిష్యులతో కాలి నడకన బొంబాయి చేరి ఒక భవనాన్ని అద్దెకు తీసుకొని మంజిల్ - ఇ - మీమ్ అనే పేరుతో 7-6-1922న రెండవ ఆశ్రమాన్ని ప్రారంభించారు. కుల మత వివక్షత లేని సర్వమత సామరశ్యాన్ని పెంపొందించే తర్ఫీదును శిక్షణగా అలవర్చారు. ఇక్కడ మెహెర్ బాబా యొక్క సర్వజ్ఞత్వాన్ని వ్యక్తం చేసే అనేక సంఘటనలు జరిగాయి. ఈ మంజల్ - ఇ - మీమ్ రోజుల్లోనే

"సేవా ధర్మ ప్రావీణ్యత" (మాస్టరీ ఇన్ సర్వీట్యూడ్) అనే ఆదర్శ వాక్యాన్ని నిర్దేశించి తన విశ్వకార్యక్రమానికి ఆదర్శంగా పునాది వేశారు. మస్తులు, కుష్టు రోగుల సేవాకార్యక్రమాలు ఈ మంజిల్ నుండే ప్రారంభమయ్యాయి.

19-4-1923న మరల ఈ మంజిల్‌ని ఎత్తివేసి, అహ్మద్ నగరుకు తదుపరి మకాం మార్చారు. మహారాష్ట్రలోని అహ్మదు నగరు సమీపంలో నున్న ఆరంగాం అనే పల్లె పక్కన, మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో సైనికుల స్థావరంగా ఉన్న ప్రాంతంలో తన శాశ్వత ఆరామాన్ని ఎంచుకున్నారా అన్నట్లు 13-5-1932న రోడ్డు ప్రక్కగా ఉన్న భావి ప్రక్కనే ఉన్న వేప చెట్టు క్రింద అనుకోకుండా వెళ్లి కూర్చోవటం జరిగింది. బాబా విశ్రమించిన ఈ స్థలం సో॥ ఆదీ కె. ఇరానీ గారి తల్లిదండ్రులు కైఖుస్రూ, గుల్మాయిలది. ఆ కుటుంబమంతా బాబా సేవకు అంకితమైనందున బాబాకు అర్పించుకోగా "మెహెరాబాద్" అనే పేరుతో ఈనాటికి చిరస్థాయిగా అలరారుతోంది. అన్వేషకుల కాయనే గురువుగా, దైవంగా, వెలుగొందారు. ఎటువంటి కర్మకాండలకు ప్రాధాన్యత నివ్వక, కేవలం రోజుకు 14 సార్లు, ఏకాగ్రతతో తన నామాన్ని స్మరిస్తే తన కృపకు పాత్రులవుతారని ప్రవచించారు. ఆత్మ ప్రబోధకరములూ, విశ్వకళ్యాణ కారకములైన అనేక ప్రవచనాల్ని తన మౌనంలోనే అందించారు. "నేను బోధించుటకు రాలేదు మేల్కొలుపుటకే వచ్చాను" అన్నారు.

ఆయన మానవుడిగా మన మధ్యకు వచ్చింది తన అనంత ప్రేమను స్పష్టంగా మనకు విశదపరచుటకే నంటూ ప్రతి వారిని తన ప్రేమను పంచుకొనేట్లు అనుమతించారు. "సాదారణ జీవితాన్ని గడపండి. కేవలం నన్ను ప్రేమించండి. బ్రతికేందుకు బందీలు కావద్దు. బాబా అనే తెరను పొంది ఈ జగత్తు నుండి రక్షణను పొందండి" అని ప్రబోధించారు. యుగ యుగాలుగా మానవుడు శారీరక రుగ్మతలు మానశిక నిరాశ, అవమానము, భంగపాటులను తమ దివ్య ప్రియతమునితో సమైక్యమయ్యే వరకూ ఎదుర్కొంటున్నారు. భగవంతుని యెడల అచంచల విశ్వాసముంచి, ఆయన ఇచ్ఛకు పూర్తిగా అర్పణైతేనే దైవ కృపకు పొంద గలుగుతారని తెలుపుటకే మాటలతో పని లేని చేతల కార్యక్రమాన్ని మెహెర్ బాబా నిర్వహించారు.

# ధ్యాని



"ఈ శరీరం గురించి మన మెవరం వ్యధ పడనక్కర్లేదు మన మెప్పుడూ ఉన్నాం. ఎప్పటికీ ఉంటాం. ఎవరైతే కర్మ చట్ట పరిధి నుంచి విముక్తుడవుతాడో అతడే ధ్యాని. మంచి చెడుల ప్రకృతి అతనికి అవగతమే కనుక, ఇతరుల గురించి తానేమి ఆలోచించినా, ఏమి భావించినా, ఏమి చెప్పినా, ఏమి చేసినా, ఎవరినీ నిందించాల్సిన పని లేదని ఆతడెరుగును. అటువంటి ధ్యానికి మంచి చెడులు, పాప పుణ్యాలు, స్వర్గనరకాలు, జనన మరణాలు, పునర్జన్మవంటివన్నీ కర్మ చట్టం ద్వారా జరిగే దైవేచ్ఛ యొక్క ఫలితాలేనని కూడా అతనెరుగును. అంతేకాకుండా వాటి ఉనికిని కొనసాగించేందుకు మూలకారణము అజ్ఞానమేనని కూడా అతడెరుగును. ఈ విధంగా ధ్యాని తరచుగా భగవంతునితో సమైక్యమై తన భక్తుల కొరకు అత్యధిక మానవాళి కొరకు అడ్డుకొని దైవం ముందు ఎప్పటికీ పశ్చాత్తాప పడడు. తనకు సంబంధించి ఏ విషయంలోనూ క్షమాపణ కోరడు.

"ఇటువంటి ధ్యానికి తాను కర్మ చట్టం నుండి తప్పించబడినట్లు ఎరుక ఉంటుంది. అయితే చాలా అత్యున్నత రకమైన ముముక్షువు విషయంలో భగవంతుడు కూడా ప్రత్యేక నజరానా నందించి, అతని తనువంతా, తన దివ్య ప్రియతమునిపై లగ్నమై శాశ్వతంగా ప్రతిఫలిచటం వల్ల కర్మచట్ట పరిధినుంచి తప్పిస్తాడు. అయితే సాధారణ భక్తుడు, తన భక్తి ఎంత నిజాయితీదైనప్పటికీ, కర్మ చట్టంలోనే బంధించబడి వుంటాడు. అందువల్ల అతడు చేయవలసిందల్లా, తానీ చట్టాన్ని తన స్వీయ ఆధ్యాత్మిక లబ్ధికోసం, పుణ్యాచరణ సాధనవల్ల చెడును విడిచి పెట్టుట వల్ల, ఈ లబ్ధిని పొంద కలుగుతాడు. ధర్మాచరణలో అతడు అపజయం పాలై, తప్పుల్లో పడిపోతే, అవధులు లేని దైవ కరుణలోనికి విసరి వేయబడి అప్పుడాయన్ని క్షమాపణ కోరుతాడు."

# ప్రభు ప్రార్థన

ఓ పర్ వర్‌ది గార్,

సర్వపోషకా ! సర్వ రక్షకా !

నీవు ఆదియును అంతమును లేనివాడవు, అద్వయుడవు ; నిరుపమానుడవు, నీ ప్రమాణమెవ్వరును ఎఱుంగనేరరు.

నీవు వర్ణము, నామము రూపము, గుణములు లేని వాడవు.

నీవు అపరిమితుడవు, గంభీరుడవు, ఊహాతీతుడవు, భావనాతీతుడవు, శాశ్వతుడవు, నాశనము లేని వాడవు.,

నీవు అవి భాజ్యుడవు ; దివ్యచక్షువులతో గాని నిన్నెవరును చూడజాలరు.

నీవు ఎల్లప్పుడు నుంటివి, నీవు ఎల్లప్పుడు నున్నావు నీవు ఎల్లప్పుడు సుందువు.

నీవు అంతటను గలవు, నీవు అన్నింటనున్నావు, మరి నీవు అంతటికి అన్నింటికి ఆవలనుందవు.

నీవు ఆకాశమున గలవు, పాతాళమున గలవు. నీవు వ్యక్తుడవు అవ్యక్తుడవు; అన్ని భూమికలందున్నావు, అన్ని భూమికల కతీతుడవు.

నీవు మూడు లోకములలో నున్నావు, ముల్లోకముల కావలగూడ నున్నావు. నీవు అగోచరుడవు, స్వతంత్రుడవు.

నీవు సృష్టికర్తవు, ప్రభులకు ప్రభుడవు, అందరి మనస్సులను, హృదయములను ఎరిగినవాడవు.

నీవు సర్వశక్తివంతుడవు. సర్వవ్యాపివి.

నీవే అనంత జ్ఞానము, అనంత శక్తియు, అనంత ఆనందమును.

నీవు జ్ఞానసాగరుడవు, సర్వజ్ఞుడవు, అనంత జ్ఞానివి, త్రికాలవేదివి, జ్ఞానమే నీవు ;

నీవు సర్వదయాళుడవు, నిత్యశుభంకరుడవు ;

నీవు ఆత్మలకెల్ల ఆత్మవు, అనంతగుణ విశిష్టుడవు ;

నీవు సత్య, జ్ఞాన, ఆనందముల త్రిమూర్తివి ;

నీవే సత్యమునకు మూలము, ప్రేమ మహాసాగరుడవు ;

నీవు పురాణపురుషుడవు, సర్వోత్తముడవు ; నీవు ప్రభుడవు, పరమేశ్వరుడవు;
నీవు పరుడవు పరాత్పరుడవు ; నీవు పరబ్రహ్మవు ; అల్లాహ్ ; ఇలాహి;
యజ్‌దాన్; ఆహుర్ మజ్‌దా, ప్రియతముడైన భగవంతుడవు,

నీవు 'ఈజద్' అనబడు ఏకైక పూజ్యుడవు. - మెహెర్ బాబా

# పశ్చాత్తాప ప్రార్థన



"ఓమ్ పరబ్రహ్మ - పరమాత్మ"

"యా -యజ్ దాన్"

"లా ఇలాహ్ ఇల్లిల్లాహ్"

"ఓగాడ్ ! ఫాదర్ ఇన్ హెవెన్ !"

పరమ దయానిధివగు ఓ ఈశ్వరా !

మా పాపములన్నింటికిని మేము పశ్చాత్తాప పడుచున్నాము. ఆసత్యము, ఆధర్మము అపవిత్రమును అగు మా ప్రతి తలంపునకు మేము పశ్చాత్తాప పడుచున్నాము. పలికియుండరాని పలికిన ప్రతి మాటకును, చేసియుండరాని చేసిన ప్రతి చేతకును మేము పశ్చాత్తాపపడు చూన్నాము.

స్వార్థముచే ప్రేరేపింపబడిన ప్రతిపనికిని, ప్రతి మాటకును ప్రతి తలంపునకు, ద్వేషముచే ప్రేరేపింపబడిన ప్రతి పనికి ప్రతి మాటకును, ప్రతి తలంపునకు మేము పశ్చాత్తాపడు చూన్నాము.

ముఖ్యముగా కామముతో కూడిన మా ప్రతి తలంపునకు కామ ప్రేరితమగు మా ప్రతిచేతకును, ఫలికిన ప్రతి అనృతమునకు సమస్త కపటవర్తనమునకు, ఆడితప్పిన ప్రతి వాగ్దానమునకు సమస్త పరనిందలకు పరోక్షనిందలకు మేము పశ్చాత్తాప పడుచున్నము.

ఇంకనూ ముఖ్యముగా కూడ పరులకు నాశన మొనగూర్చిన మేము చేసిన ప్రతి పనికిని ఇతరులకు బాధలుకలుగజేసిన మే మాడిన ప్రతి మాటకును,

చేసిన ప్రతి చేతకును ఇతరులకు బాధలు కలుగవలెనని మేము కోరిన ప్రతికోర్కెకును మిక్కిలి పశ్చాత్తాప పడుచున్నము.

**అపార దయానిధివగు ఓ ఈశ్వరా !**

మేము చేసిన యీ పాపములన్నిటిని క్షమింప వేడుకొనుచున్నాము. తలపులలో మాటలలో చేతలలో నీ ఇచ్ఛానుసారము చేయజాలక నిరంతరము విఫలుల మగుచున్న మమ్ములను క్షమింప వేడుకొనుచూన్నము.

"క్షమాపణ కోరుతూ చేసే పశ్చాత్తాప ప్రార్థనను మీరు నా కోసం చేస్తున్నారంటే, అదంతా నాతో సంబంధం ఉన్న వారి కొరకు మాత్రమే. మీలో కొందరు ఎటువంటి కోరకలు లేకుండా ఉండి ఉండవచ్చును. కానీ ఈనాడు నా సమక్షంలో జరుగుతున్న ప్రార్థనలలో నేను పాల్గొనటం భావితరాల వారి కొరకే అయినా ఈ ప్రార్థనలు ఎవరు ఎప్పుడు చేసినా, నా భౌతిక శరీరానంతరం కూడా వారికి ఆధ్యాత్మి ప్రయోజనం చేకూరుతుంది."

మెహెర్ బాబా ఈ పశ్చాత్తాప ప్రార్థనను 1952 నవంబరు 7, 8, 9 తేదీలలో జరిగిన సహవాస్ సమయంలో 8-11-92న ఆంగ్లంలో పశ్చాత్తాప ప్రార్థనను అందించారు. ఆ ప్రార్థన చేసే సమయంలో బాబా తన చెంపలను ప్రార్థనయ్యే వరకూ నిలబడి ఆపకుండా తన చేతులతో బాదుకున్నారు. ఆలాగే బాబా డెహ్రాడూన్‌లోని రాజపూర్ రోడ్‌లో ఉన్న 101 నం॥ గృహములో తన 25 మంది శిష్యులతో కొన్ని నెలల పాటున్నారు. ఆ సందర్భంలోనే బాబా ప్రపంచానికి మహనీయమైన ఒక బహుమానాన్ని ప్రసాదించారు. అదే విశ్వైక ప్రార్థన. పర్వర్దిగార్ ప్రార్థన అని, ప్రభుస్తుతి అని కూడా వ్యవహరించ బడుతోంది. దీనిని స్వయంగా అవతారుడే అందించాడు. 1953 ఆగష్టు 13 నుండి 21 రోజుల పాటు, డెహ్రాడూన్‌లో ప్రత్యేకమైన ఆధ్యాత్మిక కార్యక్రమంలో ప్రతిరోజూ ఆంగ్లంలో వ్రాయించిన ఈ ప్రార్థనను తన సమక్షంలో మండలి చేత చదివించారు. విష్ణువు పదానికి సూఫీమతంలో పర్యాయ పదం పర్వర్దిగార్. హిందువులు ప్రతి అవతారాన్ని విష్ణువుదనే నమ్ముతారు. మేర్వాన్ మొదటి సారిగా సాయిబాబాను కలిసినప్పుడు ఆయన "ఓ పర్వర్దిగార్" అని సంభోదించారు. ఆ పవిత్ర సంబోధనా పదముతోనే బాబా ఈ సర్వమత ప్రార్థనను ప్రారంభించారు. ఈ ప్రార్థనలో నిర్గుణ పరబ్రహ్మ తత్వాలన్నీ చేర్చి సర్వమతాలకు చెందిన వారందరికి వర్తించేట్లు బాబా దీనిని రచించారు. 1953 జూలై 21న దీనిని చెప్పి వ్రాయించి, మండలితో 13 ఆగష్టు నుండి పఠింప చేశారు.

# అంతరాత్మ

మనం మన మేధా సంపదతో అవతారుని అర్థం చేసుకోలేము. ఆయన వైభవాన్ని తెలుసుకోగలగాలంటే ఆయనలో సంలీనం కావాలి. దీనిని బాబా మాటల్లో చెప్పాలంటే "ఈ ప్రకటనలు, సందేశాలు, ఇవీన్న మనల్ని ఆధ్యాత్మిక పథంలో ఎక్కడికీ తీసుకుపోవు. వ్యాఖ్యానాలు, మనస్సుకు నచ్చచెప్పుకోవటాలు కూడా మనల్ని ఎక్కడకూ చేర్చలేవు. పై పెచ్చు, అత్యున్నత స్థితికి చేర్చే అసలైన అనుభవము కరువైపోతుంది. భగవంతుని గురించి తెలుసుకోవాలని నీవెంతగా ప్రయత్నిస్తే అంత తక్కువగా తెలుసుకుంటావు. వివరణల కతీతుడైన దైవం గురించి అసలు వివరించటమెలా సాధ్యం ? ఆయన అనంతుడు కనుక ఆ అనంతత్వాన్ని తెలుసుకోవటం కష్టమంటూ బాబా దాని రహస్యాన్నిలా వివరించారు. "మీరు ఇంతకు ముందేదైయున్నారో, అదే ఇప్పుడు కావాలి. మీకు నాకు మధ్య ఉన్న "నేను" అన్న తెర తొలగిలేనే మీరు నన్ను తెలుసుకోగలుగుతారు".

"భగవంతుడు మీ అంతరాత్మ. అంటే యీ పరిమిత శరీరము వెనుక మీ శరీరంలో శక్తిని, మనస్సును ఆ రెంటి క్రియలను కలిగి ఉన్నారు. వాటితో పాటు "నేను" అనే అహాన్ని కూడా కలిగి యున్నారు. దీనిని బట్టి అనంతుడిగా భగవంతుడు విశ్వాంతరాళంలో ఎలా ఉన్నాడో ఊహించండి. మీ ఆత్మే ఒక శరీరంగా పోల్చుకుంటే మీకు ఇది అర్థమవుతుంది. సూఫీ మతంలో ఒక నమ్మకం ఉంది. "నీవు నీ ప్రియతమ దైవాన్ని దర్శించాలంటే నీ శిరస్సును అరచేతిలో పెట్టుకొని ఆయన ముందుకు వెళ్లాలి" అని. అంటే, మనస్సును క్షాళన పరిచే ఏకైకుడిని సాక్షాత్కారము చేసుకొనుటకు తెలివితేటలు ఎప్పుడూ సహాయపడవు. దేవుడు అగోచరుడు. ఊహలకు, వాదనలకు అందడు. కోరికలకతీతుడై, అహం నసించిన వారికే ఇది సులభము. మనస్సు ద్వంద్వచర్యల్ని ప్రేరేపిస్తుంది. మొదటిది ఊహ. దీనిలోని సంస్కారము పని చేసితీరాలి. అందువల్ల అది ఆలోచనలుగా బహిర్గతమవుతాయి. అందుకే ఇలా పనిచేసే దాన్ని వేదాంతులు మనస్సు అన్నారు. భావోద్రేకాలన్నీ మనస్సు యొక్క రెండవ క్రియ క్రిందకు వస్తాయి. దీనిని అంతఃకరణ అంటారు. అది హృదయ సంబంధమైనది. కనుక నిజానికి హృదయము అంటే మనస్సు యొక్క ద్వితీయ క్రియ. అంతే కాని ఊపిరికి మూలమైన గుండె కాదు. సంస్కారాలు,

ఆలోచనలు, భావాల ద్వారా ఖర్చు చేయబడతాయి. మనస్సు యొక్క ప్రథమ క్రియలో అన్ని రకాల ఆలోచనలు ఉంటాయి. దాని ద్వితీయ క్రియలో అన్ని రకాల భావాలు కోరికలు ఉంటాయి. ఆనందం, బాధ, అసంతృప్తి, సుఖం, దుఃఖం, వంటి భావాలన్నీ అంతఃకరణకు చెందినవి.

గాఢ నిద్రలో మనస్సులో ముద్రితమైన సంస్కారాలు, నిగూఢంగా నిద్రావస్థలో ఉంటాయి. గాఢ నిద్ర నుంచి మిమ్ములను మేల్కొలిపేది ఏది ? మీరు చేసిన కర్మల సంస్కారాలే ఈ సంస్కారాల్ని ముందు ఆలోచనల వల్ల, ఆ తర్వాత కోరకిల వల్ల అప్పుడు చేతల ద్వారా ఖర్చు చేయాలి. అందుకే కృష్ణుడు తన గీతలో "సంసారాల్ని కేవలం ఆలోచనల ద్వారానే ఖర్చు చేయమన్నాడు. అప్పుడు కొత్తవి తయారు కావు. దానిని మీరు చేయలేకపోతే, సంస్కారాల్ని కోరికలు, భావాలు, ఆశల ద్వారా ఖర్చు చేయండి. అంతే కాని చేతల ద్వారా మాత్రం వద్దు. మీ సంస్కారాలు చేతలకు దారితీస్తే బలమైన సరికొత్త సంస్కారాలు తయారవుతాయి". దీనిని బట్టి సంస్కారాలను ఖర్చు పెట్టడం అనే మనస్సు యొక్క ప్రథమ చర్య అంత ప్రధానంకాదని అవగతమవుతుంది. ఇది సహజము. సాధారణంగా హృదయము అని పిలవబడే మనస్సు యొక్క ద్వితీయ క్రియ ముఖ్యమైనది. ఎందుకంటే అది కోరికలకు మూలాధారము. అన్ని కోరికలు, భావాలు శూన్యమైతేనే కాని, హృదయము పరిశుద్ధమైతేనే కాని, మీలోని అంతరాత్మ అయిన భగవంతుడు తనకు తాను వ్యక్తం కాడు. వీటి భావాన్ని అర్థం చేసుకొనుటకు ప్రయత్నించండి. ఈ శరీరమే మీరన్న భావం మీకున్నది. మీరు సుఖంగా ఉన్నట్లు నీరసించినట్లు, ఆకలి గొన్నట్లు ఎన్నో భావాలు మీకు వస్తాయి. నేను - నేను - నేను అన్నది - అవన్నీ మీరే అన్నట్లు భావిస్తారు. కానీ ఈ "నీవు" వెనుక, అసలు శరీరమే అక్కడ లేక పోయినా వదిలించుకొనుటకు వీలులేనిదేదో ఒకట్మున్నది. మీ రెండు చేతులు రెండు కాళ్లు నరికినా మీరు మీరుగా మిగిలే ఉంటారు. అంటే దానర్థం ఈ శరీరం మీరు కాదు అని. గాఢ నిద్రలో మీ శరీరపు ఎరుక మీకుండదు. అయినా మీ ఉనికి ఉన్నది. కనుక ఈ శరీరము మీరు కాదు. మరి అప్పుడు ఈ "నీవు" ఎవరు? ఈ నీవు మీ అంతరాత్మ. అతి ముఖ్యమైన ఈ "నేను"ను మన స్వీయ ఆత్మలోనే కనుగొనాలి.

నేనెవరిని ? నేను ఈ శరీరమును కాదని బదులిచ్చాను. మరప్పుడు

నేనెవరిని ? నేను బహుశః శక్తిని కావచ్చు. కానీ నేను కదలలేనప్పుడు పని చేయలేనప్పుడు ఆ చైతన్యుడనైనప్పుడు, తనకు తానుగా శక్తి పుట్టనప్పుడు సైతము "నేను" మిగిలే ఉంటున్నది. అందువల్ల శక్తి "నేను" కాదు.

నేను మనస్సునై ఉండవచ్చును. ఇక్కడ పైన చెప్పినదే వర్తిస్తుంది. నాలో చైతన్యం లేకపోయినా గాఢ నిద్రలో సైతం, మనస్సు పని చేయకపోయినా ఈ నేను ఇంకా ఉంటున్నది. కనుక నేను మనస్సును కూడా కాదు. అప్పుడు నేనెవరిని ? దానిని గ్రహిచుటకు ప్రయత్నించండి. అర్థం చేసుకొలేని దాన్ని అర్థం చేసుకొనుటకు ప్రయత్నిద్దాం. శరీరము, శక్తి, మనస్సు కానిదేదో అది నేనై ఉన్నాను.

గాఢ నిద్రలో నీవు పొందే అనుభవమేమిటి ? ఏమి లేదు. అది మీరు ఇంతవరకు చెప్పని వ్రాయని, చెప్పుటకు సాధ్యపడని విషయాన్నిప్పుడు మీకు చెపుతున్నాను. నేను గాఢ నిద్రను. ఎందుకని ? నేను శరీరము కానప్పుడు శక్తి, మనస్సు కాకపోతే అప్పుడు ఆ శరీరరము, శక్తి, మనస్సు కాని, కేవలం గాఢ నిద్ర మాత్రమే కలిగి ఉన్నదేదో అది నేను అయి ఉన్నాను. ఆ ప్రశ్నకు కేవలం గాఢ నిద్ర మాత్రమే బదులిస్తుంది. గాఢ నిద్రలో మీరు శరీరము కాదు. శక్తి కాదు, మనస్స కాదు అయినప్పటికీ శరీరము ఉన్నది, శక్తి ఉన్నది, మనస్సు ఉన్నది. కేవలం ఆ శరీరము శక్తి మనస్సుల ఎరుక మాత్రమే అక్కడ లేదు.

ఇప్పుడు మొదటి అంశానికి వద్దాం. మొదలే లేని ఆరంభం. అనంతుడైన ఏకైకుని అనంత గాఢ నిద్రావస్థ స్థితి ఆ మొదలే లేని ఆరంభంతో సృష్టి సకల జగత్తు, ఆఖరికి ఈ శూన్యము కూడా ఏర్పడనప్పుడు "ఉండెను" అన్న స్థితి మాత్రమే ఉన్నది.

అప్పుడు భగవంతుని దశావస్తలు మొదలవుతాయి. పరిణామము పునర్జన్మ విదాన క్రమంలో సంస్కారాలు పోగవుతాయి. శరీరము, శక్తి, మనస్సు వికశిస్తయి. తనది అనంత స్థితే అయినా, ఆత్మ తననొక పరిమిత శరీరంగాను, శక్తిగాను, మనస్సు గాను యీ సంస్కారాల వల్ల అనుభవిస్తుంది.

గాఢ నిద్రలో మనకు మన శరీరపు ఎరుక ఉండదు. శక్తి మనస్సుల ఎరుకా ఉండదు. అప్పుడు ఉండే ఎరుక యధార్థ ఉనికిది. ఈ గాఢ నిద్రావస్థలో "నేను ఫలానా" అన్న ఉనికిని కలిగి, ఆ "నేను" గురించిన జ్ఞానము

పూర్తిగా ఎరుక లేకుండా ఉండుట ముఖ్యమైన విషయం. గాఢ నిద్రలో లేదా సంపూర్ణ జ్ఞాన రహిత స్థితిలో ఉండే అహాన్ని "సహజాహంకారం" అంటారు. అహంలో మూడు రకాలున్నాయి. మొదటిది సహజ అహం. మనల్ని నిద్ర నుంచి మేల్కొలిపేది నన్ను ఖర్చు పెట్టమంటున్న నీ సంస్కారమే. ఆలా లేచి సంస్కారాల్ని ఖర్చు చేస్తూనే నేనీ శరీరాన్ని అనుకుంటావు ఈ "నేను" కృత్రిమైన అహం అనబడుతుంది.

పాత సంస్కారాల్ని ఖర్చు చేస్తుంటే కొత్త సంస్కారాలు పట్టుకొస్తాయి. అవి కూడా ఖర్చు చేయవలసినవే కనుక మంచి చెడూ సంస్కారాల వల్ల పురుషుడు, స్త్రీ, అందము, అందవిహీనము, పేద, ధనిక, బలవంతుడు, బలహీనుడు అలా అనేక రూపాలు ధరించాలి. అవన్నీ విభిన్న దుస్తుల్లాంటివి. మీరు సాధరణంగా ధరించి, చిరిగిపోగానే వదిలేసిన దుస్తులు మాదిరి భిన్న రూపాలైనప్పటికి ఈ అసత్య అహం ఉంటుంది.

కొంతకాలానికి ఆ సంస్కారాలన్నీ బలహీనమై ఇంకా ఇంకా అరుదైపోయే సమయం వస్తుంది. కాల క్రమేణ అవి పూర్తిగా కనుమరుగై పోతాయి. సంస్కారాలెప్పుడైతే లేవో అప్పుడు మనస్సు పని చేయదు. ఆగిపోతుంది. ఇప్పుడు హృదయం స్పష్టంగా పరిశుద్ధ మవుతుంది. ఎందుకంటే అక్కడ కోరికలు లేవు. ఆశలు లేవు. భావాలేమీ లేవు అయినా అక్కడ ఇంకా నీవు ఉన్నావు. అప్పుడు ఈ "నేను" సంస్కార శూన్యమైనందున బంధాలు లేవు. ఏ పరిమితులు లేవు. ఇప్పుడది మనస్సుకు అతీతమైన స్థితిని అనుభవిస్తుంది. ఎందుకంటే అసలు మనస్సే లేదు కనుక. ఇప్పుడది అనుభవించేది యధార్ధ "నేను" యొక్క అనంత మూల భూతస్థితి. ఈ అహమును యధార్ధ అహము అంటారు. నేను ఈ శరీరాన్ని నేను శక్తిని నేను మనస్సును అని చెప్పినట్లే ఇప్పుడు నేను భగవంతుణ్ని అంటాడు. ఈ విధంగా సహజ అహం, అసత్య అహం, యదార్ధ అహం అని మూడు రకాల అహములు. కేవలం హృదయంలో పరిశుద్ధత ఉన్నవారే దైవాన్ని కాంక్షిస్తారు. తెలివి తేటలనేవలను విసిరి భగవంతుణ్ని బందించాలని ప్రయత్నించకండి. అలా చేస్తే మీకు కనిపించేది గాలి మాత్రమే. అందుకే "ప్రేమించు భగవంతుడు నీ వాడవుతాడు" అంటున్నాను. నేను సంకల్పిస్తే క్షణ కాలంలో నీవు దైవాన్ని దర్శిస్తావు."

నీవు ఇంతకు ముందు ఏదై ఉన్నావో ? అది కావాలి. నీవు భగవంతుడవు.

కనుక నీవు భగవంతుడివి కావాలి. అంతకు ముందేదై వున్నావో అది అయ్యేందకు ప్రేమ ద్వారానే సాధ్యమని ప్రబోధించుటకు జీసస్ తనకు తాను శిలువ వేయబడి అవమాన పరచుకున్నాడు.

సీతామహా సాధ్వి తండ్రి జనకుడు ఒక సద్గురువుగా పేరు పొందాడు. ఆయన పరిపాలించిన రోజుల్లో ఆయన రాజ్యానికి అవతల ఒక యువకుడు దైవ చింతనా పరుడై భగవంతుడ్ని దర్శించాలని తపిస్తున్నాడు. ఈ బాహ్య ప్రపంచాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నంత విపులంగా ఆయన్ని చూడాలని తపించాడు. చివరకు అతడు జనకుని దర్శించి ఆయన సహాయాన్ని అభ్యర్థించాలను కున్నాడు. అన్నపానీయాలు లేకుండానే ఎండ వానలకు ఓర్చుకొని 2 నెలలపాటు కాలినడకన బయలుదేరాడు జనకుని కలిసేందుకు. ఆరోజుల్లో రైళ్లు విమానాలు వంటివేవీ లేవు. ఇది 7000 ఏళ్ల క్రితం జరిగింది. చివరకు అతడు జనకుని రాజ ప్రసాదం చేరాడు. ద్వారపాలకులు అడ్డుకొని గుమ్మంలోనే ఆపేశారు. విధిలేక అతడు గోడ బయటే నిలబడి జనకుని కీర్తిస్తూ ఆయన పేరు పెట్టి ఎలుగెత్తి పిలువ సాగాడు. చివరకు అతని పిలుపును జనకుడు విని, అతడెవరో తెలుసుకోమని తన మంత్రులను ఆదేశించాడు.

నేనొక దైవ ప్రేమికుడినని అతను బదిలిచ్చాడు. నేను భగవంతుడిని దర్శించాలను కుంటున్నాను. జనకుడు నాకు తప్పక దేవుడ్ని చూపించాలని ప్రార్థించాడు. అంత జనకుడతనిని లోనికి పిలిపించి తన మంత్రులతో అతడ్ని తక్షణం జైల్లో వేయమని ఆదేశించాడు. అది చూస్తున్న ఆ యువకుడు తన మనస్సులో తాను సర్వజ్ఞడనని చెప్పుకుంటున్న జనకుడు తప్పకుండా తన మనస్సు అభిళషించే విషయాన్ని తప్పక తెలిసి వుండాలి. అయినా నన్ను జెయిల్లో వేయించాడేమిటి ? అనుకున్నాడు. అన్న పానీయాలేమి పెట్టకుండా కొన్ని రోజులుంచి జనకుడు అతడ్ని సభకు రప్పించాడు. అతడికి నమస్కరించి అతడ్ని స్నానం చేయించి భోజనం పెట్టించి, మంచి దుస్తులు కట్టించి ఒక రాజుగా అతడిని పరిగణించాడు. అతడ్ని రాజదర్బారుకు తీసుకు వచ్చి జనకుడు అతడిని తన శింహాసనంపై కూర్చోపెట్టాడు. మూడు రోజుల పాటు అతడిని అలా అనుభవించ నీయమని ఆదేశించాడు.

జనకుని మనస్సులో ఏమున్నదో ఆ యువకుడు గ్రహించలేక పోయాడు. పరిపాలన ఎలా చేయాలో అతడికి తెలయదు. ఏవో అభ్యర్థనలతో ప్రజలు వస్తే

మంత్రులు సలహాలివ్వమని ఇతడినడుగుతున్నారు. ఏం చెప్పాలో తెలియక మిన్నకున్నాడు. చివరకు చేసేది లేక ఆ యువకుడు తన అసౌకర్య స్థితి నుంచి తక్షణం తప్పించమని జనకుని కోరమని మంత్రుల నడిగాడు. జనకుడు వచ్చి అతడిని సింహాసనం నుంచి దిగమని ఆదేశించి, జైలు జీవితం కావాలో, ఈ సింహాసన జీవితం కావాలో తేల్చుకోమని ఏది కావాలో చెప్పమని అడిగాడు. ఇవి రెండూ ఖైదులే అయితే భిన్న రకాలు. కనుక ఏవీ వద్దు అన్నాడు. అయితే వెళ్లిపోయి మరల 12 ఏళ్లకు తిరిగి రమ్మని జనకుడు హెచ్చరించాడు.

ఆ యువకుడు బయటకు వచ్చి భారతావని అంతా తిరిగి అచిరకాంలోనే భాగ్యవంతుడై కళ్యాణ్‌గా పేరుగాంచాడు. కల్యాణ్ అంటే అన్ని విధాల ఆనందంగా ఉండుట. 12 ఏళ్లు గడిచాక ఆతడు మళ్లీ జనకుని వద్దకు వచ్చాడు. ద్వారపాలకులతో దర్పంగా తాను భాగ్యవంతుడైన కళ్యాణ్‌ని అని తానెవరో చెప్పమని అడిగినప్పుడు చెప్పాడు. అది విన్న జనకుడు అతనిని తిరిగి వెళ్లిపొమ్మని మరి కొన్నేళ్లు గడిచాక రమ్మనమని ఆదేశించాడు. అందువల్ల కళ్యాణ్ ఇంటికి తిరిగి వెళ్లిపోయాడు. కాలక్రమంలో తనకున్న సర్వస్వం కోల్పోయాడు. మరో పన్నెండేళ్లు గడిచాక, అతడు మళ్లీ జనకుని దగ్గరకు వచ్చాడు. నీవెవరని అడుగగా నేను దౌర్భాగ్యుడైన కళ్యాణ్‌ని అన్నాడు. జనకుడు ఈ సారి అతడ్ని వెనక్కు పంపి మరో 12 నెలలయ్యాక రమ్మన్నాడు.

ఈసారి కళ్యాణ్ ఇలా ఆలోచించ సాగాడు "ఏమిటిదంతా ? నేను మొదట జనకుని దగ్గరకు వెళ్లినప్పుడు నాకేమీ లేదు కానీ నేను దైవాన్ని చూడాలనుకున్నాను. అప్పుడు నేను జెయిల్లోకి తోయబడ్డాను. పిమ్మట సింహాసనా రూఢుడ్నయ్యాను. ఆ తరువాత భాగ్యవంతుడినయ్యాను. ఆ తరువాత కటిక పేదవాడినయ్యాను వీటన్నిటి భావమేమిటి ?" అని ఆలోచించాడు.

12 నెలలు గడిచాక మళ్లీ జనకుని మందిరం చేరినప్పుడు అతన్ని చూచిన ద్వారపాలకుల్లో ఒకడు జాలిపడి "ఓరిమూర్ఖుడా ! ఈ సారన్నా జనకుడు నీవెవరవని ప్రశ్నించినప్పుడు "నాకు తెలియదు" అని చెప్ప"మన్నాడు. కళ్యాణ్ ఈ సలహాను పాటించాడు. అప్పుడు జనకుడు తన దృష్టిని అతనివైపు మరల్చే సరికి కళ్యాణ్ ఈ సకల ప్రపంచపు అన్ని శరీరాల చైతన్యాన్ని కోల్పయాడు. ఇంకా అనంతుడైన భగవంతునిగా ఆయన అంతర్ ఆత్మ యొక్క చైతన్యము మిగిలి

ఉన్నది. దాని భావమేమంటే "నీవు" ఎక్కడ ఉంటే అక్కడ భగవంతుడు ఉండడు. "నేను" పోగొట్టుకుంటే తప్ప మీరు దైవాన్ని వీక్షించలేరు.

ఇప్పుడు నా గురించి చెపుతాను. నేను పిల్లవాడిగా ఉన్నప్పుడు నాకేమీ తెలియదు. ఆధ్యాత్మికతతో ఏం చేయాలో నాకు తెలియదు. మా తండ్రి ఒక డెర్విష్ భారత దేశం, పర్షియా దేశమంతా దైవ ధ్యానంతో భిక్షాటన చేస్తూ తిరిగాడు. హాఫీజ్ తదితర ఎందరో మహనీయుల ఎన్నో గీతాల్ని నాకు ఆయన నేర్పాడు. అయినా వాటిపై నాకు ఇష్టం లేదు. నేను గోలీలాటలు, గాలిపటాలు, క్రికెట్టు వంటివే ఎంచుకున్నాను. నేనాడిన అన్ని ఆటల్లో నేనే నాయకుడిని. ఒకరోజున నేను కాలేజీ నుంచి నా సైకిలుపై అతి వేగంగా వస్తుండగా దారిలో బాబాజాన్ నన్ను పిలిచి నా నుదుటిపై చుంబించింది. 9 నెలల పాటు ఎవరూ ఊహించలేని వ్యధను అనుభవించాను. నా శరీర స్పృతిని కోల్పోయాను. దేని ఎరుక నాకు లేదు. భోజనం లేకుండ తెగ తిరగాను. మా అమ్మ నాకు పిచ్చి పట్టిందను కున్నది. డాక్టరుని పెట్టి వైద్యం చేయించింది. అసలు విషయం మానాన్నకు తెలిసినా బహిర్గత పరచలేదు. డాక్టరులు ఏమీ చేయలేకపోయారు. నేను చైతన్య రహితమగుట వల్ల నాకు నిద్ర పట్టలేదు. ఆ తర్వాత ఎంతో అరుదుగా జరిగేది సంభవించింది. కేవలం అవతారులకు మాత్రమే జరుగుతుంది. ప్రపంచ బాధలన్నీ తమపైకి తీసుకుంటారు కనుక ఎప్పుడైనా మా అన్నయ్య జంషెడ్ తెచ్చి ఇచ్చే టీ తప్ప నేను భోజనమేదీ తినలేదు. ఒక రోజున అకస్మాత్తుగా నేను కాలకృత్యం తీర్చుకోవాల్సి వచ్చింది. బహిర్భూమికి వెళ్లాల్సి వచ్చినా, ఎటువంటి ఆహారము తిననందున ముక్కటం కూడా చాలా కష్టమైంది. కూర్చుని ఎంత ముక్కినా విరేచనము రాలేదు. అప్పుడు నేను నా యీ భౌతిక నేత్రాలతో సకల భువనాలు సుళ్లు తిరగుతున్నట్లు చూడకలిగాను. ఆక్షణం నుంచి దైవానం దానికి బదులు వేధింపు స్థితిలో 9 నెలలు గడిపాను. ఆ బాదల్ని మీరు ఊహించను కూడా ఊహించలేరు. ఆ బాధలనుండి విముక్తి పొందేందుకు నా నుదుటిని గోడలకు నేలకు వేసి కొట్టుకొనే దాన్ని. సకల విశ్వం నా నెత్తిపై ఉన్నదన్నంత భారాన్ని నేను మోయలేకపోయాను" మెహెర్ బాబా తన దివ్యానుభూతిని విశదపరిచారు.

# అందరూ నా వద్దకు రండి

అందరూ నావద్దకు రండి అన్నది అవతారుని పిలుపు. అయితే మాయ తెర అడ్డుండుట వలన మనకా దివ్య సనాతనుని పిలుపు మరుభూమిలోని కేక అవుతోంది. "ఇప్పుడు సమయమాసన్నమైంది. నేనా పిలుపును మరల పునరావృతము చేస్తున్నాను. అందరినీ నా చెంతకు రమ్మనమని పిలుస్తున్నాను. ఆజ్ఞాపిస్తున్నాను" అంటూ మెహెర్ బాబా "ఈ పర్యాయం నా పిలుపును మన్నించి గౌరవించిన వారు ఇంత వరకూ తమ హృదయాల్లో దైవాన్ని ప్రేమించి, ఓర్పుతో భరించిన వారు, పులకాంకితులై, తమ హృదయాల్లో ఉప్పొంగిపోతారు. భగవంతుని ప్రేమ కొరకే దైవాన్ని ప్రేమించాలి. అయితే ఆ ప్రతిధ్వనులకు భయపడి పారిపోయే వారు ఉంటారు. ధైర్యంతో నిలబడే వారూ ఉంటారు. ఇంకొందరు, అసలు, ఆ సర్వోన్నతుడు, సర్వవ్యాపకుడైన పరమాత్మ ఈ పిలుపును, మానవాళికి ఎందుకు ఇవ్వవలసి వచ్చిందో తెలుసుకోలేక చేష్టలుడిగి, అయోమయంలో అర్థం కాక పరితపిస్తారు".

"మరి ఈ అన్ని అనుమానాలు, నమ్మకాలు ఏవెలా ఉన్నప్పటికీ, నా అనంత ప్రేమవల్ల, వీటన్నిటినీ నేనే భరిస్తున్నాను. మరల మరల అవతారునిగా మీ మధ్యకు వస్తునే ఉన్నాను. మానవాళి మత అజ్ఞానంలో మునిగిపోయి, కొట్టుమిట్టాడుతున్న వారికి సహాయ పడాలన్న ఉద్దేశ్యంతో, అసత్యము నుండి సత్యమును వారి కెరుక పరచే సమయం మళ్లీ ఆసన్నమవటం చేత, నేనీరూపంలో మళ్లీ మీ మధ్యకు వచ్చాను. ఆ సనాతనుని అనంత నమ్రత అనే దుస్తులో మలచబడిన ఆదైవ పిలుపు ముందుగా బహుకొద్దిమందికే వినపడుతుంది. దరిమిలా తన అనంత శక్తితో అది క్రమేపీ విస్తరించి, ఆ ప్రతిధ్వని ప్రభావము లెక్క లేనన్ని హృదయఫలకాలపై మార్మోగి, సత్యము యొక్క యదార్థ ధ్వనిగా ప్రతిఫలిస్తుంది."

శక్తి నమ్రతను ప్రకటిస్తుంది. సంకోచ భావం బలహీనతను వ్యక్తం చేస్తుంది. శక్తివంతమైన బాబా పిలుపులో ఈ నమ్రత ఇమిడియున్నది నిజంగా ఎవరైతే గొప్పవారో వారు యథార్థ నమ్ర స్వభావులు. కనుక మనమంతా సాక్షాత్తు ఆ దైవాన్ని ప్రేమించి, ఆయన పిలుపుకు ప్రతిస్పందించి, ఆయనకు వినమ్రులమై, దైవ శిపాయిలుగా మారేదము గాక ! సత్యాన్ని సాధించేందుకు పోరాడెదము

రండు. మనము మన కొరకు కాక, ఇతరుల కొరకు జీవించెదము రండు. మనము సత్యమునే పలికి, సత్యమునే ఆలోచించి, సత్యమునే ఆచరించెదము గాక ! భగవంతుడు అనంతంగా వినయాన్ని కలిగి యుంటాడు. కనుక మనం కూడా వినయంతో ఉండెదము గాక ! మనల్ని చూచి ఈర్ష్యపడే వారిపై సైతం, ప్రేమను కురిపించుట ద్వారా వారిని కూడా దైవోన్ముఖులను చేద్దాం. మన హృదయాలకు అత్యంత ప్రీతిపాత్రమైనది భగవంతుడేనని సకల ప్రపంచము తెలుసుకొను గాక !

దైవాన్ని పూర్తిగా నమ్మండి. అప్పుడాయనే కష్టాలన్నీ తీరుస్తాడు. నమ్మకంతో సర్వమూ ఆయన కల్పించినప్పుడు, ఆయనే సర్వము చూచుకుంటాడు. భగవంతుడ్ని విధేయతతో ప్రేమించండి. అప్పుడే ఆయన బహిర్గతమవుతాడు. నీవు ప్రేమిస్తున్నట్లు నీ హృదయం కూడా ప్రేమించాలి. అప్పుడాయన్ని నీలోనే చూడగలవు.

ఈనాటి యువకులంతా రేపటి పరిపాలకులు. అన్నీ కూడా మొదట్లో చిన్నవిగానే ఉంటాయి. చిన్న విత్తనం మొలకెత్తి పెరిగి మహావృక్షమవుతుంది. చిన్న వాగు మహానది అవుతుంది. చిన్నబిడ్డ పెద్ద మనిషిగా పెరుగుతుంది. అటువంటి మానవుడు తన జీవితంలో నేర్చుకున్న పాఠాలు, అవి మంచివిగా కాని, చెడ్డవిగా కానీ ఉపయోగపడాలంటే యవ్వన దశే మూలం. అయితే అతడు పెరిగి పెద్దవాడైన తర్వాత కూడా, ఆధ్యాత్మక భావంలో తానింకా చిన్న పిల్లవాడితోటే సమానం. ఈ జగత్తొక శిశు విద్యామందిరం వంటిది. మరి మానవుడు ఆధ్యాత్మక పాఠాలు నేర్చుకోవాలంటే ఒక పాఠశాల తప్పక అవుసరం. అందుకే మానవుడు ఎనలేని జన్మలెత్తి పరస్పర విరుద్ధమైన ద్వంద్వానుభవాలనే పాఠాల్ని, ఈ ప్రపంచమనే పాఠశాలలో నేర్చుకుంటున్నాడు. సుఖ - దుఃఖాలు, ఆనందం - బాధ మంచి - చెడు, సిరి సంపద - నిరుపేదరికం మున్నగునవన్నీ ఈ ద్వందానుభవాలే.

అందరి పెరుగుదల ఒక క్రమంలో జరుగుతుంది. అలా క్రమానుగతమైన అభివృద్ధిలో మానవుడు, తన యధార్థ ఆత్మను గ్రహించకలిగి, చిన్న పిల్లల చేష్టలైన, ఈర్ష్య, ద్వేషము, కోపతాపాలు, కామ కోరికలన్నింటినీ, నిస్వార్థ సేవద్వారా, ప్రేమ ద్వారా వదిలి వేయకలుగుతాడు. మరి ఇటువంటి ఆధ్యాత్మిక పాఠశాలలో కూడా అనేక శ్రేణులలో ఉత్తీర్ణుడు కావాల్సి ఉంది. ఇందుకు ధైర్యము,

నిగ్రహము ఎంతో అవసరం. బళ్లో చదువుకునే పిల్లలకు వివిధ బోధనా అంశాలు చెప్పేందుకు వేర్వేరు ఉపాధ్యాయులున్నట్లే, ఈ ఆధ్యాత్మిక పాఠశాలలో కూడా సద్గురువు లుంటారు. వీరు అన్వేషకులు, దైవ జీవితాన్ని గడిపేట్లు మార్గదర్శకత్వం వహిస్తారు. సద్గురువుల్ని కలిసి అనుసరించే అదృష్టం బహుకొద్దిమందికే దొరుకుతుంది. మీకట్టి అవకాశం లభించినప్పుడు, ఆయన కృపను పొందకలిగి, ఆయన ప్రేమకు పాత్రులు కాగలుగుతారు.

మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులు నేర్పే క్రమశిక్షణను మరువకండి. చిన్న చిన్న విషయాల్లో పాటించే క్రమశిక్షణ ఆత్మకు సంబంధించిన క్రమశిక్షణ కెంతగానో దోహదపడుతుంది. ఇతరులను జయించేందుకు ప్రయత్నించవద్దు. మీ ఆత్మను మీరు జయిస్తే, ఈ ప్రపంచాన్నే జయించినట్లు. దీనిని ఆచరించేందుకు శులభమార్గం దేవుని ప్రేమించటం. సకల సృష్టిలో దైవాన్ని చూస్తూ, ఆయన్ని చూచేందుకు ఇప్పటి నుండే ప్రారంభించండి. ఫలితాన్నాశించి ప్రేమించకండి. బహుమానాన్ని కోరి సేవ చేయవద్దు. భగవంతుడు అన్నిటా అంతటా ఉంటాడు. ఈ జగత్తు మీ కొరకున్నదే కాని, మీరు ప్రపంచం కోసం లేరు.

ఈ సత్యాన్ని ఒక చీమ కథలో పోల్చుకోవచ్చును. ఒక చీమ ఎండుటాకు మీద ఒక నదిని దాటుతోంది. దారి మధ్య పెనుగాలి వచ్చి అది ఉన్న ఆకు తిరగబడింది. దాని మీదున్న చీమ నదిలో కొట్టుకుపోతూ "ఈ ప్రపంచం మునిగిపోతోంది. రక్షించండి, రక్షించండి" అంటూ కేకలు పెట్టింది. అంతలో సమీపంలో ఈదుకుంటూ ఒక కప్ప దానికి కనిపించింది. చీమ కేకల్ని ఆ కప్పవిని "ఏమిటి చీమా ! చాలా పిచ్చిగా మాట్లాడుతున్నావు? ప్రపంచం మునిగిపోతున్నదని అంటున్నావేమిటి ? మునిగిపోతున్నది నీవు కాని, ప్రపంచం కాదే !" అనడిగింది. కప్ప ప్రశ్నకు చీమ ప్రతిస్పందిస్తూ "అవును, నిజమే నేను మునిగిపోతే మరి ప్రపంచం నాకిక ఉండదు కదా ! అందుకే నా విషయంలో నేను మునిగిపోతే ఈ ప్రపంచం కూడా మునిగిపోయినట్లే" అని చీమ చెప్పింది.

ఇదే విధంగా సర్వము నీలోనే ఉన్నది. దైవాన్ని నీలోనే చూడకలగాలి. నీవలా ఒకసారి చూడకలిగావంటే దాని అర్థం నీవు పొందతగిన ఏకైక సంపదను సంపాదించినట్లవు తుంది. నేను నా ఆశీస్సులను మీకందరకు అందిస్తున్నాను. మీరంతా దైవాన్ని ప్రేమించి, ఆయిన్ని దర్శించెదరు గాక ! అంటూ బాబా అందించిన అద్భుత సందేశం భావితరాలను మేల్కొలిపే మెహెరామృతమే అవుతుంది.

# రామ ఫంకరాజ్



మెహెర్ బాబా అవతారతత్వాన్ని అవగాహన చేసుకొని ఆయనతో సంబంధం పెరిగి ఆయన్ని దైవీ మానవునిగా అంగీకరించేందుకు కొంత సమయం పడుతుంది. ఇందుకాయన కృప తప్పని సరిగా కావాలి. తన కృప మనపై ప్రసరింపచేసి బాబాను ఆకర్షించేట్లు చేసి, తన వారిని చేసుకుంటాడు. ప్రేమతో ఆయన చెంతకు చేరి ఆయన వారు కావటం మన కర్తవ్యం.

నాగపూర్ నివాసి రమాఫంకరాజ్ 1954లో మెహెర్ బాబా ఆంధ్ర పర్యటనలో బాలనాటు గారితో కలసి, బాబా ద్వితీయాంధ్ర పర్యటనకై చేసిన ఏర్పాట్లను పర్యవేక్షించే అదృష్టం పొందిన ధన్యుడు. ఇతను 1940లో కాలేజీలో చదువుతున్న రోజుల్లో ఆధ్యాత్మిక చింతన పెరిగి, తల్లిదండ్రులకు ఇష్టం లేకపోయినా సాధారణ అన్వేషకునిగా కఠోరమైన ఆధ్యాత్మిక క్రమశిక్షణతో కూడిన జీవితాన్ని ప్రారంభించాడు. చప్పిడి భోజనం, కటిక నేలపై పరుండటం వంటి నియమాలు పాటిస్తూ చివరికి ఒక సాధకుడిగా తయారయ్యాడు. తరచూ ఆధ్యాత్మిక ప్రవచనా సమావేశాల్లో పాల్గొనేవాడు.

ఒకరోజు 1940 జూలై నెలలో డా॥ సి.డి. దేశ్‌ముఖ్ గారి ప్రసంగాన్ని ఫంకరాజ్ వినటం జరిగింది. ఆనాటి మేలుకొలిపేవాని అవసరం గురించిన బాబా సందేశం అతని మనస్సులో హత్తుకు పోయింది. ఫలితంగా బాబా గురించిన ఎన్నో విషయాల్ని విని, చదివి తెలుసుకొని మెహెర్ బాబా ఎడల భక్తిని పెంచుకున్నాడు. తన కుమారునికేదైనా పని కలిపిస్తే కుదుట పడతాడన్న ఉద్దేశ్యంతో తండ్రి తన కార్యాలయంలో గుమస్తా పోష్టు ఒకటి ఖాళీ ఏర్పడితే ఫంకరాజును తాత్కాలికంగా ఉద్యోగం వేయించారు. తనకు వచ్చిన తొలి జీతాన్ని పుచ్చుకొని బాబా దర్శనానికై మెహెరాబాదు వెళ్లాడు, అంతకు ముందెన్నడూ నగరు వెళ్లని ఫంకరాజుకు అహ్మదునగరును చూచిన జ్ఞాపకంతో రైలు పట్టాల వెంట నడుచుకుంటూ రిట్రీటున్న కొండకు చేరుకున్నాడు పెండూ

ద్వారా బాబా ఏకంతంలో గత సంవత్సరంగా ఉన్నట్లు తెలుసుకున్నాడు. ఆ రోజున వారి అతిథిగా వారితో గడిపాడు.

అనుకోకుండా మర్నాడు బాబా మెహెరాబాదు వచ్చారు. విష్ణుమాష్టరుతో ఫంకరాజు బాబా దర్శినానికి వచ్చినట్లు కబురు పంపాడు. తాను ఏకాంత వాసంలో ఉన్నందున దర్శించే వీలు లేదని, కావాలంటే ఖేడ్గాం వెళ్లి నారాయణ మహరాజ్‌ను దర్శించమని కబురు పంపారు. దర్శనం తిరస్కరించటంతో రోడ్డుపై కొండమీద కెళ్లేదారిలో ఒక చెట్టుక్రింద తిష్టవేసి, బాబాను దర్శించాలన్న తితీక్షతో తపించసాగాడు. ఒకరోజున ప్రియతమ బాబా కరుణించి దూరం నుండి తనను దర్శించే అదృష్టాన్ని కలిగించారు. అతడి వినయానికి, నమ్మకానికి ముగ్ధులైన బాబా, ఒక సంవత్సరం గడిచాక మళ్లీ పిలిచినప్పుడు రమ్మనమని, తిరిగి ఇంటికి వెళ్లిపోమ్మనటంతో ఇంటికి తిరుగుముఖం పట్టాడు. సాధన అనే మూఢభావలన్నీ అతనిలో తొలగిపోయి, ఉత్తేజితమైన జీవనం అలవడింది, ప్రియతముని దివ్య దర్శన భాగ్యంతో అతని జీవితంలో ఒక అధ్యాయం మొదలైంది.

1942లో రామాఫంకరాజును డెహెరాడూన్ పిలిపించి, బాబా అతడికి ప్రత్యేకాదేశాలు కొన్ని ఇచ్చి పాటించమన్నారు. తాను బ్రహ్మచారిగా ఉండిపోవాలనుకుంటే, ఎదురైన పరిస్థితులు పెళ్లి చేసుకోమంటారా ? అని బాబానే అడిగేట్లు చేశాయి. మరో బాబా ప్రేమికురాల్ని పెళ్లి చేసుకొని, ఆమెతో వైవాహిక జీవితాన్ని గడమని బాబా ఆదేశించారు. వారి వివాహం తన సమక్షంలో జరగాలని షరతు విధించారు. అనుకూలవతియైన వధువు దొరికేలోపుగా మెహెర్ బాబా నవ జీవనంలోకి వెళ్లిపోవటంతో వీరి వివాహం ఆగిపోయింది. 1950 అక్టోబరు 16న మహాబలేశ్వర్‌లో జరిగిన సమావేశ సందర్భంగా హాజరైన ఫంకరాజ్‌కు ఎదురైన ఇబ్బందిని వారిస్తూ పురుషులు మాత్రమే హాజరైన ఆనాటి సమావేశానికి తన వధువు రానందున, ఫంకరాజ్ పక్కన గుస్తాద్‌జీని వధువు స్థానంలో నిలబడమని ఆదేశించి, దండలు మార్పించి ఫంకరాజ్ వివాహమైపోయినట్లు ఇంటికి వెళ్లి వారి సాంప్రదాయం ప్రకారం పెళ్లి చేసుకోమని ఆదేశించారు. అలా రమాఫంకరాజ్‌కు తనను ప్రేమించవలసిన విధంగా ప్రేమించేట్లు నహాయు పడ్డారు. “యధార్థానందం ఇతరులను ఆనందింపచేయటంలోనే ఉన్నది” అన్న బాబా సందేశం బాబా అవతార కార్యక్రమంలో ఇలా ఎన్నెన్నో మనకు అనుభవమవుతాయి.

# సప్తవిధ ఆనందములు

మెహెర్ బాబా పెదవి విప్పి ఒక్క మాటైనా మాట్లాడలేదు. పరాత్పర పరబ్రహ్మానుభూతిని పొందిన బాబా తన నిజస్థితిని ఎరుకతో తెలుసుకొనిన ఆది మౌనమే తానుగా మూర్తీభవించి ఒక మౌన రూపాన్ని ధరించారు. ఆ రూపం నుండి వెలుపడే దివ్య తేజస్సు ఆయన కన్నుల్లో మిరుమిట్లు గొలిపేది. ఆయన్ని దర్శించిన క్షణంలో ఆ దివ్య తేజస్సే ఒక ఆశీర్వచనానందానుభూతిని కలిగించేది ఆనందాలు ఏడు రకాలు.

1. **విశ్వానందం :-** పిపీలకాది పర్యంతం సకల జీవకోటి అనుభవించేది.
2. **చిదానందం :-** దీనిని మానవులు మాత్రమే అనుభవిస్తారు.
3. **యోగానందం :-** సమాధి స్థితిలో యోగులు అనుభవిస్తారు
4. **ప్రేమానందం :-** పరిపూర్ణ స్థితిలో పొందినవారు అనుభవిస్తారు
5. **ఆత్మానందం :-** అయిదవ భూమికలో ఉండి దైవాన్ని దర్శించే వారు అనుభవిస్తారు.
6. **పూర్ణానందం :-** సర్వకాల సర్వావస్థల యందు భగవంతుని దర్శించే వారు అనుభవిస్తారు.
7. **బ్రహ్మానందం :-** ఆధ్యాత్మిక పరిపూర్ణత్వం పొందిన వారు అనుభవిస్తారు.

# అజ్ఞాపాలన

శిష్యుడు తయారైతేనే గురువు దొరకుతాడు. గురువిచ్చే ఆదేశాల్ని శిష్యుడు పాటించి తీరాలి. అదే విధేయత. అది నీకిష్టమైనా కాకపోయినా, దానిని గురించి వాదించకుండా ఆచరించటం శిష్యుని ధర్మం. ఒక గురువుకు అంకితమైనప్పుడు తనతో చెలరేగే కోరికల్ని తప్పని సరిగా పరిత్యజించాలి. కొందరు మంచి ఆహారాన్ని కోరవచ్చును. మరి కొందరు సుఖమైన జీవితాన్ని అభిళషించవచ్చును. అది కావాలని, ఇది చేయాలని కోరుకోవచ్చును. ఇటువంటి కోరికలతో గురువు వద్దకు వస్తే లాభమేమిటి ? హాయిగా విశ్రాంతిని పొందవచ్చు కదా ! వీటి సాధనకా గురువును సేవించేది ? బాబా విషయంలో

దీనికి విరుద్ధంగా ఈ ఆజ్ఞాపాలన జరిగేది. ఆయన అవతారుడు కనుక ఆయనిచ్చే ఆదేశాలు రెండు రకాలుగా ఉండేవి. ఆయన అనుమతిని కోరి అనుసరించేవి ఒక రకం. ఆయన చెప్పినట్లు చేసేవి ఒక రకం.

ఈ రెంటిని కూడా బాబా చెపితేనే తప్ప మనమెల్లప్పుడూ వీటిని అనుసరించి తీరాలి. ఒకవేళ బాబా మనల్ని "ఫలానా వారిని కలిసి ఇలా నివేదించండి" అని ఆదేశిస్తే, ఆలా చేయటం బబ్ ఆదేశమైనప్పటికీ, ఆలా చేయంలో ఎదుటి వ్యక్తి జారిపోయే అవాంతర పరిస్థితి ఏర్పడవచ్చని నీవు తలిస్తే సరళశైలిలో తగు రీతలో స్పందించి, వ్యవహారం చెడకుండా కొద్ది మార్పులతో వ్యవహరించటం మన విధి. అటువంటప్పుడు మానశిక వ్యధకు గురికావాల్సి వస్తుంది. ఆయన కార్యక్రమంలో అలా బాధ పడటం వల్ల మనకెంతో బలాన్ని, స్ఫూర్తినిస్తుంది. రెండవ విధమెలాంటిదో తెలుసుకుందాం.

బాబా శిష్యుల్లో సరోష్ ఇరాని ఒకరు. ఇతనిని బాబా ఏం చేయమంటే అదే చేశేవాడు. ఏదన్నా పని చేయమన్నప్పుడు, అందులో తాను జయిస్తాడా లేదా అన్న మారాలోచన చేసేవాడు కాదు. ఆయనేం చేయమంటే అది చేయటం తన విధిగా నెరవేర్చేవాడు. ఒకసారి బాబా సరోష్‌ని పిలిపించి వెంటనే తనకు జరూరుగా మూడు లక్షల రూపాయలు కావాలి ఇవ్వమన్నారు. మారాలోచనేదీ చేయకుండా సరోష్ చెక్కు బుక్కుతీసి ఎం.ఎస్. ఇరానీ పేర మూడులక్షల రూపాయలకు చెక్కు వ్రాసి సంతకం చేసి, బాబాకిచ్చి, "బాబా నీవు భగవంతుడివి కదా ! ఇదిగో నీ పేర చెక్కు వ్రాసిచ్చాను. బ్యాంకుకు పంపిమార్చుకో" అన్నాడు.

ఈ అజ్ఞాపాలన గురించి బాబా ఒక చక్కని ఉపమానంతో ఇలా చెప్పారు. సద్గురువు ఒకరు ఒకనాడు తన శిష్యుడొకరిని పిలిచి, తనను సేవించేందుకేదైనా ఉద్యోగం చేయమని ఆదేశించాడు. మళ్లీ మర్నాడు ప్రొద్దుటే ఆ శిష్యుడ్ని పిలిచి, నీవే ఉద్యోగం చేయవద్దు అని ఆదేశించాడు. ముడవనాడు ఆదే శిష్యుడ్ని పిలిచి వెంటనే పెళ్లి చేసుకోమని ఆదేశించాడు. నాల్గవ రోజున వివాహం చేసుకోవద్దన్నాడు. ఈ ఆదేశాలు వింటున్న శిష్యుడు అయోమయంలో పడి గురువును కలుసుకొని 'స్వామి మీరు చేయమన్న ప్రతి పనిని మరల చేయవద్దని నన్ను ఎందుకు ఆదేశిస్తున్నారు ?" అని ప్రశ్నించాడు. ఆందుకు గురువు ఇలా బదిలిచ్చాడు. "చేయుట" అనే మాటకు నీవు చేయటమని అనుకుంటున్నావు. నిజానికి "చేయరానిది" అని దానర్థం. నీ ఇచ్ఛ ప్రకారం చేయాలనేది ప్రతిదీ చేయతగనిదన్నమాట.'

"ప్రజలు సత్యాన్ని కర్మకాండల ద్వారా పొందే ప్రయత్నం చేస్తారు. నియమిత సమయ పాలన లేకుండా అనేక స్టేషనులలో నిలిపివేయబడే రవాణ రైలు వంటి విధానమిది. ఎవరైతే స్థిరంగా విధేయతతో భగవంతుని ధ్యానిస్తారో లేక మానవ సేవలో తమ జీవితాన్ని అంకితం చేస్తారో వారు నిర్దేశిత టైంటేబుల్ ప్రకారం ప్రతిస్టేషనులో ఆగే పాసింజరు రైలు వంటివారు. సత్యసాక్షాత్కార గురువును విధేయతతో అనుసరించే వారు, మరి ఆయన ఆదేశాల్ని పూర్తి విదేయతతో విశ్వాసంతో సర్వార్పణ కావించుకుంటారో వారు, ఏ స్టేషనులోను ఆగకుండా తిన్నగా తన గమ్యస్థానం చేర్చే ప్రత్యేక రైలు వంటి వారు" అని బాబా ప్రవచించారు.

విధేయతతో ఆజ్ఞా పాలన ఎంత కష్టమో మరో సంఘటనలో అనుభవమవుతుంది. బాబా బ్లూ బస్సులో పయనిస్తున్న రోజుల్లో, ఒకసారి మహిళల కందరికీ లంచిగా శాండివిచ్‌లు పంచి పెట్టారు. విలియం డాన్‌కిన్, కిట్టీ డేలీ ప్రక్కనే ఉన్నా అతడికి శాండివిచ్ ఇవ్వలేదు. అందువల్ల కిట్టీ తనకిచ్చిన శాండివిచ్‌లో సగం డాన్‌కిన్‌కి ఇచ్చి ఇద్దరూ కలసితిన్నారు. కొద్దిశేపటికి బాబా బస్సు వద్దకు వచ్చి, "నీవు కూడా తిన్నావా ?" అని డాన్‌కిన్‌ను అడిగితే తిన్నానన్నాడు. ఎవరిచ్చారని అడిగితే కిట్టీ తనకిచ్చినదానిలో సగం నాకు పెట్టిందని చెప్పాడు. దానితో బాబా సింహంలా మారిపోయి, కిట్టీవైపు చూస్తూ "నేను కావాలనే కిట్టీకి మాత్రమే పెట్టి డాన్‌కిన్‌తో ఒక ప్రత్యేక కార్యక్రమం జరగాల్సి ఉండబట్టి అతడికి పెట్టలేదు" అన్నారు.

ఇక్కడ విధేయతతో ఎంతగా ఉన్నప్పటికీ వారు విధిగా బాధల్ని అనుభవిస్తేనే దానిని గురించి సరియైన అగాహన పొందే అవకాశం లభిస్తుంది. ప్రతిదీ బాబా చేతిలోనే ఉంది. మనం బాబాకు ఇవ్వతగిన అత్యున్నత సహాయం విదేయత. ఆయనిచ్చే ఆదేశం వెనుక మన మంచికే తగిన కారణముంటుంది. ఒకసారి బాబా దగ్గరికి చాలా ఏళ్లుగా సన్యాసి జీవితం గడుపుతున్న ఒక సాధువు వచ్చాడు. అతను పాటిస్తున్న నియమాలు, ధర్మాల్ని ఏకరువు పెడుతూ తన కథనంతా బాబా ముందు వెళ్లబోసుకొని ఆశీర్వదించమని కోరాడు. "నీవిటువంటి వెన్ని ఆచరించినా నన్ను మెప్పించలేవు. అయినా నేను చెప్పినట్లు నడుచుకుంటావా ?" అని బాబా అనే సరికి తప్పకాచరిస్తానని బదులిచ్చాడు. "అయితే నీవిప్పుడు భిక్షుక వృత్తితో జీవించుటకనుమతిస్తున్నాను. అయితే దానికి తోడు నీవు రోజూ

ఒక సీసా సారాయి త్రాగాలి'' అనే సరికి సన్యాసి అదిరిపోయాడు. చాలా ఏళ్ల నుంచి తన శరీరాన్ని పరిశుద్ధ పరచుకుంటున్నాడు. మరి దీనికి విరుద్ధంగా అపరిశుద్ధమొనర్చవలసిన ఆదేశం ఎదురైంది. నేనా పని చేయనని క్షమించమని వేడుకున్నాడు. భిక్షాటన చేసే తన వద్ద పైసా లేదు. భిక్షగా సారాయి, అడగకూడదు. మరి సీసా నెలా కొనాలన్న ఊహ మెదలింది. అంతలో బాబా కల్పించుకొని, డబ్బు గురించి బాధపడకు. దాని విషయం నేను చూస్తాను. ఒక వేళ ఉచితంగా సారాయి దొరికితే త్రాగుతావా ? అనడిగారు. నేను సారాయి త్రాగలేనని కచ్చితంగా చెప్పాడు. "నీవిప్పటి వరకూ గడిపిన జీవితం గడిపేందుకు చాలా సులభమైందే. కానీ నాకు విధేయుడవగుట చాలా కష్టం. అయినా నీవు నా కోసం పని చేస్తేనేను చాలా సంతోషిస్తాను. ఇతరులు వండి పెట్టిందే తిను' ' అనే సరికి అంగీకరించి వెళ్లిపోయాడు. భిక్షాటన చేయకుండా స్థిరంగా ఒకచోట మకాం చేసి ఉండే సరికి భక్తులు వంట ద్రవ్యాలందించటంతో తానే వండుకు తినాల్సి వచ్చింది. ఒక విధంగా నియమోల్లంఘన జరిగి ఆరోగ్యం పాడైంది. ఫలితంగా యాచిస్తూ బయలు దేరగా సమృద్ధిగా ఆహారం లభించి త్వరలోనే ఆరోగ్యం బాగైంది. గుర్వాజ్ఞ ఫలితాన్ని రుచి చూచాడు.

## మరణాంతర జీవితం

ఈ సృష్టికి ముందు ఏ ఆత్మలైతె పరమాత్మలోనే అంతర్లీనమై ఉన్నాయో, అవి ప్రథమంగా సృష్టిలో సంస్కారాల ద్వారా రూపు ధరించి అజ్ఞానాన్ని సంపాదించుట వల్ల జ్ఞానాన్ని పొందలేక మానవుడు సృష్టి పరిణామ క్రమంలో జరిగే జనన మరణాల వలయంలో చిక్కుకొని పరమాత్మానుభవాన్ని పొందలేకపోతున్నాడు. మానవుడు గత జన్మలో సేకరించిన సంస్కారలకు అనుభవిస్తూనే, సరికొత్త సంస్కారాలను ఎప్పటి కప్పుడు పోగు చేసుకోవటం వల్ల తిరిగి వాటిని అనుభవించేందుకు మరో కొత్త ఉపాధిని ఆశ్రయించాల్సి వస్తోంది. జీవాత్మ స్థూల దేహాన్ని విడిచినప్పుడు మరో కొత్త దేహాన్ని ఆశ్రయించే ముందు 3 లేక 4 రోజుల పాటు తన సూక్ష్మ, మానసిక దేహాల్ని నిలుపుకొని గతించిన శరీర సంబంధ పరిసరాల్లో ఉంటుంది. మెహెర్ బాబా తన "భగవద్వచనము"లో

దీనిని గురించి విపులంగా వివరించారు. జనన మరణములు సంస్కార జన్యములే తప్ప వేరేవి కాదు. కేవలం అవి మాయా పూరిత దృశ్యాలు మాత్రమే. నిజమైన మరణం, జనన మరణ రహితుడైన దైవంలో జన్మించినప్పుడే లభిస్తుంది. గత జన్మలో చేసుకున్న సంచిత సంస్కారాలే మానవునికి తదుపరి జన్మనిస్తాయి. అందుకే మానవ దేహము అంటే సంచిత సంస్కారాలే తప్ప మరేది కాదని బాబా చెప్పారు. "మరణమనేది ఒక అదృష్టము. లెక్కలేనన్ని జీవన ఘట్టాల ద్వారా పయనిస్తూ ఆత్మ తన సంస్కారాల్ని ఖర్చు చేయుటకు కర్మచట్టం (Divine law) ప్రకారం పునర్జన్మ లభించినందున, ఆ జన్మలో పోగు చేసుకొన్న సంస్కారాలు వదిలించుకొనే అదృష్టం లభిస్తుంది. ప్రతి జన్మలోను పోగు చేసుకొనే సంస్కారాలే తదుపరి జన్మయొక్క అదృష్టాన్ని నిర్దేశిస్తాయి" అని బాబా వివరించారు.

దీనిని బట్టి మానవునికి ఈ జన్మలో చేసుకున్న సంస్కారాలు వచ్చే జన్మను నిర్దేశిస్తున్నాయని అవగతమవుతుంది. జననము అంటే సంస్కారాల కారణంగా జీవాత్మ ఒక శిరరము నుండి మరో శరీరానికి సాగిపోవటమన్న మాట. కుటుంబంలో ఎవరైనా జన్మించినప్పుడు ఆనందించటం, ఎవరన్నా మరణించినప్పుడు దుఃఖించటం అందరికీ తెలిసిందే. నిజానికి అలా చేయాల్సిన అవసరం లేదు. జీవాత్మ ఆ జన్మలో పోగుచేసుకున్న సంస్కారాల్ని అనుభవించవలసి యున్నందున, అది తప్పక ఆ స్థూల శరీరాన్ని జీవాత్మ వదలగానే మరణించిందని విలపిస్తారు. మళ్లీ అదే జీవాత్మ మిగిలి ఉన్న సంస్కారాల్ని అనుభవించుటకు మరో కొత్త దేహాన్ని ఆశ్రయించి జన్మించినప్పుడు జననము అంటున్నారు. ఇక్కడ మరణించిందనుకున్న జీవాత్మే ఈ కొత్త ఉపాధిలో జన్మించుట జరిగింది.

జీవాత్మ మానవ శరీరాన్ని వదిలినప్పుడు జరిగే మరణం యధార్థ మరణం కాదు. జీవాత్మ ఇక్కడ ఒక యాతనా శరీరాన్ని వదిలిందే కాని సూక్ష్మ మానసిక శరీరాలతో పాటు సంస్కారములు, చైతన్యము, మనస్సు వీటన్నింటినీ నిలుపుకొని తన ప్రయాణాన్ని కొనసాగిస్తుంది. మరణాంతరము జీవాత్మ చేసే ప్రయాణాల గురించి మెహెర్ బాబా చాలా వివరించారు. స్థూల సూక్ష్మ లోకాలకు మధ్య ఉండే యాతనాలోకం చేరి ఆత్మ అక్కడ 3 లేక 4 రోజులు ఉంటుంది. తన గత జన్మల కర్మలన్నింటినీ సింహావలోకనం చేసుకొని వాటికి అనుగుణ్యంగా అక్కడే స్వర్గ నరక స్థితులను అనుభవిస్తుంది. మంచి సంస్కారాలు ఎక్కువగా ఉండే స్వర్గ స్థితిని, చెడు సంస్కారాలు ఎక్కువగా ఉండే నరక స్థితులను అనుభవిస్తుంది.

స్వర్గ నరకాలనేవి ప్రదేశాలు కావని దేహం విడిచిన పిదప ఆత్మ పొందే అనుభవ స్థితులని బాబా చెప్పారు. జీవాత్మ ఇలా మరణానంతరము యాతనా లోకంలో 3, 4 రోజులు గడిపి మంచి, చెడు సంస్కారాలు సమతుల్య స్థితికి చేరుకోగానే మిగిలినవాటిని అనుభవించుటకు మరో జన్మ తీసుకోవటం జరుగుతుందని చెపుతూ బాబా జనన, మరణముల గురించి ఒక ఉదాహరణ చెప్పారు. ప్రతి వారు చావాలనో, బ్రతకాలనో, కోరుకుంటారు. సాధారణ మరణము ప్రమాదము కాదు. ఆశ్చర్యకరమైనదసలే కాదు. మరణము అంటే ఒక సాహసము నుండి మరో సాహసానికి పయనించుట వంటిది. సాహస కార్య నిర్వనహణకు ఒక ఉపాధి తప్పని సరి. మీరేదైనా శుభకార్యానికి హాజరు కావాలనుకుంటే, ఆ సందర్భానికి అనుగుణంగా ఉండే దుస్తులు ధరించి వెళతారు. ఒక వివాహానికి వెళ్లాలనుకుంటే వేరే బట్టలు మార్చి కట్టుకుంటారు. లేదా అంత్యక్రియలకు హాజరు కావల్సివస్తే దానికి అనువైన బట్టలు కట్టుకుంటారు. అలాగే జీవాత్మకు అది చేసే ప్రతి సాహసానికి కూడ అనువైన దుస్తులు కావలసి ఉన్నది అన్నారు బాబా

మరణం కలిగినప్పుడు యాతనా శరీరం సూక్ష్మ శరీరము నుండి విడిపోతుందని, స్థూల శరీరం రాలి పోతుందని బాబా చెప్పారు. మృత దేహాన్ని ఖననం చేసినా, దహనం చేసినా సంస్కారములు, చైతన్య, సూక్ష్మ, మానశిక దేహాలతో పాటు ఆత్మ నిర్గమించినందున ఇహ ఆ శరీరము సంబంధం మరెంత మాత్రం ఉండదు. కనుక దానికే ప్రాముఖ్యత లేదు. అయితే స్థూల శరీరంతో విడిపోయిన తర్వాత కూడా మనస్సు కేవలం 4 రోజుల పాటు సంబంధం కలిగి ఉంటుందని బాబా చెప్పారు. కొన్ని ఆత్మలు 10 రోజుల లేదా మరికొన్ని 40 రోజులు పాటు కూడ సంబందము పెట్టుకోవచ్చునన్నారు. అందుకే పార్సీలు మరణించిన నాలుగవ రోజున చహరం అనే శ్రాద్ధ ఖర్మ చేస్తారు. హిందువుల 12వ రోజున పెద్ద ఖర్మ నిర్వహిస్తారు. క్రిష్టియన్లు, మహ్మదీయులు 40వ రోజున శ్రాద్ధ ఖర్మలు చేస్తారు. జీవాత్మ స్థూల శరీరంతో సులభంగా తెగ తెంపులు చేసుకొని సరళంగా విడిపోయి యాతనా లోకంలోకి పయనించుటకు ఆ 12 రోజులు చేసే ప్రార్థనలు ఎంతో సహకరిస్తాయి అని బాబా చెప్పారు. అలా కాకుండా ఏడుపులు, పెడ బొబ్బలతో రోదిస్తే ఆ జీవాత్మ స్థూల శరీరంతో తెగ తెంపులు చేసుకొనుట కష్టమవుతుంది. అంటే తన ఏడ్పులు వలన జీవాత్మను యాతనా లోకంలోకి చేరుటను మనమే అడ్డగిస్తున్నామన్న మాట.

మరణాల్లో స్వాభావిక మరణం, అస్వాభావిక మరణం అని ఉన్నాయి. వృద్ధులై వార్ధక్యంలో మరణించుటను స్వాభావిక మరణం అంటారు. దీని వల్ల జీవాత్మ యాతనా లోకం చేరి స్వర్గ నరక అనుభూతులను అనుభవించి మరో ఉపాధితో జన్మిస్తుంది. అస్వాభిక మరణంలో ఇలా జరుగదు. హత్య కావింపబడుట, ప్రమాదంలో మరణించడమో జరిగితే దానిని అస్వాభావిక మరణం అంటారు. ఈ మరణమందు స్థూల శరీరపు యాతనా కోశము విడివడదు. కనుక జీవాత్మ యాతనా శరీరంతోను సుదీర్ఘ కాలం యాతనా లోకంలోనే నిలిచిపోయి పిశాచంగా తయారవుతుంది. దయ్యమైన ఆ జీవాత్మ కక్ష సాధించుటకు తిరుగుతూ ప్రపంచములోకి వస్తుంది. అలాగే కొందరు ఆత్మహత్యలు చేసుకుంటారు. ఈ ఆత్మహత్యల్లో కూడా చాలా రకాలున్నట్లు బాబా వివరించారు. జీవితంలో ఓటమి పాలై, కృంగిపోయి చేసుకొనే అత్మహత్య అత్యంత నికృష్టనమైనది. దానికి పాల్పడిన వ్యక్తి కూడా పిశాచమవుతాడు. భయంకర వ్యాధుల్ని తట్టుకోలేక నిద్రమాత్రుల మ్రింగి మరణించేవారు, నికృష్ట పేదరికాన్ని భరించలేక ఆత్మహత్యకు పాల్పడే వారు పిశాచాలుగా మారరు కాని, నరక బాధలు అనుభవించాల్సి ఉంటుంది. కనుక కొత్త ఉపాధి పొందేందుకు చాలా కాలం పడుతుంది. వీటికంటే ఉన్నత స్థాయికి చెందిన ఆత్మహత్యలు మరికొన్ని ఉన్నాయి. సదాశయంతో జాతి క్షేమం కోరి ఆశయ సిద్ధి కోసం నిరాహార దీక్షను అచరించే సమయంలో మరణము సంభవిస్తే అట్టి ఆత్మకు స్వర్గ స్థితి మాత్రమే ప్రాప్తిస్తుంది. భగవత్సాక్షాత్కారం కోరి ప్రాణాలు త్యజిస్తే అది మరింత ఉన్నతమైన ఆత్మహత్య అవుతుంది. ఈ ఆత్మ స్వర్గస్థితినే అనుభవిస్తుంది. ఈ మరణానికి ముందు ఒక వేళ అన్యచింతన కలిగి మరి దేని గురించైనా ఆలోచిస్తే నరకస్థితికే పోతాడు. భగవంతుడి గురించే మరణిస్తే వచ్చే మరణం యదార్థ మరణం. మరో రకపు మరణమున్నది. దానిని సహజాతీత మరణమంటారు. తన ఇచ్ఛాను గుణ్యంగా దేహ త్యాగం చేసిన సంత్ జ్ఞానేశ్వర్ వంటి యోగులీకోవకు చెందుతారు. ఈ మరణం గురించి బాబా ఇంకా ఇలా వివరించారు.

"మరణమనేది పైకి మహా భయంకరంగా కనిపిస్తుంది. తెలియని అజ్ఞానమే ఈ భయానికి కారణం. ఈ భయానికి మీరు కొలవలేరు. ఎందుకంటే అసలిది భయపడాల్సిన విషయం కాదు. ఇది అతి స్వల్ప విషయం. ప్రతిరోజు మీరు గాఢ నిద్రపోతారు. అంటే మీరు మరణిస్తున్నారన్న మాటే. అయితే

తెలియని ఈ విషయాన్ని మీరు పట్టించుకోరు. ఎందుకంటే నిద్రపోతే మళ్లీ మేలుకుంటామన్న ఆలోచన మీకున్నది. మరి మరనం కూడా నిద్ర వంటిదే. మరణించినప్పుడు మరో రూంపలో మేల్కొంటున్నారు. అంతే తేడా. ఈ మరణం వెనుక పూర్తి అనిశ్చిత ఉన్నది. మీరు గాఢ నిద్రలో ఉన్నప్పుడు మీ శరీరము మృతప్రాయమే. కాని ఊపిరి ద్వారా ఆ శరీరంతో సంబంధము పెట్టుకోవటం వల్ల మీరు అదే శరీంతో మేల్కొంటున్నారు. మరణించినప్పుడు ఊపిరి బంధం ఈ శరీరంతో ఎంత మాత్రం ఉండదు. కనుక, మీరు మరో రూపంలో మేల్కొంటున్నారు. ఇలా ఒక సాహసం తర్వాత మరో దానికి, మీరు నన్ను గుర్తించే వరకు కొనసాగుతూనే ఉంటుంది. అందుకే మరణమంటే భయపడకండి.''

ఉన్నది ఒకే జననం, ఒకే మరణం. కానీ మన జీవిత కాలంలో మనకు అనుభవమయ్యే స్వల్ప జనన మరణాలన్నీ వాయుస్థితి నుండి, పరిణామక్రమం ద్వారా పురోగమించి, అంతఃపరిణామ దశలన్నీ అనుభవించి, ఆత్మ సాక్షాత్కారం పొందే వరకు జరిగే బృహత్తర జీవితంలో కేవలం మైలురాళ్లే తప్ప మరేమీ కాదు. మానవుడు పునర్జన్మ పొందిన ప్రతిసారి గత జన్మ సంబంధ సంస్కారాల్ని అనుభవించాలనటంలో అర్థం, ఆ సంస్కారములను అనుభవించుటకు వాటికి భిన్నమైన సంస్కారములు (మంచికి చెడు - చెడుకు మంచి) అనుభవిస్తే కాని అవి సమతూకం కావు. గత జన్మ సంస్కారముల నుండి విముక్తి చెందాలంటే వాటికి భిన్నమైన అనుభవాలు పొందితీరాలి. ఒక జన్మలో పురుషుడైతే, తదుపరి జన్మలో స్త్రీ కావచ్చును. ఒకసారి అమెరికాలో పుడితే మరల మరో జన్మలో ఇండియాలో లేక మరే దేశంలోనో పుట్టవచ్చు. కనుక సంస్కారాలను విభిన్నం చేయుటకు వాటిని తప్పక అనుభివించి తీరాలని బాబా వివరించారు.

ఈ జీవితం యొక్క ధ్యేయం భగవంతుని ప్రేమించటం. దాని గమ్యం దైవంలో ఐక్యమవటం. అయితే అహంభావపు మనస్సు ఈ జీవితాన్ని అర్థం చేసుకోలేక అజ్ఞానంతో తిరస్కరించటం వల్ల సంస్కార భారం పెంచుకొని బద్ధ జీవితం నుండి విముక్తి పొందలేక పోతుంది. స్వతహాగా సంప్రాప్తమయ్యే కర్మఫలాల వల్ల మళ్లీ, మళ్లీ పుడుతూ, చస్తూ వాటని అనుభవించాల్సి వస్తోంది. విషయ వాంఛలకు బంధాలు కాకుండా జీవిత గమ్యాన్ని చేర్చేందుకు ప్రియతమ బాబా ఎనలేని కృషి చేశారు. ప్రగతి పథంలో జీవన స్రవంతి అంతర్ ముఖమై

అవిచ్ఛిన్నంగా పురోగమిస్తూ, సత్యపథాన్ని చేరుటకు, అంతర్గతమైన దైవత్వాన్ని తెలుసుకొనుటకు జన్మ పరంపర గొప్ప సహాయకారి అవుతుంది. కనుకనే ఆ పరమాత్మ తత్వానుభూతని మనలో కలిగించేందుకే మెహెర్ బాబా సాక్షాత్తూ అవతారుడిగా మన మధ్యకు వచ్చారు. బహు జన్మార్జిత కర్మల నుండి విముక్తిల్ని చేయడమే ఆయన చేసిన కార్యక్రమము. పంచభూతాత్మకమైన ఈ స్థూల శరీరం గత జన్మల కర్మఫలాన్ని అనుభవించుటకు నిలయమైన సాధనమని మనకు తెలిపేందుకే మెహెర్ బాబా ఈ సృష్టి రహస్యాన్ని వేదాంతపరంగా కాక, అధునిక మానవుడు అవగాహన చేసుకోగలిగేట్లుగా, సవివరణలతో ఆధునిక శాస్త్రబద్ధంగా వివరించారు. తానెవరో, తన గమ్యమేమిటో నన్న స్వీయసత్యాన్ని తెలుసుకోగలిగే అవకాశం ఒక్క మానవ జన్మకే ఉన్నందున, రాక రాక లభించిన అత్యంత దుర్లభమైన ఈ మానవ జన్మని వృధా చేసుకోక, సార్థక పరచుటకు ప్రియతమ బాబా అందించిన సత్య సందేశాల్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకొని, దారి తప్పి భౌతిక మాయలో చిక్కుకోకుండా గమ్యాన్ని చేరే ప్రయత్నం చేయటం మనవంతు కావాలి.

## సప్తవర్ణ పతాకం

ఏడు నిజములు, సప్త జ్ఞాన భూమికలను మానవునిలోని విభిన్న సంస్కారములతో సంధాన పరచే ప్రయత్నాన్ని బాబా తరచూ సూచించేవారు. బాబా మెహెరాబాదులో ఆశ్రమాన్ని నెలకొల్పిన తొలి రోజుల్లో తన ఏకాంత వాసమునకై నిర్మించిన జోంపడిలో గడిపేవారు. ఆ రోజుల్లో తన కార్యక్రమాలకు ప్రతీకగా ఉండేట్లు కొత్తగా ఒక జండా ఉంటే బాగుంటుందని సంకల్పించారు. ఆ జండా ఎలా ఉండాలో సూచిచమని తన మండలిని కోరగా తమ ఇష్టం వచ్చినట్లు తలా ఒక రంగు సూచించారు. అప్పుడు బాబా, తన పతాకంలో ఏడు రంగులు ఉండాలని, వాటి వరుస క్రమము ఇంద్రధనస్సులోని ఏడు రంగుల క్రమంలో కొద్ది తేడాతో ఉండాలని నిర్ణయించారు. అయితే ఈ ఏడు రంగులు భౌతిక సంస్కారాలకు చిహ్నాము, చైతన్యపు సప్త భూమికలను కూడా సూచిస్తాయి. ఈ సప్త వర్ణ పతాకములోని ఏడు రంగులు, సర్వమును తనలోనే ఇముడ్చుకొని ప్రతిదీతానైయున్న పురాణ పురుషుని జండాలో, వరుస క్రమంలో అడుగున ఉండే ఎరుపు అనగా కుంకుమ రంగులో ఉండాలని శాశించారు. ఈ రంగు

మానవునిలోని పశుత్వ స్వభావాన్ని సూచిస్తుంది. పేరుకున్న గాఢమైన కామపూరిత సంస్కారాలకు ఎరుపు సంకేతము. ఈ ఎరుపురంగుకు పైన వైఢూర్యము, ఊదా, పసుపు, ఆకుపచ్చ, నారింజ పండు రంగు ఆఖరులో అన్నిటికంటే పైన నీలవర్ణం ఉండాలి. అంటే వినీల నిర్మల నీలాకాశం రంగు మానవుని యందతర్నిహితమై యున్న దివ్యత్వానికి సూచిక సత్యప్రేమలకు సంకేతమే ఈ సప్తవర్ణ పతాకము. ఇది సర్కులకు, జాతి, కుల, మత, దేశ, లింగ వివక్షత లేకుండా శాశ్వత సత్యాన్ని ప్రబోధిస్తుంది. అవేమంటే (1) అస్థిత్వమున్న భగవంతుడొక్కడు మాత్రమే ఉన్నాడు ఇతరమేదీ లేదు. (2) మానవ జీవితమంతా పారమార్థికముగా చూస్తే ఒక్కటే. (3) ధ్యానము, ప్రార్ధనలు, ధాన ధర్మాలు ప్రజా సేవ, మొదలైన సాధనలన్నిటికీ ఉన్న ప్రయోజనం ఒక్కటే. అది మానవ హృదయ క్షేత్రంలో ప్రేమ బీజాన్ని నాటి మొలకెత్తించి, దానిని వృద్ధి చేయడమే.

మానవుడి గమ్యం దైవాన్ని చేరటం - భగవదైక్యం చెందటం. మాయాపూరిత ద్వంద్వానుభవాల నుండి విముక్తి కలిగితేకాని తన గమ్యం చేరే అవకాశం రాదు. కానీ నీవు వేరు, నేను వేరన్న అజ్ఞానం ఉన్నంతకాలం మిధ్యా భూతముల ద్వందానుభవాలు అనుభవించక తప్పదు. బాబా ఈ అజ్ఞానాన్ని ఏడు రంగులున్న ఏడు మడతల ముసుగుతో పోల్చారు. మానవుడ్ని తన యధార్థ స్థితి నుండి మరుగు పరుస్తున్న అజ్ఞానం మేలి ముసుగులోని ఏడు మడతలు. ఒక్కొక్క మడత ఒక్కోరంగులో ఉంటుంది. ఒక్కొక్క మడతకు విడిగా ఒక్కొక్క ముడి ఉంటుంది. అంటే ఎడు మడతలకు ఏడు ముడులుంటాయి. ఏడు రంగులూ ప్రాధమికమైన ఏడు సంస్కారాలకు సంబంధించిన ఏడు మూలకోరికలకు నిదర్శనం. ఈ ఏడు మూల కోరకలకు ఉత్పత్తి స్థానం మనముఖమే. ఈ ముఖంలో ఇంద్రియ జ్ఞానాన్ని కలిగించే ఏడు రంధ్రాలున్నాయి. నోరు, కుడి ముక్కు, ఎడమ ముక్కు, కుడి చెవి, ఎడమ చెవి, కుడి కన్ను, ఎడమకన్ను ఇవి కలిగించే ఏడు మూల సంస్కారాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మధమత్సర్యాదులకు సంబంధించిన మూల కోరికలగుతున్నవి. నిజానికి ఆత్మ ఎప్పుడూ ఆది అంతము లేని భగవంతుడే అయినప్పటికీ, ఏడు రకాల భౌతిక స్థితులలోకి దిగివచ్చినప్పుడు, మిధ్యాభ్రాంతి ప్రారంభమై 7వ భూమికను అధిరోహించినప్పుడు ఈ భ్రాంతి అంతమవుతుంది. ఈ సత్యాన్ని సులభంగా

అవగాహన చేసుకొనుటకు బాబా ఏడు రంగుల జండాను మనకు ప్రసాదించారు.

భౌతిక సంస్కార బంధాల నుండి విముక్తి పొంది నీలి రంగు సూచించే భగవంతునిలో సంలీనం చెందేందుకు చేసే ప్రయాణాన్ని ఈ పతాకంలోని రంగుల క్రమము సూచిస్తుందని బాబా వివరించి తన శిష్యుల్లో ఒకడైన నావల్ తలాతిని బొంబాయి పంపించి పై క్రమంలో ఏడు రంగుల జండాను కుట్టించి తెప్పించి బాబా స్వయంగా తన జోంపడి ముందు 23-4-1924న ఈ సప్తవర్ణ పతాకాన్ని ఆవిష్కరించారు. అప్పటి నుండి, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న బాబా ప్రేమికులందరూ బాబా కార్యక్రమాల్లోను, తమ సెంటర్లలోను ఈ సప్తవర్ణ పతాకాన్ని ఎగరవేయటం జరుగుతోంది.

## బాబా కొంగు విలువ

సకల మానవాళికి ఆధ్యాత్మిక శ్రేయస్సును చేకూర్చుడమే, మెహెర్ అవతార లక్ష్యం. అవతారమనేది పరోపకారం కోసమే కాని, తాను అవతారుడనని చెప్పుకొనుటకు కాదని బాబా చెప్పేవారు. నరుణ్ణి నారాయణుడిగా తృటిలో మార్చగల శక్తి ఆయనకున్నది. కనుక తన ఆశీస్సులందు కొనుటకు తనను తెలుసుకొని, ప్రేమించమని, తన చెంతకు రమ్మనమనే వారు. ఆయన శక్తి జ్ఞానానంద స్వరూపుడైనందున బాహ్య సహాయం ఆయన కేమీ అక్కర్లేదు. మానవజాతి ఆనందంగా ఉండటం, వారిని స్వల్ప వ్యవధిలో దైవాన్ని తెలుసుకొనేట్లు చేయడం బాబా ఆశయాలు. ఆయన దర్శనము, స్పర్శ, వ కిగత ఆత్మకు సహాయపడేవి మెహెర్ బాబా తన దైవాధికారంతో చెపుతున్నానంటూ "నేనాదివ్య సనాతనుడను సర్వోన్నతుడను. నన్ను యథార్థంగా ప్రేమించేవారికి నేను బానిసను" అని ప్రవచించారు. ఇటువంటి ప్రేమను పొందా టే ఆయనతో మనకు బంధం ఏర్పడాలి. ఆయన కొంగును ధృడంగా పట్టుకొంటేనే ఈ బంధం ఏర్పడుతుంది. అటువంటి బంధం ఏర్పడేట్లు తీర్చిదిద్దేందుకు బాబా ఒక ఉపమానం చెప్పారు.

ఒకప్పుడు ఒక రాజుండేవాడు. ఆధ్యాత్మికంగా ఆయన పురోభివృద్ధి చెందిన ఆత్మ. ఆయన దగ్గర ఒక బానిస ఉండేవాడు. అతని పేరు అయజు. ఈ బానిస చాలా ఉత్కృష్టమైన వ్యక్తి. ఇతడు తన యజమానితో సరితూగగల

సరి సమానమైన బానిస వంటివాడై నందున తన యజమాని సన్నిహితంగా ఉండేవాడు. యజమానైన రాజు తన రాజ్యవ్యవహారాల్లో ఈ బానిస మాటే అంత్య మాటగా తీసుకొనేవాడు. తొలుత తన మంత్రివర్గంతో వారి అభిప్రాయాలు చెప్పమని రాజు కోరేవాడు. ఆ విషయంలో ఒక నిర్ణయం తీసుకోపోయే ముందు ఈ బానిస సలహా తీసుకునేవాడు. అలా చేయటం వల్ల, మంత్రులంతా కుపితులయ్యేవారు. చాలా అసంతుష్టులయ్యేవారు. రాజు ఏదేని నిర్ణయం తీసుకోపోయే ముందు మంత్రులు తమ అభిప్రాయాన్ని చెప్పాల్సి వస్తోంది. కాని చివరికి ఆయజు చెప్పే సలహాకే రాజు విలువ ఇస్తున్నాడు దీనివల్ల వ్యధ చెందుతున్న మంత్రుల్ని, సత్యాన్ని తెలుసుకొనేట్లు చేయుటకు రాజు చక్కని పరీక్ష పెట్టాడు.

ఒక రోజున ఆ రాజు తన సభను సమావేశ పరిచాడు. రాజముద్రిక అయిన తన ఉంగరాన్ని చూపిస్తూ తన ముందున్న బల్లపై ఉంచాడు. ఈ ముద్రిక తన రాజ్యకార్య కలాపాలను నెరవేర్చేందుకిచ్చే ఆదేశాల్ని, చట్టాలను అమలు చేయుటకు మొహరుగా ఉపయోగపడే ఉంగరమది. ఆ ఉంగరాన్ని తన సభా సదులకు మంత్రి పుంగవులకు చూపించి "ఈ ఉంగరపు విలువ ఎంత ? దీని విలువ ఎంతో లెక్కగట్టి చెప్పండి ?" అని ప్రశ్నించాడు రాజు. సభాసదులు,. అమాత్యశేఖరులు, ఆ ఉంగరపు ఖరీదును బేరీజు వేసి, తమ తమ అభిప్రాయాల్ని వ్యక్తం చేశారు. అంతలో నగల వర్తకులను కూడా పిలిపించి, వారి చేతకూడా దాని వెలను కట్టించారు. చివరకు అంతా తలా ఒక ధరను సూచించగా, రాజు ఆయజు వైపు తిరిగి, ఈ ఉంగరం ఖరీదు ఎంత ? అని అడిగారు. వెంటనే, మరుక్షణంలో నే ఆయజు "ఈ ఉంగరం ఆ బల్లపై ఉన్నంత సేపూ ఏమీ విలువ లేనిది. అది నా ప్రభువు వేలికి ఉన్న వెంటనే వెలకట్టలేనిదవు తుంది. అప్పుడది అమూల్యమైనది" అని వివరించాడు.

ఈ కథను బాబా స్వయంగా తన శిష్యులకు చెప్పి "మీరు నా కొంగును పట్టుకొని ఉన్నంత వరకు మీరు వెలకట్టలేని అమూల్యమైన వారవుతారు. ఎవరూ మీ విలువను తెలుసుకోలేనప్పటికీ, మీరు మాత్రం అమూల్యమైన వారవుతారు. ఒకవేళ మీరు నా కొంగును జారవిడిస్తే ఆ మరుక్షణమే మీరు ఏ విలువ లేని వారవుతారు. ఈ ప్రపంచంలో మీకు ఎంత గొప్పతనము ఉన్నాలేదా, అపార ధన సంపదలున్నా, అవేమి మిమ్ములను రాణింప చేయలేవు" అని ప్రభోదించారు.

# న్యాయనిర్ణేత

ఒకప్పుడు మెహెర్ బాబా జడ్జీలకు జడ్జిగా తనను గురించి ఒక న్యాయ నిర్ణేతగా వివరించారు. యధార్ధ న్యాయ నిర్ణేతగా తనకు, భౌతిక న్యాయాధిపతులకు మధ్య ఉండే భేదాన్ని గురించి చెప్పారు. ప్రాపంచిక న్యాయాధిపతులు దోషి యొక్క దోషాన్ని ఋజువు చేసి వారిని శిక్షిస్తారు. నేనూ దోషి చేసిన దోషాన్ని ఋజువు చేస్తాను. కానీ క్షమించి పశ్చాత్తాప పడేట్లు చేసి వదిలేస్తాను'' అన్నారు. మెహెర్‌బాబా తరచుగా ప్రయాణాలు జరుపుతూ మండలిని వెంట బెట్టుకు వెళ్లేవారు. వారి ప్రయాణాల్లో లాడ్జిలు, అతిధి గృహాలు, ధర్మ సత్రములు విశ్రాంతి ప్రదేశాలుగా ఎంచుకొనేవారు. ఒక్కొక్కప్పుడు గదులు అద్దెకు తీసుకున్నా వారంతా నేలపైనే పడుకొనేవారు. భవంతుల్లో పడుకున్నా రైల్వేప్లాటు ఫారాలపై పడుకున్నా వారికి బేధం తెలిసేది కాదు. బాబా సమక్షం వారికి సుఖాన్నిచ్చేది.

ఒకసారి బాబా తన మండలితో ఒక రైల్వేప్లాటుఫారం మీద పడుకున్నారు. మర్నాడు ఉదయం చీకటితో బయలుదేరే రైలును అందుకునేందుకు ఆ రాత్రి గడిపేందుకు ఉండిపోయారు. సాధారణంగా ప్లాటుఫారాలకు చివర్లో గచ్చుచేసి ఉండదు. అక్కడ నేలపై పక్కలు పరుచుకొని పడుకున్నారు. అటూ ఇటూ మండలి వారి పక్కలు పరచి వారి మధ్యగా బాబాకు పక్కవేశాడు ఎరుచ్. ఒక శిష్యుడు మేలుకొని కాపలాలో ఉండగా మిగతా వారంతా పడుకున్నారు. పగలంతా శ్రమించి ఉండటం వల్ల అంతా మంచి నిద్రలో ఉన్నారు. కాపలాలో ఉన్న శిష్యుడు కూడా నిద్రమత్తులో జోగుతున్నాడు. ఎరుచ్ బాబా పక్కగా పడుకున్నాడు. ఆయన నిద్రలో మునిగిపోయాడు. ఉన్నట్లుండి హఠాత్తుగా బాబా ఎరుచ్‌ని కుదుపుతూ లేపారు. మంచి నిద్రలో ఉన్న ఎరుచ్ లేచి కూర్చొన్నాడు. అలా కూర్చోగానే, తనకు, బాబాకు మధ్యగా పడుకొని ఉన్న వ్యక్తి కనిపించాడు. అతడు వీరి దుప్పటినే కప్పుకొని ఉన్నాడు. ఎప్పుడు వచ్చి ఎలా పడుకున్నాడో ఎవరూ గమనించలేదు. ఎరుచ్ వెంటనే అతడ్ని లేపి, ఎవరు నీవు ? అని అడిగాడు. కంగారు పడ్డ ఆగంతకుడు ఒక్క ఉదుటన లేచి పరుగు లంకించుకున్నాడు. అతడలా పరుగెడుతుంటే, హఠాత్తుగా అతని కొరకే వెతుకుతున్న పోలీసులు వెంటబడి, విజిలు ఊదటం మొదలు పెట్టారు. వారు ఇతని కోసమే కాపలాకాసి ఉన్నారు. అతను ఒక దొంగ. పోలీసుల బారి నుండి

తప్పించుకొనుటకు వారి మధ్య వారి మనిషిగా దాక్కున్నాడు. చివరకు పోలీసులకు చిక్కి శిక్ష అనుభవించాడు. న్యాయవ్యవస్థ అతడ్ని శిక్షించింది.

అయితే మెహెర్ బాబా మరో సంఘటనలో ఒక దొంగను ఎలా క్షమించారో తెలుసుకుందాము. బాబా కొంతమంది మండలితో మస్తు పర్యటనలో ఉన్నారు. ఎరుచ్ వద్ద ఖర్చులకు కొంత రిజర్వు ఫండు ఉన్నది. సంచుల్లాంటి జేబులున్న చొక్కాను ధరించి వున్నాడు ఎరుచ్. 10 రూపాయల కట్ట ఒక జేబులో దాచాడు. ఒక గ్రామంలో బాబా మస్తుతో ఆ రోజున ఉదయం పూట ఏదో కార్యక్రమం జరుపుతున్నారు. మండలి ఆ గదికి బయట నిలబడి యున్నారు. గ్రామస్తులు వీరి చుట్టూ గుమిగూడారు. మండలి, ఈ గ్రామస్తులను కబుర్లలో పెట్టి పరిసరాల్లో ఉండే మస్తుల గురించి తెలుసుకుంటున్నారు. అంతలో ఒక వ్యక్తి ఎరుచ్ పక్కన చేరి ఒక చేతిని ఎరుచ్ భుజంపై వేశాడు. రెండవ చేయి పక్షవాతంతో చచ్చుబడి వున్నది. ఎంతో స్నేహ పూర్వకంగా ఎరుచ్‌ని మాటల్లో పెట్టాడు. మెల్లగా ఎరుచ్ భుజంపై ఉంచిన చేతిని ఆయన జేబుల్లోకి పోనిచ్చి పది రూపాయల నోటును కాజేశాడు. అలా తీయటాన్ని ఎరుచ్ చూడకపోయినా, ఆ నోటు తీసేటప్పుడు వచ్చిన శబ్దాన్ని పసిగట్టిన ఎరుచ్, అతడివైపు చూడగానే పదిరూపాయల నోటును పట్టుకున్న అతని చేతిని గమనించాడు.

చుట్టూ జనం ఉండటం వల్ల ఎరుచ్ అతడ్ని ఏమీ అనలేక, అతడి చేతిని పట్టుకొని, గది వెనక్కు తీసుకు వెళ్లాడు. ఆగదిలోనే బాబా మస్తుతో పని చేస్తున్నారు. ఆ వ్యక్తి చేసిన దొంగ పనికి ఉగ్రుడైన ఎరుచ్ చాచి కొట్టేందుకు చేయి పైకెత్తాడు. అంతలో వెనక నుండి ఎవరో ఎత్తిన తన చేతిని పట్టుకున్నట్లు గమనించిన ఎరుచ్ వెను తిరిగి చూచేసరికి "ఏమిటి చేస్తున్నావంటూ ?" బాబా కనిపించారు. "బాబా ఇతడు నా జేబు నుండి పది రూపాయలు కాజేశాడు" అన్నాడు ఎరుచ్. బాబా ఆ వ్యక్తి వైపు తీక్షణంగా చూస్తూ "నిజమేనా ? నీవలా చేశావా ?" అంటూ అతడి చెవిపట్టుకొని నలిపారు. "మరెన్నడూ ఇలా చేయకు" అని మందలించి ఆ నోటును అతనికి ఇచ్చి వేయమని ఎరుచ్‌ని ఆదేశించారు. "అవసరమున్న వారికి ఇచ్చేందుకే గదా ఈ పైకం నీ వద్ద ఉంచింది ? అతని కేమి అవసరం వచ్చి ఈ పని చేశాడో ? అదతనికే ఇచ్చి వేయంటూ మరెన్నడూ దొంగతనం చేయనని ప్రమాణం చేయించారు. దానితో ఆ దొంగ పశ్చాత్తాపపడి మరెన్నడూ చేయనని చెప్పి సిగ్గుతో తలవంచి వినయంగా వెళ్లిపోయాడు. ఇది బాబా క్షమాగుణాన్ని తెలిపే న్యాయ నిర్ణయం.

# మేలుకొలుపు

అవతార పురుషుడు భౌతికంగా మన మధ్య ఉన్నప్పుడు ఆయన గడిపే దైనందిన జీవితంలో ప్రతిచర్య ఈ సృష్టి మీద అద్భుతమైన ప్రభావాన్ని చూపిస్తుంది. ఆ అవతారుని దివ్య ప్రేమ మానవత్వ పరిధిలో వ్యక్త మవుతున్నందువల్ల తిరిగి ఆయిన్ని మనం ప్రేమించ కలుగుతున్నాం. ఆయన చేసే ఆంతరిక కార్యక్రమ ఫలితంగా బహు కొద్దిమందే ఆయన ప్రేమ పరిధిలోకి చేర గలుగుతున్నారు. తక్కిన వారంతా ఇంకా అన్వేషకులుగానే మిగిలిపోయి నిర్విరామంగా కనుగొనే ప్రయత్నం చేస్తున్నారు. అందుకే బాబా దేవుడ్ని కనుక్కోవటం ఎందుకు అసాధ్యమవు తుందో వివరిస్తూ, వారెన్నడూ పోగొట్టుకొనని దానిని చూచేందుకు ప్రయత్నింస్తున్నందున చూడలేక పోతున్నారని చెప్పారు. "నిన్ను నీవు పోగొట్టుకుంటే, దేవుడే నీ ముందు నిలుస్తాడు" అని బాబా చెప్పారు. తన సహచరులకు ఇందులో నిగూఢంగా ఉన్న రహశ్యాన్ని ఎన్నో అనుభవాల్లో విశదపరచి చైతన్యవంతుల్ని చేశారు.

1946లో మెహెర్‌బాబా డెహ్రాడూన్ దగ్గర నిరంజన్ పూర్ అనే పల్లెటూర్‌లో మండలితో మస్తు కార్యక్రమంలో ఉన్నారు. కృష్ణనాయర్ రాత్రి కాపలాలో ఉన్నారు. రాత్రిళ్లు దోమలబాధకు తట్టుకోలేక గోక్కుంటుంటే కలిగిన శబ్దం బాబాకు నిద్రాభంగం చేయటంతో కృష్ణనులోనికి పిలిచి, అతడు చెప్పే కారణాన్ని వినిపించుకోకుండా, ఇక ముందు జాగ్రత్తగా మసులుకోమని హెచ్చరించారు. బాబా తీరు కృష్ణకు బాధనిపించింది. హాయిగా దోమతెరలో పడుకున్న బాబాకు ఈ దోమల బాదేం తెలుస్తుంది ? తాను మానవ రూపంలో ఉన్నదేవుడ్నని చెప్పే బాబాకు తన అనుచరులు పడే ఇబ్బందిని ఈ మాత్రం తెలుసుకోలేరా ? కనికరించే హృదయం ఈయనకు లేదా ? ఈయనేం దేవుడు ? అనుకుంటూ ఆ రాత్రంతా గడిపాడు.

రాత్రి కావలి కాచిన వ్యక్తి ఉదయం తెల్లవారే వరకు నిద్రపోవచ్చును. కానీ బాబా అతనికా అవకాశం ఇవ్వకుండా చీకట్లోనే హరిద్వార్‌కు తీసుకెళ్లారు. హరిద్వార్ చేరగానే అక్కడ కొన్నేళ్లుగా ఒంటికాలిపై నిలబడి తపస్సు చేస్తున్న ఒక యోగిని కలుసుకున్నారు. అధిక కాలం అతడు మౌనంతోటే గడుపుతున్నాడు. ఆయన అనుచరులు ఎంతో భక్తి శ్రద్ధలతో ఆ యోగిని దైవతుల్యునిగా

పూజించేవారు. బాబా ఈ యోగిని కలిసినప్పుడు ఎవరూ లేరు. ఆ యోగి బాబాను చూడగానే, మౌనాన్ని విరమించి, కళ్ల నీళ్లు పర్యంతమై నమస్కరిస్తూ, రెండవ కాలు నేలపై ఆనించి నడుస్తూ బాబా దగ్గరకు నడిచి వచ్చి, "హే భగవాన్! మానవ రూపంలో ఉన్న అవతార పురుషా ! నీ కొరకు నేనెన్నేళ్లుగానో ఎదురు చూస్తున్నాను. ఇన్నాళ్లకు కనికరించి స్వయంగా వచ్చావు. నేనెంతో ధన్యుడ్ని" అంటూ భోరున ఏడ్చేశాడు. ఈ సన్నివేశంలో ప్రత్యక్ష సాక్షిగా నిలచివున్న కృష్ణ గతరాత్రి తనలో చెలరేగిన మనో వేదనకు జవాబుగా బాబా ఈ సంఘటనను అనుభవమయ్యేట్లు చేశారని గుర్తించాడు.

బాబా ఆ వెనువెంటనే డెహ్రాడూన్ తిరిగి వెళ్లిపోయారు. రాత్రి డ్యూటీ దిగి వెళ్లటానికి సిద్ధంగా ఉన్న కృష్ణను బాబా పిలిచి, ఉదయాన్నే మళ్లీ ఆయోగి వద్దకు వెళ్లి రమ్మన్నారు. ఈసారి అతడు ఒక్కడే వెళ్లాలని ఆదేశించారు. నిద్రలేమితో అలసివున్నా బాబా ఆజ్ఞను పాటించి కృష్ణ హరిద్వార్ చేరి ఆ యోగి ఆశ్రమానికి చేరేసరికి, విగత జీవుడైన ఆయోగిని సందర్శించేందుకు పోగైన జనాన్ని ఛేధించుకొని కృష్ణ, చెక్కు చెదరని ఆనందంతో, గంభీర వదనంతో చిరునవ్వుతో అవతారునిలో లీనమైయున్న ఆయోగి శరీరాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. కడసారిగా కృష్ణలో జ్ఞానోదయమైంది. తాను బాబా దివ్యత్వాన్ని శంకించినందున, ప్రేమ వల్లనే, బాబా తనకు సేవించే వారిపై కరుణతో ప్రత్యక్షంగా తనదైవత్వాన్ని ఎలా ఋజువు చేసుకుంటారో యోగి మాటల ద్వారా తెలుసుకున్నాడు. ఆఖరిసారిగా ఆ యోగి పలికిన పలుకులు :

"నేను భగవంతునితో ముఖా ముఖిగా కలుసుకున్నాను. ఆయనే స్వయంగా వచ్చి నన్నాశీర్వదించారు. నేను తరించాను. నా జీవితంలోని కోరిక తీరిపోయింది" అని తన సంతోషాన్ని తెలుపుతూ శరీరాన్ని విడిచిపెట్టాడని ఆయన శిష్యులు చెప్పారు.

1972 అమరతిథికి విజయవాడ సెంటరు వారు ఒక రైలు బోగీని మెహెరాబాదు వెళ్లేందుకు ముందుగానే బయలుదేరదీసి, బొంబాయి వెళ్లి అమరతిథికి మెహెరాబాదు చేరేట్లు ఏర్పాటు చేశారు. నేను నా శ్రీమతి ప్రసూన రెండు బర్తులు ఆ బోగీలో రిజర్వు చేసుకున్నాం. ఉదయం సికింద్రాబాదు చేరాక రాత్రి వరకు ఆ బోగీ బొంబాయి ఎక్స్‌ప్రెస్ కనెక్షన్ కోసం సికింద్రాబాదులో ఆగిపోవటంతో పెట్టెలోని చాలా మంది ఎవరి పనులపై వాళ్లు నగరంలోకి

వెళ్లిపోయారు. మా దంపతులం మాత్రం భోజనం కాగానే జూ చూచేందుకు వెళ్లాం. సాయంత్రం జూ నుండి బయలుదేరుతూ సిటీబస్సు ఎక్కుతుండగా ఒక పిల్లవాడు నా లాగూ జేబులోని పైకాన్ని కొట్టేశాడు. ఆ పిల్లవాడు తన బనీను లోపల ఏదో దాస్తున్నట్లు గమనించిన నేను నా జేబు తడుముకోగా పైకం ఉంచిన జేబురుమాల మడత కనిపించలేదు. ఒక చేతితో బస్సు రాడ్డు పట్టుకొని లోనికి వెళ్లాలన్న తోపిడిలో ఉన్న నేను ఒక్క ఉదుటున ఆ పిల్లవాడ్ని పట్టుకోవాలని చేతిని వదిలి ఇవతలకు వచ్చినా ఫలితం లేకపోయింది. వాడు కనిపించలేదు.

బస్సుకు మించిన జనం ఉండటం వల్ల బాగా రద్దీ ఎక్కువైంది. నా వద్ద ఉన్న రూ. 1110/- పోయాయి. సికింద్రాబాదు స్టేషను చేరాలంటే మా ఇరువురికి రూ. 5/- లు కావాలి. చేతిలో ఒక్క పైసా లేదు. ఆ బస్సు దాటితే మేము సకాలంలో స్టేషనుకు చేరలేము. మా రైలు 7-30కు బయలుదేరుతుంది. బాబాకు మా అవస్థను మొరపెట్టుకున్నాం. డబ్బు పోయినందుకు చింతించలేదు. స్టేషనుకు రైలు టైము లోపల ఎలా చేరాలన్నదే మా తపనైంది. తోటి ప్రయాణీకులు, కండక్టరు కూడా దొంగను వెదకటంలో సహకరించినా ఫలితం కలగలేదు. కొందరు పోలీసు కంప్లైంటు పెట్టమని సలహా చెప్పారు. మరి కొందరు తరువాత బస్సు వరకూ ఉండిపోయి వెతికే ప్రయత్నం చేయమని సలహా చెప్పారు. "అంతా బాబా ఇచ్ఛ, నేను నిమిత్త మాత్రుడ్ని వానికి ఏనాడో ఉన్న ఋణాన్ని ఇలా తీర్చాల్సి వచ్చిందేమో" నని నేను సరిపెట్టుకొని ఇప్పుడు వెళ్లేదెలాగా అని బాబాను వేడుకున్నాను. నలుగురూ నాలుగు రకాలుగా విమర్శిస్తున్న తరుణంలో కండెక్టరు బస్సు ఎక్కండి, నేను తీసుకువెళతానన్నాడు.

అందుకు నేను దయచేసి మాకు రెండు టిక్కెట్లు స్టేషనుకు ఇవ్వండి. కొంతసేపు మీ బస్సు అక్కడ ఆగుతుంది కనుక నేను మా వాళ్లను డబ్బులు అడిగి తీసుకొని ఇస్తాను అని చెప్పగా అంగీకరించాడు. అలాగే స్టేషనుకు బస్సు చేరగానే మా కొసరమే ఎదురు చూస్తున్న మిత్రుడు ఎ.ఎన్. జగన్నాథ్ కనిపించే సరికి ఆయన వద్ద పైకం అడిగి తీసుకొని కండక్టరుకు ఇచ్చి దిగిపోయాం. మా ప్రయాణం పూర్తి చేసుకొని ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత అసలు విషయం తెలిసింది. సరిగ్గా అదే సమయంలో విజయవాడలో మా ఇంటి వద్ద బాబా తన అపార కరుణను కురిపించి తన దైవత్వాన్నెలా ఋజువు పరిచారో అవగతమైంది.

మా కుమారుడు తన సహాధ్యాయితో మాట్లాడుతూ సాయంత్రం 6-00

గం॥ల సమయంలో బయట వరండాలో కూర్చున్నాడు. మా అమ్మాయి లిరువురూ సినిమాకు వెళ్లాలని బీరువా తీసి బట్టలు వేసుకొని, తలుపు వేయటం మరిచిపోయి, అన్నగారితో చెప్పి సినిమాకు వెళ్లిపోయారు. స్నేహితుడితో కబుర్లాడిన మా అబ్బాయి, అతడ్ని సాగనంపేందుకు మేడదిగి క్రింది వరకు వచ్చాడు. ఇంటి తలుపులన్నీ బార్లా తీసి ఉన్నాయి. లైట్లన్నీ వెలుగుతున్నాయి. బీరువా తలుపు తెరిచే ఉన్నది. ఇంట్లో ఎవరూ లేరు. ఇవేవీ గమనించని మా అబ్బాయి (డా॥ పూర్ణ చందు) మిత్రుడితో చక్కర్లు కొడుతూ తిరిగి తిరిగి రాత్రి 9-30కు గాని ఇంటికి రాలేదు. ఈలోగా ఆడపిల్లలు సినిమా నుండి ఇంటికి వచ్చే సరికి తలుపులన్నీ తీసి ఉన్నాయి. లైట్లు వెలుగుతున్నందున అన్నయ్య దొడ్లో ఉన్నాడేమోనని పిలుస్తూ వెతికారు. అన్న కనిపించకపోయే సరికి ఒక్కసారిగా భయం అవహించింది. బీరువా తలుపు తీసి వుండే సరికి, తామేతీసి వెళ్లామన్నది గుర్తుకు రాక, ఏదో జరుగరానిది జరిగిపోయిందన్న కంగారులో గభాల్ని ఇంటి తలుపులు మూసి వేశారు. అంతలో ఎవరో తలుపుపై దడదడా బాదటంతో ఎవరూ ? అంటూ పిల్లలు అడిగారు. కానీ బదులు చెప్పకుండా తలుపు తట్టుతూనే ఉండేసరికి ప్రక్కనున్న కిటికీ గుండా చూస్తే ఎవరూ కనిపించలేదు. కానీ మళ్లీ తులుపు తట్టడంతో మరింతగా భయపడిపోయి, టి.వి.ని పెద్ద శబ్దం వచ్చేట్లు పెట్టుకున్నారు. అలా మరికొంత సేపు తలుపు తట్టబడింది.

అంతలో మా అబ్బాయి వచ్చి తలుపు తట్టగా వచ్చింది అన్నగారేనని రుజువు పరచుకొని తలుపు తీశారట. మేము ఇంటికి తిరిగి రాగానే ఈ విషయం విన్న మాకు కరుణామయుడు ప్రియతమ బాబా మా పిల్లల అమాయకత్వ పొరపాటుకు బాధ్యతను తానే తీసుకొని, వారు తిరిగివచ్చే వరకూ కావలి ఉన్నట్లు అవగతమైంది. మీరంతా తలుపులు తీసి వెళ్లినందున, నేను ఇంటికి కావలి ఉన్నాను. ఇక జాగ్రత్తగా ఉండండని చెప్పేందుకే ఆ మౌనధారి తలుపులు తట్టారని గ్రహించాము. ఆ మర్నాడే నా ద్వారా ఒక కోర్టు వ్యవహారంలో చట్టపర సలహాలు పొంది విజయం సాధించిన ఒక మిత్రుడు వచ్చి అభినందించి పళ్లు, ఒక కవరు ఇచ్చి వెళ్లాడు. అతను వెళ్లాక ఆ కవరు తెరిచి చూస్తే అందులో 1110/- ఉన్నాయి. జూ వద్ద పోగొట్టుకున్న పైకం మరలా తిరిగి ఇప్పించారన్న సంతృప్తి కలిగింది.

# వైవాహిక బంధం



"మంచి నడత కలిగి వివాహం చేసుకొనక, పరిశుద్ధ జీవితాన్ని గడపకలిగితే, అది అత్యుత్తమమైన చర్య అవుతుంది. అయితే ఇది అప్పుడప్పుడు వారి ఆధ్యాత్మిక జీవితంలో ఇబ్బందుల్ని కల్పిస్తుంది. కానీ వైవాహిక బంధమనేది, అయోగ్యమై, సంకర జీవితాన్ని గడిపేందుకు ఉపయోగపడుతుంది. వైవాహిక బంధం ఎంతటి బలమైనదంటే, జీవిత భాగస్వాములిరువురు పరపురుషుడు, పర స్త్రీతో చిక్కుబడరు" వైవాహిక బంధం గురించి మెహెర్ బాబా ఇంకా ఇలా చెప్పారు. వైవాహిక సంబంధంలో జరిగే కామ క్రీడ, వివాహ వ్యవస్థకు బాహ్యంగా జరిగే కామ క్రీడకు పూర్తిగా భిన్నమైనది. వివాహం వల్ల కామం యొక్క సంస్కారాలు, చాలా స్వల్పంగా ఉండి తేలిగ్గా తొలగించుటకు సులువుగా ఉంటుంది. వైవాహిక బంధంలో జరిగే కామ భావము మిత్రత్వాన్ని నెలకొల్పి, ప్రేమ ఆధ్యాత్మిక భావ పరంపర కామోద్రేకపు షరతులు సానుకూలపడి చౌకబారు అనుభవాలకు అతీతంగా ఉండటానికి" అంటూ ఇంకా ఇలా వివరించారు.

మీరు వివాహితులైతేనే తప్ప, కామోద్రేకానికి పాల్పడవద్దని బాబా హెచ్చరించారు. ఈ కామ చర్య పునః సృష్టికి అవసరమవుతుంది. కానీ ఈ పునః సృష్టి చేయటం ఇద్దరు చిన్న పిల్లల మధ్య జరిగేది కాదు. కామం వేరు ప్రేమ వేరు. కామంలో ఒక రూపము యొక్క భావనపై ప్రేరణ ఉంటుంది. దాని ఫలితంగా ఆత్మ యొక్క ఆధ్యాత్మిక తగ్గుదల కలుగుతుంది. అయితే ప్రేమ రూపము వెనుక ఉన్న యధార్ధతతో ఆత్మకు సరాసరి బాంధవ్యం మరియు సహకార సంపత్తి పెరుగుతుంది. కనుక, కామము భారముగా ఉన్నట్లు, ప్రేమ బాగా తేలిగ్గా ఉన్నట్లు, అనుభవమవుతుంది. కామంలో జీవితం క్షీణించేట్లు చేస్తే, ప్రేమలో జీవితం అభివృద్ధి జరుగుతుంది. ఒకే ప్రేమమయ ఆత్మను కలిగి

ఉండాలంటే దాని జీవితాన్ని నీ స్వీయాత్మకు జోడించటమన్న మాట. నీ జీవితం మామూలుగానే ఉండి, రెండుగా మారుతుంది. కనుక నీవు రెండు కేంద్రాలలోను సమాంతరంగా జీవిస్తావు.

"నీవు సకల ప్రపంచాన్ని ప్రేమిస్తే, నీవప్పుడా సకల ప్రపంచంలో వికృతంగా జీవిస్తావు. కామంలో జీవిత పతనానికి అవకాశామున్నది. సామాన్య భావంలో నిరాశామయ భావం ఒక రూపంపై ఆధాపడి ఉంటుంది. ఇంకో రూపము ఉన్నట్లు భావాన్ని కలిగిస్తుంది. ఈ విధంగా కామంలో, ఎడబాటు, బాధలనే ఆవేదనలుంటాయి. కానీ ప్రేమలో సమైక్యము, సంతోషము, అనేభావాలుంటాయి. కామం దుఃఖపూరితం కాగా ప్రేమ సంతోషదాయకం. కామం కోరికలకు కారణ భూతము కాగా ప్రేమ ఉత్తేజమునకు మార్గము. కామం తృప్తిని కోరుతుంది. అయితే ప్రేమ తృప్తిని అనుభవిస్తుంది. కామంలో అలసటవుంటుంది. కానీ ప్రేమలో పరిపూర్ణ సంతృప్తి ఉంటుంది."

బాబా అందించిన ఈ పై సందేశాలను బట్టి కామవాంఛలకు లోనైతే, మనము సత్యముతో ఎలా ఎడబాటును ఎదుర్కొంటామో గ్రహించవచ్చును. పరిణామక్రమంలో రూపాంతరం చెందుట ద్వారా మనలో తెచ్చుకున్న పశు ప్రవృత్తిని అంత తేలికగా తొలిగించలేము. శృంగారాన్విత ఈ కామ వాంఛల, ఛాయల్ని క్రమంగా తొలగించుకొని ఆయన చెంతకు చేరేందుకు చేసే ప్రయాణం ఇంకా ఇంకా మరెన్నో మజలీలు చేయాల్సి ఉన్నది. అందుకే బాబా అన్నారు "నీవు నిజంగా సత్యాన్ని ఆకాంక్షిస్తే మీరు తప్పక బ్రహ్మచర్యాన్ని అవలంభించండి. లేదా వివాహమాడి భరించ కలిగితే పిల్లల్ని కనండి. కామవాంఛలు మిమ్మల్ని బాధిస్తే అనుకూలవతియైన అర్థాంగిని ఎంచుకొని పెళ్లి చేసుకోండి. ఆభాగస్వామితో మాత్రమే కట్టుబడియుండి పిల్లా జెల్లలతో సుఖించండి" అని ప్రభోదించారు.

వివాహములో అంతర్నాటక భావాలు ప్రస్ఫుటమవుతాయట. అయితే ఒకే భాగస్వామికి కట్టుబడి ఉంటే, ఇతరమైన కొత్త భావాలేవీ కలగవట. భార్య భర్త ఇరువురు మధ్య ఈ భావాలు సమానంగా నిలిచి ఉంటాయని, అన్వేషకుడు బ్రహ్మ చర్యం అవలంభించే కంటే వివాహమాడటమే సురక్షితమని బాబా చెప్పారు. బాబాను ప్రేమించినంత మాత్రంచేత ఈ జన్మలోనే ముక్తిని సాధించబోతున్నామని భావించక, కనీసం కొన్నివందల జన్మలకైనా అది లభిస్తే మనమెంతో అదృష్టవంతుల మనుకొని, ఇప్పటి నుంచే ఆ ప్రయత్నాన్ని

ప్రారంభించాలి. అయితే ఇది అంత తేలికగాదు. కామవాంఛలు మనల్ని జన్మ జన్మలకు వదలవు. వాటిని కడిగి, కడిగి నిర్మూలనం చేయాలి. కామాన్ని అణుచుకొనుటకు ప్రయత్నంచ కలిగితేనే ఇది సాధ్యపడుతుంది. మనలో పేరుకుపోయిన అనంత కామతృష్ణ వల్ల, కామోద్రేక తలంపులు వదలవు. కామాన్ని అణుచుకోవటమంటే, కామాన్ని క్రమ రూపంలో పెట్టకుండా ఆపుకోవటం కాదు.

ప్రపంచమంతా పరస్పర విరుద్ధములైన ద్వందాలకు అలవాటు పడింది. మంచి - చెడు; సుఖం - దుఃఖము, మాదిరే బ్రహ్మచర్యం - వివాహం అనే ద్వంద్వాన్ని గురించి కూడా ఆలోచించే అలవాటు చేసుకున్నది. ఫలితంగా దాని నుండి తప్పించుకోలేక పోతున్నది. అందుకే మానవుడు బ్రహ్మచారిగా ఉన్నప్పుడు అతనిలో చెలరేగే అనంత కోరికల కారణంగా అసంతృప్తి చెంది పెళ్లి చేసుకోవాలన్న ఆలోచనలో పడతాడు. పెళ్లి చేసుకున్నప్పుడు చెలరేగే కోరికల రీత్యా బ్రహ్మచర్యమే మేలని చింతిస్తాడు. మరి ఈ ఊగిసలాట నుండి బయటపడి, కామ వాంఛలతో కూడిన సంస్కారాల్ని వదిలించుకొనుట, పరస్పర విరుద్ధములను అధిగమిస్తేనే కాని సాధ్యం కాదు. ఒక సద్గురువు లేదా అవతారుడి అనుగ్రహం లభించి, మనస్సు మేల్కొలపబడినప్పుడే అంతర్గతంగా అవిచ్ఛన్నమైన కోరికల పరిత్యాగము ప్రారంభమవుతుంది. వివాహము, బ్రహ్మచర్యం మధ్య వాటి స్థితిని గురించి వర్ణించటం అలవి కాదు.

బ్రహ్మచర్యపు విలువ యాంత్రికంగా ఆచరించే నిగ్రహంపై ఇమిడిలేదు. అలాగే వివాహపు విలువ కామోద్రేకంలో లేదు. మనస్సులో కామకోరికలు ఏమాత్రం ఉన్నా, దైవ ప్రేమ యొక్క వెలుగు ప్రకాశించదు. జీవిత భాగస్వామి గూర్చి బాబా ఇంకా చెపుతూ "ప్రతి మానవుడి బాంధవ్యం ఏదో ఒక రూపంలో ప్రేమపై ఆధారపడి ఉంటుంది. ప్రేమ శాశ్వతం. వివాహం శాశ్వతమైనా ఆశాశ్వతమైనా, ప్రేమను అనుసరించి, భరిస్తుంది. కేవలం కామాకర్షణలతో జరిగే వివాహాలు ఆసాంతం నిలబడవు. విడాకులకో, దుష్ఫలితాలకో దారితీస్తాయి. కలసి మెలసి సహజీవనాన్ని కోరుకొని పరస్పర అవగాహనతో జరిగే వివాహాలు క్రమంగా పెరిగి భోగ భాగ్యాలతో సుఖ సంతోషాలతో తులతూగుతూ ఆదర్శ ప్రాయ మౌతున్నాయి.

జీవితంలో వైవాహిక బంధమనే, భాగస్వామ్య బంధం అత్యంత పవిత్రమైనది.

బ్రహ్మాండమైన జగత్తనే కోటలో జరిగే జీవిత సమయంలో భార్యా భర్తలు సాగించే జీవిత సమరానికి పునాది రాళ్లు. స్త్రీ పురుషులు, భార్య భర్తలు, ఈ జంటల్లో ప్రతి ఒక్కరూ వ్యక్తిగతమైన వారే. అయితే వారు భార్యగా, భర్తగా తక్కిన విషయాలకు అతీతులై సహభాగస్తులైనప్పటికీ, వారు పవిత్ర బంధంలో భాగస్వాములు కావాలంటే బాబా చెప్పినట్లు, గృహస్తుగా వైవాహిక జీవిత బంధంలోనే సాధ్యపడుతుంది. వివాహ ప్రాశస్త్యం గురించి బాబా చెపుతూ "వివాహము యొక్క ఆధ్యాత్మిక విలువ, తిన్నగా ప్రకృతితో సంబంధం పెట్టుకొని, తన దైనందిన జీవితాన్ని కొనసాగిస్తుంది. ఒక వేళ అది చౌకబారు ఆమోదాలపై ఆధారపడితే, స్వార్థపూరిత భాగస్వామ్యంలో తరిగిపోతుంది. చక్కని ఆదర్శంతో గడిపితే పెద్ద మనిషి తరహాలో ప్రజర్విల్లుతుంది. వసుధైక కుటుంబ వ్యవస్థకు వారిరువురి సుసంఘటిత ప్రేమతో ఈ రెండు ఆత్మలు కలిసి చక్కని బాటను ఏర్పాటు చేస్తాయి" అని వివరించారు.

దైవీ మానవుని దృష్టిలో స్త్రీ పురుషు లిరువురూ సమానమే. పునర్జన్మ దృష్టిలో చూచినా, ఈ నాటి పురుషుడు మరుజన్మలో స్త్రీగా, ఈనాటి స్త్రీ మరుజన్మలో పురుషునిగా జన్మించ వచ్చును. ఏమైనప్పటికి, స్త్రీ రూపం నిర్వర్తించే పాత్ర అద్భుతమైనది. దానికదే సాటి. ఈ మాతృరూపమే ఈ జగత్తులో అద్వితీయ మానవ రూపధారి యగు దైవీ మానవుడ్ని కని ప్రపంచానికి అందిస్తోంది. ఒక గృహిణిగా స్త్రీ మూర్తి తన భర్త, బిడ్డల సంక్షేమానికి జాగరూకతతో పాటుపడుతుంది. శారీరకంగా మనాశికంగా, తన భర్త మనోభావాల కనుగుణ్యంగా మెలుగుతూ సంసార యాత్ర సాగిస్తుంది. పూర్వాబారం ప్రకారం భర్త కుటుంబానికి పెద్ద. కుటుంబ పోషణ అతని భాధ్యత. ఆధ్యాత్మిక చింతన చేయటంతో పాటు తన కుటుంబ సభ్యులందరికీ ఆధ్యాత్మిక ధ్యాసను కలిగించాలి. సుఖాన్నందించటం స్త్రీ భాద్యతైతే, సంపాందించి పెట్టటం పురుషుని భాద్యత. భార్యగా గృహణి యొక్క ధర్మం, తన భర్తకు బిడ్డలకు సహాయపడుతూ సేవ చేయటం ఆమె విధి. అలా చేస్తూ ఆమె ఆ రూపాల్లో తన ప్రభువుకు సేవ చేస్తున్నానని తలచాలి. ఆలాగే భర్త కూడా తన కుటుంబ సభ్యులందరి రూపాల్లో ఉన్న బాబాకు సకల అవసరాలు తీర్చి, తగుతిండిబట్ట, రక్షణ కల్పించాలి. ఇలాంటి అనుభవాన్ని పొందాలంటే వైవాహిక వ్యవస్థలోనే సాధ్యమవుతుందని బాబా నేర్పారు.

# గృహస్థు ధర్మం

బాబాకు అత్యంత సన్నిహితులైన ఒక పోలీసు అధికారి కుటుంబము ఉండేది. వారి కుటుంబ సభ్యులంతా బాబాకు విధేయులైన అనుచరులు. అతి తరచుగా బాబా దర్శనానికి వచ్చేవారు. వచ్చే ప్రతిసారి బాబాకు ఏదో ఒక ప్రసాదం తెచ్చేవారు. బాబాకు భోజనం కూడా వండేవారు. వారి పిల్లలు బాబా చుట్టూ చేరి ఆడుకొనే వారు. చంటి పిల్ల బాబా ఒడిలో కూర్చొని ఆనందించేది. అయితే ఒకసారి బాబా అతనిగూఢమైన విశ్వకార్యక్రమ వత్తిడి వల్ల చాలాకాలం ఏకాంత వాసం గడుపబోతున్నట్లు, ఏకాంతవాసం ముగిసే వరకూ ఎవరూ తనను చూడరాదని ప్రకటించారు. ఇది విన్న ఆ పోలీసు అధికారి భార్య, అన్నాళ్లూ బాబా సమక్షంలోనే గడపాలనుకున్నది. తన ఇంట్లోనే బాబా కోసం ఒక ప్రత్యేక గదిని తయారు చేయించి, ఒక బాబా ఫోటో పెట్టుకొని, స్వయంగా బాబానే అందులో ఉంచుకున్నట్లు ఊహించుక్నుది. అక్కడ బాబా స్వయంగానే ఉన్నట్లే భావించి ఆయిన్ని తృప్తి పరిచేందుకు అవసరమైన సదుపాయాలన్నీ ఏర్పాటు చేసింది.

బాబా ముందు కూర్చొని భజన కీర్తనలు పాడేది. ఆయనకు భోజనం వండిపెట్టేది. ఇలా రోజులు దొర్లిపోసాగాయి. భర్త పిల్లలు కూడా బాబాను అమితంగా ప్రేమించటం వల్ల, ఆమె చర్యను చూచి ఆనందించారు. అయితే కాలక్రమంలో ఆ గృహిణి యొక్క జీవన స్రవంతిలో ఎదురవుతున్న సుఖ సంతోషాలు వారి కుటుంబ సుఖ జీవనంలో పెద్ద అవరోధమైంది. బాబా ధ్యానంలో వారు ఏకాగ్రత చూపటంపై అవరోధం ఏర్పడింది. భర్త తన విధి నిర్వహణకై వెళ్లబోయే ముందు ఆయన అవసరాలు చూచే భార్య బాబా గది నుంచి ఇవతలకు వచ్చే వరకూ నిరీక్షించాల్సి వచ్చింది. అలాగే భోజనంముందుగా బాబాకు తినిపించటంలో తన ఇష్టం వచ్చినంతసేపు సమయాన్ని తీసుకొని ఆ తర్వాతనే వంట పాత్రల్ని టేబులుపైకి చేరుస్తోంది. అధిక కాలమంతా ఆమె బాబా సేవలో తన సమయాన్ని మరచిపోయి వెచ్చించుట వల్ల పిల్లలు కూడా అశ్రద్ధ చేయబడ్డారు. వేళకు వారు బడికి వెళ్లాలి కనుక భోజనం తినకుండానే వెళ్లిపోతున్నారు.

సరైన ఆహారం, స్నానపానాదులు లేక ఉతికిన బట్టలు, సరిగా ధరించక పోవటం వల్ల వారి ఆరోగ్యం బాగా క్షీణించింది. సరైన పోషణ, ఆలనా పాలనా లేక భర్త ఆరోగ్యం కూడా చెడిపోయింది. ఫలితంగా ఏ ఇంట్లో సుఖ సంతోషాలు,

ఆయురారోగ్యాలు వెల్లివిరిశాయో, ఆ ఇంట్లోనే ప్రతి ఒక్కరు ఉపేక్షించబడ్డారు. అంత జరుగుతున్నా కుటుంబ సభ్యులంతా బాబా యందామెకున్న భక్తికి సంతోషించారే తప్ప విసుక్కోలేదు. ఇంటికి చేరగానే, వారు కూడా ఆమెతో పాటు బాబా సేవలో పాలుపంచుకొనేవారు. బాబా సేవలో మునిగిపోయిన ఆమె స్వీయ పోషణను అశ్రద్ధ చేయటంతో పాపం ! ఆమె ఆరోగ్యం కూడా క్రమంగా దెబ్బతిన్నది.

ఇలా కొన్నేళ్లు గడిచాయి. ఒక రోజున బాబా తన సన్నిహితులందరిని తన సమక్షానికి పిలిపించుకున్నారు. ఈ పోలీసాఫీసరు కుటుంబం కూడా వచ్చింది. బక్క చిక్కిపోయిన వారి కుటుంబాన్ని బాబా చూచి "మీకేమయింది ? ఇలా శల్యమయ్యారేమిటి ?" అంటూ వారివైపు తదేకంగా చూస్తూ జాలికొలిపేట్లు ప్రశ్నించారు. సర్వజ్ఞుడైన బాబాకు సమస్తం తెలుసు. అయినప్పటికీ, ఏమీ ఎరుగనట్టే ప్రశ్నించారు. "మీ అందరి ఆరోగ్యం ఇంతగా క్షీణించుటకు కారణమేమిటి ? మీ ఇంట్లో ఏదైనా విషాదం జరిగిందా ? మీకేమైనా జబ్బు చేసిందా ? ఉద్యోగమేమైనా పోయిందా ? అసలేం జరిగింది ?" అంటూ ప్రశ్నల పరంపర కురిపించారు. ఎవ్వరూ మాట్లాడలేదు. నిజానికి వారి ప్రభువే వారి అనారోగ్యానికి కారణమైనందున, వారెవరూ ఆ కారణాన్ని బయట పెట్టేందుకు సాహసించలేక పోయారు.

అంతలో బాబానే మళ్లీ రెట్టిస్తూ అడిగేసరికి ఆ పోలీసధికారి "బాబా నీవే ఈ అనర్థానికి అసలు కారణం" అన్నాడు. "ఈ అనర్థానికి నేనెలా కారణమయ్యాను ?" అనడిగారు. అప్పుడు భర్త మొదటి నుంచి చివర వరకూ జరిగినదంతా ఏకరువు పెట్టాడు. అంతట బాబా అతని భార్య వైపు చూస్తూ "అవును అసలు సంగతి అదికాదు. నీవు నీ ధర్మాన్ని నా యెడల నిర్వర్తించావు. ఈ రూపంలో నీవు నాకు దుస్తులు తొడిగావు. భోజనం తినిపించావు. నీ సేవకు నేను ముగ్ధుడ్నయ్యాను. అయితే అదే సమయంలో నేను నీ భర్త రూపంలో, అశ్రద్ధ చేయ బడ్డాను. నీ బిడ్డల రూపంలో ఉపేక్షించబడ్డాను. ఆ విషయంలో నీవు నన్ను పట్టించుకోలేదు. నీవు నన్ను దైవంగా తీసుకున్నావు. అది మంచిదే. నేను సాక్షాత్తు భగవంతుడిని. కనుక నేను సర్వమూ అవుతున్నాను. ఆ రూపంలో, ఈ రూపంలో, అన్ని రూపాల్లో నేనున్నాను. నన్నీ రూపంలో నీవు సంతోషపెట్టావు. అయితే అదే సమయంలో తక్కిన ఈ రూపాల్లో పూర్తిగా ఉపేక్షించావు. అందువల్ల ఇప్పుడు నన్నీ అన్ని రూపాల్లో (కుటుంబ సభ్యులు) కూడా సంతోషెట్టుము" అన్నారు. దీనిని బట్టి గృహస్తులుగా మన ధర్మమేమిటో వివరించటమే కాక, మెహెర్ బాబా తనదైన శైలిలో తన నెలా సేవించాలో కూడా విశదపరచారు.

# సంస్కారాల ప్రభావం

ఒక జీవుడు ఈ జన్మలో పొందే కష్ట సుఖాల్ని తన గత జన్మలో నిలవవున్న సంస్కారాల ప్రభావంగా గుర్తించాలని బాబా చెప్పారు. జీవాత్మ మరింత పురోభివృద్ధి చెందాలంటే తనలో పేరుకున్న సంస్కార లక్షణాల బట్టి ఉంటుంది. నిజానికీ సంస్కారాలే ఆ ఆత్మ ఈ భూఖండంలో ఏ ప్రాంతంలో పునర్జన్మ తీసుకోవాలో నిర్ణయిస్తాయని, మళ్లీ పుట్టేది ఆడగానా, మగగానా అని కూడా అవే నిర్ణయిస్తాయని, ఒక జన్మా, ఇంకా మరిన్ని జన్మలా అని కూడా అవే నిర్ణయిస్తాయని బాబా మన సంస్కారాల ప్రభావం గురించి ఎంతో చెప్పారు. పెళ్లైన భాగస్వానముల మధ్య ఒకరు బ్రహ్మచర్యం పాటించాలనుకొని, రెండవ వారు సంసార జీవిత సుఖాన్ని కోరుకుంటే, ఈ సమశ్యను ఎలా తీర్చాలన్నప్పుడు, వివాహ జీవితమంటే కేవలం రోజూ లైంగిక వాంచలు తీర్చుకొనేందుకు మాత్రమే కాదని ప్రేమగా లాలిస్తూ పరస్పర అవగాహనతో తమ తమ ధర్మాల్ని పాటిస్తూ అన్యోన్యంగా సహజీవనం కొనసాగిస్తూ దైవ ప్రేమకు మార్గాన్ని సుగమం చేసుకోవాలి.

ఒక జీవి ప్రాగ్దేశాల్లో అనేక జన్మలెత్తి, తిరిగి పశ్చిమదేశంలో జన్మిస్తే అప్పుడా జీవి, తనతో పాటు తూర్పు దేశపు జన్మల్లో పోగుచేసుకున్న జ్ఞాపకాలను తనతో తెచ్చుకుంటుందని బాబా చెపుతూ, పశ్చిమ ఖండంలో జన్మ తీసుకున్నా ఆ జన్మలో తూర్పు దేశపు ఆచారం ప్రకారం గడపాలని చెప్పారు. అలాగే పశ్చిమ దేశంలో పుట్టినప్పుడు అలవడిన అలవాట్లు ఆ జీవిని అంటి పెట్టుకొని ఉన్నందున ఆ పోలికలు ప్రస్ఫుటమవుతాయట. ఇక్కడ ముఖ్యంగా మనం గమనించాల్సింది, ఇటువంటి మార్పు కేవలం గత జన్మల సంస్కార ప్రభావమేనని గ్రహించాలి. అయితే ఆత్మ వీటన్నిటికీ అతీతమైనది. కోరికలతో ఏ పనిని చేసినా సంస్కారాలబ్బుతాయి. అందువల్ల ఫలితమాశించ కుండా ఆ పని చేయాలని బాబా చెప్పారు. కొత్త సంస్కారాలు పుట్టకుండా ఆపేందుకు గత జన్మ సంస్కారాల్ని తుడిచి వేసేందుకు అవతారుడి సహవాసము తప్పని సరి. ఆయన కొంగు బంగరు భాగ్యం లభిస్తే వెలుగొందుతున్న ఆయన దివ్య తేజంలో, గతము, వర్తమానము మరియు భవిష్యత్తుకు సంబంధించిన సమస్త సంస్కారాలు భస్మీపటలమై పోతాయని బాబా అభయమిచ్చారు. బాబా సంస్కారాలు రహితం గురించి చక్కని సారూప్యాన్ని వివరించారు. "యుగాల తరబడి మనం పోగు

చేసుకున్న మంచి - చెడు సంస్కారాలు మననెత్తి మీదున్న తెలుపు నలుపు వెంట్రుకల వంటివి. ఈ కలగలుపు మిశ్రమ వెంట్రుకల వంటి సాంస్కారాల్ని యోగులు పైపైన క్షురకర్మలో గొరిగినట్లు అసంపూర్ణంగా తొలగిస్తారు. అయితే ఒక సద్గురువు లేదా అవతారుడు వాటన్నిటినీ సమూలంగా తొలగించగలరు. అవిశాశ్వతంగా తొలగించబడినప్పుడు, గమ్యం చేరే మార్గంలో పురోభవృద్ధి సాధ్యపడుతుంది. మనస్సు నిండా పేరుకున్న సంస్కారాలన్నిటినీ తుడిచివేయాలి. ఆలా చేస్తే అవి మరెన్నడూ పునరుత్పత్తి కావు. అందుకు నన్ను ప్రేమిస్తూ నా కొంగు గట్టిగా పట్టుకోవటం ఒక్కటే మార్గం''.

# నిస్వార్థసేవ

దైవాన్ని ప్రేమించేందుకు రకరకాల మార్గాలున్నాయి. ఆయన స్థితులు అనంతమైనవి. ఇందులో శక్తి జ్ఞానానందములనేవి త్రిగుణాలు. అయితే అనంతమైన నిష్కపటం, అనంతమైన అనుగ్రహం కూడా ఆయన స్థితులలో ఒక భాగమే. మెహెర్ బాబాలో ఇవన్నీ ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. స్వార్థాన్ని గురించిన ఆలోచన లేవీ లేకుండా ఉండ కలిగితే ఈ అనుగ్రహానికి పాత్రులమైనట్లేనిస్వార్థంగా తోటి వారికి సేవ చేస్తే భగవంతునికి సేవ చేసినట్లే నని బాబా చెప్పారు. అయితే నిస్వార్థం అనే పదాన్ని చాలా తేలికగా వాడటం వల్ల, దాని అర్థాన్ని కోల్పోయింది. నిస్వార్థ సేవ అతి సహజంగా జరగాలి. సేవ చేశామన్న చింతన ఏ మాత్రం ఉండకూడదు. సాక్షాత్తు పరబ్రహ్మ పరమాత్మ స్వరూపమైన మెహెర్ బాబానే నిస్వార్థంగా సేవించుకొనే అదృష్టం దొరికితే వారి జీవితం ధన్యత చెందుతుంది.

మెహెర్ బాబా శిష్యుల్లో భిన్న దేశాలకు, విభిన్న జాతులకు చెందిన వారెందరో ఉన్నారు. వారిలో ఐరోపా దేశస్తుడు లూయిస్ చార్లెస్ నెల్వామ్స్ అనే ప్రప్రథమ ఐరోపా వాసి ఒకరు. వయస్సు షుమారు 55 ఏళ్లుండేది. ఈయన పూనా నుండి వచ్చి 20 జూన్ 1925న బాబా మండలిలో చేరాడు. ఈయనకు హిందీ, మరాఠీ భాషలు కూడా బాగా వచ్చును. జూలై 23న రోజూ బాబాకు సపర్యలు చేసే సేవక శిష్యుడు రాకపోయే సరికి ఆ స్థానంలో బాబాకు సేవచేసే మహద్భాగ్యం నెల్వామ్స్‌కు దక్కింది. అంతకుముందు కొన్నిరోజుల్నుంచి తన

కాలికి తగిలిన దెబ్బ సెప్టిక్ కావటంతో ఆ పుండు కుళ్లి చీముపట్టి నెల్సామ్స్ బాధపడుతున్నాడు. అయినప్పటికి తనకు దొరికిన సువర్ణావకాశాన్ని జారవిడుచు కోకుండా, బాబా సేవలో ఒక్క రోజు ధన్యత పొందాడు. రెండవ రోజున నెల్సామ్స్ లేవలేక మంచముపై ఉండటాన్ని బాబా గమనించి స్వయంగా అతని మంచం దగ్గరకు వెళ్లి పరామర్శించి 'రేపటికి బాధంతా నివారణవుతుంది'' అని చెప్పారు.

బాబా మాటలను ఆ క్షణంలో ఎవరూ అర్థం ఏసుకోలేదు. కానీ మర్నాడు ఉదయం నెల్సామ్స్ ప్రాణవాయువు పంచభూతాల్లో లీనమైనప్పుడు బాబా మాటలకు అర్థం అందరికీ తెలిసింది. ఈ యూరపు దేశీయుని కళేబారాన్ని బాబా ఆజ్ఞపై, అహ్మదునగరులో ఉన్న క్రైస్తవ స్మశాన వాటికలో సమాధి చేశారు. ఆనాడు బాబా ఎటువంటి ఆహారం తీసుకోలేదు. మంచి నీళ్లు కూడా తాగలేదు. అయినా తన నిత్యకృత్యాలన్నీ యధావిధిగా నిర్వర్తించారు. ఆనాటి సాయంత్రం జరిగిన ఆధ్యాత్మిక చర్చల సందర్భంగా బాబా ఇలా వివరించారు. "నెల్సామ్స్ మరణించటం వల్ల తన స్థూల శరీరాన్ని వదిలాడే కాని, అతని మనస్సింకా బ్రతికే యున్నది. ఈ మనస్సు త్వరలోనే మరొక అర్హమైన స్థూల శరీరాన్ని పొంది నా సాన్నిధ్యానికి మళ్లీ వచ్చును. ముక్తిని పొందిన జీవుల అహంకారపు మనస్సు నాశనమవుతుంది. వారికి మరుజన్మ ఉండదు. కానీ పునర్జన్మ పొందవలసిన వారికి మనస్సు నశించకుండా నిలిచి ఉంటుంది. నిస్వార్థ సేవకు అంకితమైన సర్వార్పణ కావించుకున్న వారు ముక్తిని బడసిన పిమ్మట ప్రియతమునిలో ఐక్యమవుతారు కనుక అట్టి జీవులు విశ్వాత్మక మనస్సు కలిగి యుంటారు."

## మౌనదిన సందేశం

మెహెర్ బాబా తన ఆధ్యాత్మిక విశ్వకార్యక్రమాన్ని 1921లో ప్రారంభించారు. అతి త్వరలోనే శిష్యులెందరో చేరువయ్యారు. శారీరక, మానశిక శిక్షణల ద్వారా వారికి నిస్వార్థ సేవ నలవర్చి కఠోరమైన జీవితాన్ని గడపటం నేర్పారు. భగవంతుని ప్రేమించటాన్ని, ఆధ్యాత్మిక జ్ఞానంపై అవగాహనను కూడా నేర్పి తన శిష్యులకు పరిపూర్ణ శిక్షణా కాలం పూర్తి చేసిన తరువాత, ఇప్పుడు మెహెరాబాదు అని పిలువబడుతున్న చోట ఆశ్రమాన్ని స్థాపించారు. తన కార్యక్రమంలో భాగంగా ఇక్కడ ఒక బాలుర పాఠశాలను నెలకొల్పారు. జీవితంలో ఆధ్యాత్మిక విలువలను

ఎలా జీర్ణం చేసుకోవాలో ఇక్కడ బోధించేవారు. ధర్మాసుపత్రి, పేదవారికి, కాందిశీకులకు, ఆరామాల్ని ఏర్పాటు చేశారు. వ్యక్తుల మధ్య తరతమ బేధం లేకుండా అంతా ఒక్కటే అన్నభావం ఉండేది. భగవంతుడు ఒక్కడే తక్కినదంతా మిధ్య, భ్రాంతి, అన్న సత్యాన్ని గురువు యొక్క ప్రేరణ ద్వారా మనలో మేల్కొలుపుటకు, అనేక సామూహిక కార్యక్రమాలను నిర్వహించారు. భగవంతుని ఆదిమూల స్థితి పరాత్పర పరబ్రహ్మస్థితి. అది పరిపూర్ణ మౌనస్థితి. నిరాకార నిర్గుణ శూన్యస్థితి అది. అందుకే భగవంతుడంటే మౌనం అంటారు. సాక్షాత్తు ఆ మౌనమే మూర్తీభవించిన రూపాన్ని దాల్చి మెహెర్ బాబాగా అవతరించటం జరిగింది.

మూర్తీభవించిన మౌనం తన నిజస్థితిని బహిర్గత పరిచే సమయమాసన్న మైనందున 10 జూలై 1925 నుండి మెహెర్ బాబా సంపూర్ణ మౌనాన్ని అవలంభించారు. దాదాపు 44 ఏళ్లు ఆ దివ్య మౌనాన్ని అఖండంగా కొనసాగించి తన చిన్మయ చేష్టలద్వారా ఎన్నెన్నో మేలుకొలుపులు కావించారు. తన మౌనాన్ని గురించి బాబా వివరిస్తూ "ఇది నా బహిరంగ ప్రత్యక్ష సాక్షాత్కారానికి సూచన. నేను మానవుడు పొందేందుకు కనువుగా అత్యంత గొప్ప సంపదను తెచ్చాను. నిధులకు నిధియైన ఈ సంపద ఎన్నటికీ తరగదు. శాశ్వతంగా ఉంటుంది. ఎందరెంత పంచుకున్నా అది మరింత పెరుగుతుంది. కనుక ఈ నిధిని పొందేందుకు మిమ్ములను సిద్ధపరచటమే నా కార్యక్రమం" అన్నారు. తన విశ్వసం దేశంలో "నా ఈ ప్రస్తుత అవతార రూపం, ఈ యుగంలో చిట్ట చివరిది. కనుక నా ప్రత్యక్షీకరణ ఎంతో ఘనంగా ఉంటుంది. నేను ఈ మౌనాన్ని త్యజించినప్పుడు, నా ప్రేమ యొక్క భారీ ప్రభావము, విశ్వాత్మకమై, సృష్టిలోని సకల జీవకోటి దానిని తెలుసుకొనగలిగి, గ్రహించి, భావించి స్వీకరించ కలుగును.

మెహెర్‌బాబా తరచుగా తన మౌన విరమణ సమయమాసన్న మైందని, అతి చేరువలోనే ఉన్నదని అనేవారు. ఆయన వాక్కు దైవవాక్కు. భగవంతుని మాటలు ఎన్నటికీ వృధాకావు. కాల క్రమంలో అవి జరిగితీరుతాయి. బాబా పాటించిన మౌనాన్ని మనభాషలో అన్వయించుకొని, పెదవి విప్పి మాట్లాడకుండా ఉండటమని భావించుట సరికాదు. తననిజస్థితిని ఎరుకతో అనుభూతిపొందిన తర్వాత, మెహెర్‌బాబాగా తన అనుభవాన్ని మనందరికీ ఎరుకపరిచే బాధ్యతను తనపై వేసుకున్నారు. మౌనం మూర్తీభవించిన శరీరంతో ప్రపంచపర్యాటనలు

చేసి, దర్శన స్పర్శభాగ్యాన్ని ఎందరికో కల్పించారు. మస్తు కార్యక్రమాలు, పేదలకార్యక్రమాలు, వంటివెన్నో నిర్వహించి, అతిసామాన్య సత్యాన్ని అత్యంతసులభ శైలిలో విశదపడేట్లు చేయుటకు ఆదర్శంగా దైవజీవితాన్ని గడిపారు. మానవులంతా సోదర బావంతో ఏకమయ్యేట్లు తర్ఫీదు ఇచ్చారు. ఈర్ష్యద్వేషాల స్థానంలో ప్రేమ అవగాహనలకు చోటు కల్పించారు భగవంతుని యందు తామంతా ఒక్కటే నన్నభావాన్ని సర్వే సర్వత్రా నెలకొల్పారు. బాబాను ప్రేమించే ప్రేమికులు, ఆయన దైవత్వపు క్షణిక దృష్టిని ప్రొది చేశారు. అమూల్యమైన ప్రేమనిధిని ఈ లోకానికందించారు. ఒక ఆ దివ్య మౌనానికి మిగిలిన ఏకైక బాధ్యత తన ప్రతక్షీకరణ మాత్రమే. ఈ అద్వితీయ సమయంకొరకే యావత్ ప్రంపంచం, వేయి కళ్లతో ఎదురు చూస్తున్న శుభ తరుణమాసన్నమైంది.

అవతారుని అవతరణను గురించి బాబా ప్రవచించిన ప్రకటనలపై పరిపూర్ణవిశ్వాసము ఉంచిన మనం ఆయన ప్రత్యక్షీరణకై తహతహ పడటం సహజం. ఇట్టి ఉద్విగ్న సమయంలో మెహెర్‌బాబా మౌనవిరమణ గురించి ప్రస్తావిస్తూ బాహ్య ంగా కనిపించే మాయాజగత్తులోని వైవిద్యాన్ని మానవులు తమ జీవితంలో అనుభవించాల్సియున్నప్పటికీ, మీ హృదయాల్లో ప్రేమబీజాన్ని నాటి, ఈప్రపంచంలో జాతి, కుల, మత, వర్ణ, వివక్షతలు లేకుండా ప్రేమ ద్వారా పరస్పర తాదాత్మ్య అనుభవాన్ని అందించేందుకే నేనువచ్చాను. దీనిని సాధించుటకే. నేను మౌనాన్ని వదిలి పెట్టె ఏర్పాటు చేశాను. అలా మౌనభంగం చేయడం, మీ చెవులను ఆధ్యాత్మిక ఉపన్యాసాలతో నింపేందుకుకాదు. ఆ సమయంలో ఒకేఒక శబ్దాన్ని ఉచ్ఛరిస్తాను. అది అందరిహృదయాల్లోకి పోతుంది. పాపాత్ముడు సైతం తానొక పవిత్ర వంతుడ్ని అయ్యే అవకాశమున్నదని, తెలుసుకుంటాడు. పవిత్రుడు, తనలో మాదిరిగా దురాత్ముని యందు కూడా భగవంతుడున్నాడని తెలుసుకుంటాడు" అని వివరించారు.

10 జూలై 1968న తన 43వ మౌనదిన సందర్భంగా అందించిన సందేశంలో బాబా ఇలా వివరించారు. 1968 జనవరి 25నుండి 1968 జూలై 9 వరకు నాప్రేమికులంతా రోజూ పర్వర్దిగార్ ప్రార్థన, పశ్చాత్తాప ప్రార్థన పఠించాలని నేను కోరుతున్నాను. 1968 జూలై 9 అర్ధరాత్రి మొదలుపెట్టి జూలై 10 అర్ధరాత్రి వరకు సంపూర్ణ మౌనవాన్ని పాటించాలని కూడా నేను నా ప్రేమికులను కోరుతున్నాను. మెహెర్ బాబా జీవితంలో ఇదే అఖరి మౌనదినము ఐన్నట్లు ఈ

మౌనదిన సందర్భంగా 17-1-1968 న జారీచేసిన వేరొక సందేశాన్ని తయారు చేయించి, దానిని 10-7-1968 వ తేదీన మాత్రమే ప్రకటించాలని ఆదేశించారు.

"భగవంతుడవైన నాతండ్రీ ! నీకు ప్రియతముడైన నీకుమారుడు. నీ కార్యమునంతటినీ, ఈ సంవత్సరమే ముగించేట్లుగా అతనికి పూర్తిగా సహాయమందించుము. ఏలననగా ఈ సంవత్సరం జూలైనెలతో నీకుమారుని మౌనము అంతమవుతోంది". - మెహెర్‌బాబా

1969 జనవరి 31న మధ్యాహ్నం బాబా తన భౌతిక శరీరాన్ని పరిత్యజించారు. అదే రోజున ఉదయంపూట హాఫీజు సూక్తులున్న బోర్డును తెప్పించి, మండలిలో ఒకరిచేత చదివించారు. అందులో మూడు సూక్తులున్నాయి.

'నీ యజమాని నిన్ను చేయమని ఆజ్ఞాపించిన కార్యాన్ని మారు ప్రశ్నలువేయక, ధన్యతముడైన బానిసవలె నీవు నిర్వహించాలి.

" ప్రియతమా ! నీ యజమాని నీకు ఆదేశమురూపంలో, ఏమి వినిపించినా, వాటి యందు నీవు తప్పులను ఎంచరాదు. ఏలనన, ఆయన ఆజ్ఞలను, యధాతథంగా గ్రహించే శక్తి నీకులేదు. కనుక ఆ తప్పిదమునీదే అవుతుంది.

నా అజ్ఞానాన్ని తొలగించిన నా యజమానికి నేను బానిసను. నా యజమాని చేసేదంతా లోక కళ్యాణము కొరకే అవుతుంది.

"జగత్తంతా వినమ్రతతో జాగరూకత వహించి, నా పదాలన్ని వినేందుకు సిద్ధంగా తయారైనప్పుడు నేను నా మౌనాన్ని త్యజిస్తాను - మెహెర్‌బాబా". అన్న బాబా అభయం ఆచరణలో జరిగేతరుణం వచ్చింది. వినాశకర అలలు సమశిపోయి, ప్రశాంతత నెలకొనే సమయం ఆసన్నమైంది. వినాశకర అలలన్నీ సమశిపోయేట్లు చేసి, జగత్తులో ఆనందం వెల్లి విరిశేట్లు చేయవలసిన అవసరం వచ్చింది. సహృదయులతో శాశ్వత ప్రశాంతతో ప్రపంచంపునర్ నిర్మితమై మానవాళి మధ్య సోదరభావం, సమానత్వం అలుముకునేట్లు చేసే బాధ్యత మిగిలి ఉన్నందున, దానిని పూర్తి చేయుటకు తన సహజ స్థితియైన సర్వ వ్యాపక స్థితిని తిరిగి స్వీకరించాల్సిన సమయం వచ్చింది. దీనిని వ్యక్తం చేయుటకే అన్నట్లు బాబా చాలా సందేశాలందించారు.

"నా విశ్వభారపు వత్తిడి నా శరీరంపై బాధగా ప్రతిఫలిస్తోంది. అలాగే నేను నా ఏకాంత వాసములో నిర్వహించిన కార్యక్రమపు శ్రమతోడైనా శరీరంపై దాని

ప్రభావం ఎక్కువైంది. ఈ పరిస్థితి మానవ సంబంధమైనదైనప్పటికీ దాని మూల కారణం దైవ మైనందున ఇది నా చేతుల్లోనే ఉన్నది.''

''నా బిడ్డలందరి క్షేమం కోరి, నేను ఎంతో ఓర్పుగా మౌనంలో వారి బాధల్ని భరించాను. ఇప్పుడు వారంతా తమ తండ్రి తమ మధ్యే ఉన్నాడన్న ఎరుకను తమకుతాము గ్రహించకలిగే సమయం వచ్చింది. నా బిడ్డలు సాక్షాత్తు భగవంతుడే అయిన, అవిభాజ్యము, అగోచరమైన యదార్థఉనికిని (సర్వవ్యాపకస్థితిని) తమ జీవితాల్లో గుర్తించేట్లు నేను నా మౌనాన్ని నా ఆదిపదముతో విరమించి మేల్కొలుపుతాను''

'' నేను నా మౌన విరమణ చేసినప్పుడు, నా మానవ ముఖతః ప్రాథమిక సముద్రఘోష ''ఓం....'' అనే ధ్వనిని ఉచ్చరిస్తాను. ఈ ఆదిపదముయొక్క ప్రభావము, వ్యక్తిగతమైనను, పై వాటి స్థూలత్వాన్నిబట్టి, గ్రహణశక్తిని బట్టి పనిచేస్తుంది ఈ ఆదిపదమును నేను ఉచ్చరించినప్పుడు మానవులందరిలోను సకల సృష్టియందు అది ప్రకంపిస్తుంది. మరియు అందరూ అప్పుడు నేను నా మౌనాన్ని విరమించానని, ఆ శబ్దాన్ని లేదా పదాన్ని ఉచ్చరించానని తెలుసుకుంటారు.''

''వినుట అవగాహన కాదు. అవగాహన ఆలోచన కాదు. ఆలోచన గ్రాహ్యతకాదు. గ్రాహ్యత అనుభం కాదు. అనుభవం దైవసాక్షాత్కారం కాదు.''

'నేను మౌనాన్ని చేపట్టి కొనసాగించింది ప్రధానంగా ఇతరులమంచికొరకే'

''నేను ఈ రూపంలో బంధించబడి లేను. నేను మీకు స్పష్టంగా వ్యక్తమయ్యేందుకు దీనినొక దుస్తుగా వాడుతున్నాను. దీని ద్వారా మీకర్థమయ్యేట్లు మీకు సరిపోయే మాటల్నందించాను. నా చైతన్యానికి సంబంధించిన భాషను నేనుపయోగిస్తే నేను మాట్లాడేదేదీ మీరు తెలుసుకోలేరు. నన్నర్థం చేసుకొనుటకుప్రయత్నించకండి. నాలోతులు కొలువశక్యంకావు.''

ఈ పై సందేశాలన్నీ ఆయన దైవత్వానికి సంబంధించిన అధికారాన్ని సూచిస్తున్నాయి. బాబా శరీరంతో ఉన్నప్పుడు, మనమంతా ఆయన దివ్య సముఖంతోఅనుసంధింపబడ్డాము. అవతారుడిగా ఆయనలో దైవము, దైవత్వమూ రెండూ ఉన్నాయి. దైవము స్పష్టమైంది. కానీ రెండవ దైన దైవత్వము శరీరధారిగా విశదపడలేదు. మెహెర్ బాబా దైవంగా శరీరంతో ఉన్నప్పుడు,

ఆయన దైవంగా విశదపడ్డారు. నా దివ్యాధికారంతో చెపుతున్నానంటూ ఎన్నో ప్రకటనలందిచారు. ఆ దివ్య సముఖ ప్రేమ పరిధిలో ఉన్న మనం ఆయన యొక్క దైవత్వాన్ని చూడాలంటే ఆయన అవ్యక్త దైవత్వంతో ధృడంగా అనుసంధింపబడాలి. వ్యక్తుడుగా బాబా దైవం. అవ్యక్తుడుగా దివ్యత్వుడు. ఆయన దివ్యత్వాన్ని మనం చవిచూచేందుకే తన దైవ ముఖాన్ని మనకు దూరంగా వెనక్కి తిప్పారు. అంతేకానీ ఆయన ఎక్కడికి పోలేదు. తన శరీర త్యాగానంతరం 100 ఏళ్ల వరకు తన కార్యక్రమం యధావిధిగా కొనసాగుతుందని బాబా చెప్పారు. పరిమిత శరీర బంధమునుండి విడివడి సర్వవ్యాపకత్వంతో మనతో విడదీయలేని బంధాన్ని కొనసాగిస్తున్నారు. దీనిని బట్టి బాబా మౌన విరమణ అంటే, రూపుదాల్చిన ఆ మౌన రూపాన్ని విరమించుట అనే స్ఫురిస్తున్నది.

3-5-1965న పూనా గురుప్రసాద్‌లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖామాత్యులు మర్రి చెన్నారెడ్డిగారు కుటుంబ సహితంగా బాబా దర్శనం చేసుకున్నప్పుడు వారి మధ్య జరిగిన సంభాషణలో, బాబా ఆయనకు ఇచ్చిన సందేశం కూడా గమనార్హమే.

"నా అనుగ్రహం మీపై ఎప్పుడూ ఉంటుంది. నేను నా మౌనాన్ని విరమించినప్పుడు, ఈ ప్రపంచం నేనెవరినో తెలుసుకుంటుంది. అప్పుడు దుఃఖమంతా అంతమొందుతుంది. అప్పుడే నన్ను ప్రేమిచటం ప్రారంభిస్తారు. అప్పుడు భగవంతుడ్ని గురించి తప్ప తదితర విషయాల గురించి ఆలోచించనక్కర్లేదని తెలుసుకుంటారు". ఈ మౌన ధారి శరీరంతో ఉన్నప్పుడు ఆయన చుట్టూ పరివేష్టించి ఉన్న అనుచరులు కేవలం ఆయనలోని దైవాన్ని కొలుచుకుంటూ బహుస్వల్ప సంఖ్యలో ఉన్నారు. మరి ఆయన తన పరిమిత రూపాన్ని పరిత్యజించి సర్వవ్యాపక స్థితిని పొందిన తర్వాత 30 ఏళ్లకు ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఆయన ప్రేమికులను, వారు నిర్వహిస్తున్న కార్యక్రమాన్ని నిశితంగా పరికిస్తే ఆయనలోని దివ్యత్వం ఎంతగా ప్రభావితము అవుతున్నదో గమనించవచ్చును. రణగొణధ్వనులతో హోరెత్తించే శబ్దాన్ని పుట్టించే మాటల్ని మాట్లాడకుండా ఉండటమే మౌనము అని అనుకొనుటను బాబా మౌనంతో పోల్చే వీలులేదు.

"నేను మౌనంగా లేను. భగంతుడు నిరంతరంగా పనిచేస్తున్నాడు. ఈ మౌనాన్ని తెలుసుకోగలిగిన మహాత్ములు తప్ప ఇతరులెవ్వరూ దీనిని గుర్తించలేరు.

వినలేరు కూడా. నా మౌనమే మాట్లాడలేనప్పుడు నోటితో చేసే ప్రసంగాల ప్రయోజనమేముంటుంది. మీరు నా మౌనాన్ని వినలేనప్పుడు, నా ప్రసంగాల్ని కూడా వినలేరు. ఎందుకంటే దైవలక్షణము దైవభాషకూడా మౌనమేననీ మౌన విరమణ నా బహిరంగ ప్రత్యక్ష సాక్షాత్కారానికి సూచన... ఈ జగత్తు భారాన్ని మోస్తున్న వత్తిడిలో నా మౌనం నుండి నా ఆదిపదం తప్పించుకుంటుంది. నా అంతట నేను, ఈ మౌనాన్ని విరమించను. ఇదే నా మహనీయత". అన్న యీ సందేశాలలో కూడా మౌనం అంటే అదేదో, బాబా పాటించిన మౌనంగా కాక, మూర్తీ భవించి రూపు దాల్చిన ఆ మౌన శరీరాన్ని గురించేననిపిస్తుంది.

1 నవంబరు 1968న ఒక సందేశాన్నందిస్తూ మెహెర్‌బాబా, 1969లో 10 ఏప్రియల్ నుండి 10 జూన్ వరకు తాను ఇవ్వబోతున్న అంతిమ దర్శనం గురించి వివరిస్తూ ఇదే భావాన్ని వ్యక్తపరిచారు. "నా ప్రేమికులందరకు, ఇప్పుడు సరైన సమయం వచ్చింది. - ప్రపంచ వ్యాప్తంగా ప్రజాసమూహాలు నా చెంతకువచ్చి, నేను నా మౌనాన్ని విరమించి, నా దైవత్వాన్ని విశదపరచే సమయంలో నాతోఅనుసంధింపబడే తరుణమాసన్నమైంది. నా ప్రేమికులకు నా దర్శనం ఇవ్వటం అతి సులభం. కనుక మీరెవరూ దాని గురించి చింతించకండి. నేను నా దర్శనాన్ని పడుకొని ఇస్తాను. అలా చేయుటవల్ల నా శరీరంపై ఎటువంటి భారం ఉండదు. ఇంత క్రితం నేనిచ్చిన దర్శనాలన్నిటి కంటే ఇది భిన్నంగా ఉంటుంది. నా మౌనంలో నేనిచ్చే చిట్ట చివరి దర్శనమిది. నేను పడుకొని ఉన్నా చాలా బలంగా ఉంటాను. ఇప్పుడున్న నా శారీరక స్థితి నేను చేస్తున్న కార్యభారం వల్లనే. కానీ అప్పటికి నా కార్యక్రమం పూర్తవుతుంది. నా ఔన్నత్యం అత్యంత ఘనంగా ఉంటుంది. ఒక కటిక దరిద్రుడు, లాటరీలో గెలిస్తే, ఆ హఠాత్పరిణామానికి దిగ్భ్రాంతిచెంది ప్రాణాలొదులుతాడు. నా అదృష్టమంతా నేను నాకార్యక్రమాన్ని పూర్తి చేయటంలోను, దానివల్ల కలిగే ఫలితాలలోను నిబిడీకృతమైయున్నది. అయితే నేను జనన మరణ రహితుడను. నేను పొందే సంభ్రమాశ్చర్యాలు నా మరణానికి ఏమాత్రం కారణం కాబోవు - అది నా ఘనవైభవమవుతుంది."

43వ వార్షికోత్సవ సందర్భంగా కూడా 17 జనవరి 1968న ఇచ్చిన సందేశంలో "దివ్యపితా! మీ ప్రియ కుమారుడు మీ సమస్త కార్యక్రమాన్ని కొనసాగించి పూర్తి చేయుటకు సహాయపడుగాక ! ఏలనన, ఈ సంవత్సరం జూలై

నెల తన మౌనానికి ఆఖరి సంవత్సవరం. - మెహెర్‌బాబా" అని ప్రవచించారు. పైన పేర్కొన్న ప్రకటనలన్నిటిలోను, మౌనాన్ని త్యజించటం గురించి, దానితో పాటే శరీరాన్ని త్యజించుట గురించి లీలగా మన దృష్టికి తెచ్చినట్లు అవగతమౌతున్నది. అందుకే బాబా " నా కార్యక్రమం పూర్తయింది. నా సంతృప్తిమేర అది నూరుశాతం పరిసమాప్తమైంది. దాని ఫలితం కూడా నూరు శాతమే. దీని విశదీకరణ సెప్టెంబరు 1968 చివర నుండి బహిర్గతమవు తుంది" అని ప్రకటించారు.

# బాబా షష్ట సూత్రాలు

మెహెర్‌బాబా ఆస్ట్రేలియా వెళ్లినప్పుడు అవతార్స్ ఎబోడ్‌లో ప్రసంగిస్తూ ప్రియతముని ఇచ్ఛకు యధాతథంగా పాటించటం ప్రతి ప్రేమికుని విధి" అంటూ తన ప్రేమికులకు ఉండాల్సిన తన వాంఛితాల్ని ఇలా వివరించారు.

1. నీ బాధ్యతలను ఎన్నడూ వదిలిపెట్టకు.
2. నీ ప్రాపంచిక విధులను నిజాయితీగా నిర్వర్తించుము. అయితే ఎల్లప్పుడూ నీ మనసులో ఇదంతా బాబాయే చేస్తున్నాడని భావించుకో.
3. నీవు సంతోషంగా ఉన్నప్పుడు, బాబా నన్ను సంతోషంగా ఉండమన్నాడని అనుకో. నీవు బాధల్లో ఉన్నప్పుడు బాబానన్నా బాధల్ని అనుభవించమన్నారని అనుకో.
4. నీవున్న ప్రతి పరిస్థితిలోనూ, నిబ్బరంగా, ఉండి, నిజాయితీతో ఆలోచించి, నన్నిటువంటి పరిస్థితులలో బాబాయే ఉంచారని అనుకో.
5. ప్రతివారిలో బాబా ఉన్నారన్న అవగాహనతో ఇతరులకు సహాయపడుతూ, సేవలందించేందుకు ప్రయత్నించు.
6. నేను నాదివ్యాధి కారముతో చెపుతున్నాను. ప్రతివారికి, ఎవరైతే తమ అంతిమ ఘడియల్లో నానామాన్ని స్మరిస్తారో వారు నా చెంతకు చేరుకుంటారు. కనుక మీ అంతిమ ఘడియల్లో గుర్తుంచుకొనుట ప్రారంభించకపోతే, మీకు అంతిమకాలము ఆసన్నమైనప్పుడు నన్ను జ్ఞాపకం చేసుకోవటం చాలా కష్టమవుతుంది. కనుక ఇప్పటి నుండే సాధన చేయటం ప్రారంభించండి. కనీసం రోజుకు ఒక్కసారైనా నామాన్ని స్మరిస్తే, మీ మరణకాలంలో మీరునన్ను గుర్తుకు తెచ్చుకొనుటను మరవరు.

"నా సమక్షంలోఆలోచించుటకు వెనుకాడని వాటిని గురించి ఆలోచించండి. నా సమక్షంలో మాట్లాడేందుకు వెరవని మాటలను మాట్లాండి. నా సమక్షంలో చేయుటకు వెరవని పనులను, చేయండి. అంటూ జోరాష్ట్రురుగా వచ్చినప్పుడు అందించిన మంచి ఆలోచనలు, మంచి మాటలు మంచి చేతలు' 'ప్రస్తావించారు. అవగాహనకు అర్థం లేదు ప్రేమకు అర్థం ఉన్నది. విధేయతకు మరింత అర్థం ఉంది. నా కొంగు పట్టుకొనుటకు ఇంకా అధిక అర్థం ఉన్నది. నా కొంగు పట్టుకొనుట అంటే సామాన్య విషయం కాదు. దీనికి ఎంతో అర్థం ఉన్నది. చంటి పిల్ల తల్లి కొంగును పట్టుకోవటం వంటిది"

"మీరు చంటి పిల్లలుగా మారి నా కొంగుపట్టుకోవాలి. అప్పుడు మీ బాధ్యతంతా నాపైనే ఉంటుంది. అంటే మీరు పూర్తిగా నాపై ఆధారపడాలన్న మాట. మీరు పశి పిల్లలుగా మారిపోతే నా కొంగు పట్టుకోవటం చాలా సులభం. అలా నా కొంగుపట్టుకుంటే, మీ రక్షణలో భయం ఉండదు. అయితే పెద్దవారు చిన్న పిల్లలుగా మారి తల్లి కొంగును పట్టుకున్నట్లు నాపై ఆధారపడటం చాలా కష్టమైన విషయం. ఇదంతా మీకు నాపై ఉన్న అవగాహన ప్రేమ, విధేయతలపై ఆధారపడి ఉంటుంది. సంతకు వెళ్లిన పశి బిడ్డ భయంతో తల్లి కొంగు పట్టుకున్నట్లు, సమశ్యల్లో చిక్కుకున్నప్పుడే మీరు నా కొంగును పట్టుకుంటారు'

"నిజమైన నా ప్రేమికులకు నేను భానిసను" అన్న బాబా సందేశానికి స్పందించే ప్రేమికులెందరో ఉన్నారు. ఆయన్ని ప్రేమించటమే జీవిత పరమావధిగా ఎంచుకున్న ఒక అమెరికన్ ప్రేమికురాలి పేరు మిమిడ్రేన్. ఈమె బాబా ఉన్న రోజుల్లో, బాబా దర్శనం చేసుకోవలెననుకొని ఎంత తపించినా, నీవు చిన్న పిల్లవంటూ వాళ్లమ్మ అభ్యంతరం పెట్టింది. పెద్దయ్యాక ఇండియాకు రావాలని బాబాకు వ్రాస్తే "ఇంకా సమయం రాలేదు. నేను పిలిచినప్పుడు రమ్మనమని" ఆదేశించారు. దాంతో ఆమె బాబా శరీరంతో ఉండగా దర్శించలేక పోయింది. ప్రేమకంటే విధేయత గొప్పదని బాబా చెప్పినందున అక్షరాలా బాబా చెప్పినట్లాచరించింది. చివరకు గురుప్రసాద్‌లో జరిగిన ప్రాక్పశ్చిమ సమ్మేళనంలో పాల్గొన గలిగింది.

ఆమె తన అనుభవాన్ని మెహెరామణీల పేర వ్రాసిన ఉత్తరంలో వివరించింది.

"ప్రియ సోదరీ ! పురాణ పురుషుడిగా జీవించిన ఏకైకునికి నా ప్రేమాంజలి. నేను మొదట్లో, బాబా శరీరాన్ని వదిలారని విన్నప్పుడు, ఏదో పోగొట్టుకున్న దానిగా

పరితపించాను. నేను పురాణ పురుషుడు - భగవంతుడ్ని చూచేందుకే ఈ నేల మీద పుట్టానని ఆలోచిస్తూ, ఆయిన్న దర్శించే భాగ్యాన్ని పొందిన నేనెంతో అదృష్టవంతురాలను. కానీ నేను నిజంగా ఎందుకు పుట్టానంటే, ఆయన్ని ప్రేమించేందుకే ! మరిప్పుడు మునుపటి కంటే ఎక్కువగా బాబా గడిపిన నవజీవనము చూచేందుకు అంతం లేకుండా శాశ్వతంగా కనిపిస్తోంది. ఏమీ కోరకుండా, బాబాను ప్రేమించాల్సిన సమయమిప్పుడు వచ్చింది. కేవలం ఆయన ఏదైె యున్నారో, దాని కోసం నేను మాత్రం కేవలం చిట్ట చివరి వరకూ ఆయన కొంగు జారవిడుపకుండా గట్టిగా పట్టుకోవాలనే కోరుకుంటున్నాను.''

## విధేయత



భగవత్సాక్షాత్కారవధంలో అతిముఖ్యమైన విషయలు మూడున్నాయి. అవి ప్రేమ, విధేయత మరియు సమర్పణ ఈ మూడింటి మధ్య అవగాహనలకు అవకాశము లేదు. భగవంతుడు స్వయంగా మానవుడికి ప్రసాదించే అద్భుత బహుమానం ప్రేమ. సద్గురువు మానవుని కందించే బహుమతి విధేయత. మానవుడు, సద్గురువుకు సమర్పించుకొనే నజరానా సమర్పణ. ప్రేమించేవాడు ప్రియతముడు చెప్పినట్లు నడుచుకోవాలి. విధేయత ప్రియతముని ఇచ్ఛను పాటిస్తూ ఆయన ఆనందాన్ని కాంక్షించును. సమర్పణ ప్రియతముని ఇచ్ఛకు బద్ధుడై సర్వసమర్పణ గావించుకొని దేనినీ కోరదు. విధేయులైనవారు ప్రియతమునికే ప్రియతముడగును. కనుక ప్రేమకంటే విధేయత గొప్పది. ఈ విధేయత నాలుగు రకాలు.

1. **సైనిక విధేయత :** - తన విద్యుక్త ధర్మనిర్వహణలో విధేయుడవటం.
2. **సేవకావిధేయత :** - ఎంత ఎక్కువ ముట్ట చెపితే అంత బెగ్గరగా "అయ్యా, చిత్తం" అనే బత్తెపు విధేయత ఇది.
3. **బానిస విధేయత :** - ఎక్కడ శిక్షిస్తారోనన్న భయంతో వ్యక్తపరిచే విధేయత ఇది.

4. ప్రేమికుని విధేయత :- ప్రేమ ద్వారా విధేయతను వ్యక్తపరచటం. ప్రేమ ద్వారా చూపే విధేయత అత్యున్నతమైన రకము. ఇదే బాబా కోరే విధేయత. ఈ ప్రేమమయ విధేయతలో మళ్లీ మూడు రకాలున్నాయి.

1. తెలివి తేటలు, విచక్షణతో చూపే విధేయత. ఇక్కడ మనస్సు, సాంకేతికంగా విధేయతను పాటిస్తుంది. ఒక వేలుకోసివ్వమంటే, పదును లేని చాకుతో ఒక గాటుపెట్టి నెత్తురు కారేట్లు చేస్తుంది. అంటే తన వేలును పూర్తిగా నరికి వేయనక్కర్లేదని భావిస్తుందన్నమాట.
2. అయిష్టంతో సాహిత్యపరంగా చూపే విధేయత తన ఇష్టాలకు వ్యతిరేకంగా ఆ వ్యక్తి చేసే పని ఇది. ఆముదం త్రాగటంలాంటిది.
3. ఇష్టపూర్వకంగా ఇది సాహిత్య పరమైన విధేయత. అది ఎంత కష్టమైన ఆదేశమైనా, తు.చ. తప్పక చెప్పింది చెప్పినట్లు ఆనందంగా ఆచరిస్తాడు.

బాబా శిష్యుల్లో చగ్గన్ ఒకరు. అతని మరదలు సుమతి పెళ్లికి 11-2-1927 న అకోల్నర్‌లో జరుగుతోంది. బాబా తన మండలితో కలిసి ఈ వివాహానికి హాజరయ్యారు. అంతకు ముందే చగ్గన్‌కు శాంతతోవివాహమైంది. అతని పెళ్లికి ముందు బాబా ఒక షరతు విధిస్తూ శాంత మెళ్లో పూలమాల వేయటం తప్ప ఆమెను స్పృశించరాదని ఆదేశించారు. పెళ్లినాటి నుంచి అతడు అలాగే మనస్ఫూర్తిగా ఆచరిస్తూన్నాడు. అయితే శాంత తండ్రి చాద్వేకి మాత్రం, ఈ వింత ఆదేశం కోపాన్ని తెచ్చింది. ఇప్పుడు సుమతి పెళ్లికి వచ్చిన బాబాను అవమానించి ఘోరంగా దూషించాడు. మొగుడు పెళ్లాల్ని సాధువైన వారెవరూ విడదీయరు. నీవు సాధువుకానే కాదు. ఒక బోగస్ వ్యక్తుడవు, అంటూ తిట్టిపోశాడు. బాబా ఈ అవమానాలేవీ పట్టించుకోలేదు. ఇటువంటి ఈసడింపు మాటలను కిచకిచలాడే పిచ్చుకల అరుపులన్నారు. వివాహం అయ్యే వరకూ ఉండి తనమండలితో బయలుదేరారు. బాబా అనుమతిలేకుండానే చగన్ మాత్రం ఉండి పోయాడు. బాబాను కనీసం భోజనం చేయమని కోరలేదు. కాఫీ టిఫెన్లన్నా బాబాకు అందించలేదు.

అప్పుడు ధాకేఫాల్కర్ తనకు తెలిసిన ఒక స్నేహితుని ఇంటికి బాబా బృందాన్ని తీసుకువెళ్లాడు. వారింటి నడవాలో బాబా ఫోటో వ్రేలాడుతోంది. తనంతట తానే ఆయాచితంగా మెహెర్‌బాబా, వీరింటికి వచ్చేసరికి ఆయజమాని

సంభ్రమాశ్చర్యాలతో తట్టుకోలేకపోయాడు. ఒక ఉచితాసనంపై బాబాను సుఖాసీనుల్ని చేసి, క్షణాల్లో సకల మర్యాదలు చేశాడు. బాబా తన ప్రత్యక్ష సముఖంతో ఆయింటినే పవిత్రవంతం చేశారు. చగన్ ప్రవర్తనతో బాబా కలత పడ్డారు. అయినా ఆ గొర్రె మళ్లీ తన మందలోకి రావాలంటూ బాబా విష్ణు మాష్టరుని పంపి వెంటనే వెళ్లి తీసుకురమ్మన్నారు. బాబా ఆదేశం ప్రకారం మారు మాట్లాడకుండా వచ్చేశాడు. కరుణామయుడైన బాబా అతన్ని తన భార్య శాంతతో అహ్మదునగరులో ఉండేందుకు సమ్మతించారు.

అయితే అంతకు ముందురోజున తనమామ, బాబా యెడల చేసిన అవమానాన్ని తట్టుకోలేక పోయాడు. తన దుస్తుల్ని ఊడదీసి, ఆరంగాం పోలీసులకు వప్పగించి చిన్న గోచీ మాత్రం పెట్టుకొని ఆరంగాం పొలాల్లోకి వెళ్లి ఆత్మహత్యకు ప్రయత్నించాడు. అది గమనించిన కొంతమంది గ్రామస్థులు అతడ్ని వెంబడించి, ఆత్మహత్యా ప్రయత్నాన్ని ఎదుర్కొని ఊళ్లోకి తీసుకువచ్చారు. అతడు పోలీసుల వద్ద ఉంచిన బట్టల్ని కట్టబెట్టారు. రాత్రి 8-00 గంటలకు మెహెరాబాదు వచ్చాడు. బాబా అతడ్ని పిలిపించి, అతడు చెప్పేదంతా ఓపిగ్గా విన్నారు. అప్పటి వరకు తాను తన భార్యతో మాట్లాడటం తప్ప, మరేమీ చేయలేదని, కనీసం తాకనైనా తాకలేదని చెప్పాడు. ఈ విపరీత స్థితికి తనను తన తల్లిదండ్రులు, ఇరుగు పొరుగు సతాయిస్తున్నట్లు శాంత తనతో చెప్పి ఏడ్చిందని చెప్పాడు.

తన భార్య తనతో కలిసి ఉంటాననంటోందని, ఆధ్యాత్మక మార్గంలో నాతో కలిసి సహచర్యం చేస్తాననంటోందని, తనతో సంసారిక జీవితాన్ని గడపమని ప్రేరేపించనని వాగ్దానం చేస్తోందని చెప్పాడు. ఆమెకూడా అతి సాధారణమైన ఆధ్యాత్మిక జీవనాన్ని గడిపేందుకు సర్వసన్నద్ధంగా ఉన్నదని వివరించాడు. అతడు చేప్పే దంతావిన్న బాబా సంతోషించినప్పటికీ, తన ఒరనుంచి ఆదేశాల రూపంలో బాణాలు బయటకు వచ్చేశాయి కనుక వాటిని వెనక్కు తీసుకొనే, ప్రశ్నలేదు. కనుక చగన్ తన ఆదేశాన్ని తు.చ. తప్పక పాటించి తీరాల్సిందేనని కచ్చితంగా చెప్పారు. తన శిష్యుడి వల్ల గురువు ఎన్ని అపవాదులు భరించినా చివరకు అతడ్ని తన మండలిలో అతని స్థితికి మరల చేర్చారు. గురువు నిజంగా విధేయుని విషయంలో చేసేది ఇదే.

# సహనం

ఒకప్పుడు బాబా తన పరివారంతో బొంబాయి మీదుగా క్వెట్టా ప్రయాణమై వెళుతున్నారు. ఆ సందర్భంలో ఆదీ కె.ఇరానీని, పాద్రిని, పిలిచి, అప్పట్లో ఆశ్రమంలో ఉన్న ఒక గుర్రం, ఒక ఎద్దును, సకోరీకి తీసుకు వెళ్లి ఉపాశినీ మహారాజుకు వప్పగించిరమ్మన్నారు. అవి రెండూ మహాభయంరకమైన జంతువులు. ఒక విధాన, ఏ ఒక్కరికి అవి తొంగేవి కావు. బాబా ఆజ్ఞ ప్రకారం, శిష్యులిరువురూ ఆ గుర్రాన్ని ఎద్దుని, నానా తిప్పలు పడి, సాధిక చేసుకొని వాటిని, కోపెర్‌గాం స్టేషను వరకు రైల్లో ఒక ప్రత్యేక వ్యాగెనులో బుక్ చేసుకొని తీసుకువెళ్లారు. దారిలో అవి రెండూ, రైలు పెట్టెలో వాళ్లిద్దరినీ నరకయాతనలు పెట్టాయి. పలుపులు తెంపుకుని మేతా, దానా తినకుండా, కాళ్లతో, తన్నుతూ, ఎంతో వ్యయప్రయాసలు కలిగించాయి. చివరకు ఏదో విధంగా పాపం ఆ ఇద్దరూ శిష్యులు ఈరెండు జంతువుల్ని, కోపెర్‌గాం స్టేషనులో దింపుకొని, తోలుకుంటూ సకోరీలోని ఉపాశినీమహారాజు ఆశ్రమానికి చేరారు. ఆ సమయంలో మహారాజు యోగనిష్టలో ఉన్నందున, స్వయంగా కలవలేకపోయారు. అక్కడున్న ఒకశిస్యుడ్ని కలిసి, తాము వచ్చిన పనినెరిగించి, ఆ జంతువులను స్వీకరించవలసిందిగా మహారాజు కు తెలుపమని కోరారు.

ఆశిష్యుడులోనికి వెళ్ళి మహారాజుకు బాబా పంపించిన వైనం తెలుపగా, ఆయన రుద్రుడై, గాండ్రిస్తూ, మెహెర్ బాబా ఒక దొంగ అని, మన ఆశ్రమంలో ఉండటానికి వీలులేదు. కనుక వెంటనే ఆవచ్చిన వాళ్లను జంతువులను తోలుకొని వెళ్ళి పొమ్మనమని చెప్పమని హెచ్చరించారు. అంతటితో ఆగక మెహెర్‌బాబా ను అనేక దుర్భాషలాడారు. పాపమా శిష్యుడు చేసేదిలేక మహరాజు ముందు మారుమాట్లాడే ధైర్యములేక, బిక్క ముఖంతో బయటకు వచ్చి పాద్రితో మహరాజన్నమాటలన్నీ ఏకరువుపెట్టాడు. వెంటనే పశువుల్ని తోలుకొని ఆశ్రమంబయటకు వెళ్లిపొమ్మన్నాడు. అప్పటికే బాగా చీకటి పడటంతో ఆరాత్రికి అక్కడే ఉండనిమ్మని, మర్నాడు ఉదయం మరొక్కసారి మహరాజును అడిగి చెప్పమని బ్రతిమలాడితే అతికష్టంమీద సరే అన్నాడా శిష్యుడు.

అయితే మర్నాడుదయం, పాద్రి, ఆదీజీలు స్వయంగా మహరాజును కలిసి బాబా పంపిన వైనం తెలపారు. క్రితం రోజు మాదిరిగానే మళ్లీ బాబాను తీవ్రంగా దుర్భాషలాడుతూ, జంతువులతో వెంటనే వెళ్లిపొమ్మని, లేకపోతే అవి దొంగసొత్తని, మెహెర్ బాబా దొంగిలించి తెచ్చాడని పోలీసు కేసుపెడతానని

బెదిరించాడు. శిష్యులు ఎంతగా బ్రతిమాలినా వాటిని ఆశ్రమంలో ఉంచేందుకు అంగీకరించలేదు. ఇప్పుడు వాటిని మళ్లీ మెహెరాబాదుకు తోలుకు వెళ్లటం పెద్ద సమశ్య అయింది. వాటిని ఆశ్రమంలో మహరాజుకు వప్పగించి రమ్మన్నందున, ఇప్పుడు తిరిగి తోలుకు వెళ్లేందుకు వారివద్ద పైకం లేదు. బాబా తీసుకువెళ్లుటకు సరిపడ పైకాన్నే ఇచ్చారు. పోనీ, నడిపించుకొని తోలుకు వెళదామా అంటే, అవి నానా తిప్పలు పెట్టి ఏడిపిస్తాయి. పైగా, వారు త్వరగా వెళితేనే గాని బాబాను బొంబాయి మజలీలో వెంటనే కలుసుకో లేరు. అందువల్ల వారికేం చేయాలో తోచక, వాటిని వెంటనే కోపెర్‌గాం స్టేషనుకు తోలుకుపోయి, స్టేషను మాష్టరుతో చెప్పి "టు-పే" లో బుక్‌చేసి, అహ్మదునగరు చేరాలని సంకల్పించారు. తీరా స్టేనుకు చేరుకొనేసరికి, అదృష్టవశాత్తు వారు వచ్చిన జంతువుల వ్యాగెన్ ఇంకా అక్కడే ఉన్నందున ఎలాగో ఆ స్టేషను మాష్టరుని వప్పించి "టూ-పే" పేర బుక్ చేసుకొని ఎలాగో అహ్మదునగరు చేరారు.

అహ్మదునగరు చేరుకున్న తర్వాత, జంతువులను ఏం చేయాలా ? అని సతమతమయ్యారు. చివరకు వాటిని మెహెరాబాదు ఆశ్రమానికి తీసుకువెళ్లకుండా తిన్నగా సరోష్ ఇరానీ గారింటికి తోలుకుపోయి జరిగిన దంతా సరోష్‌కు వివరించారు. బాబా తిరిగి వచ్చేవరకూ ఆ జంతువుల్ని తమ దొడ్లో ఉండనివ్వమని కోరగా సరోష్ అంగీకరించాడు. అలా వాటిని సరోష్‌కు వప్పగించి వెంటనే వారివురు బొంబాయి వెళ్లి బాబాను కలుసుకున్నారు. వాళ్ళు బాబాని కలియగానే, ఆ జంతువులను మహరాజుకు వప్పగించివచ్చారా ? అని ప్రశ్నించారు. శిష్యులిరువురూ జరిగిదంతా పూసగుచ్చినట్లు సవిస్తరంగా చెప్పి, మహారాజు వాటిని తిరస్కరించినందున ఇప్పుడు వాటిని అహ్మదునగరు తోలుకు వచ్చి, సరోష్ ఇరానీకి వప్పగించామని చెప్పగా, బాబా చిరునవ్వు చిందిస్తూ, మంచిపని • చేశారు. మరేం విచారించకండి. ఇప్పుడు మనం క్వెట్టాకు బయలు దేరుదాం పదండి. "అన్నారు. సద్గురువుల చర్యలు ఈ విధంగా మనకు అర్థంకావు, ఎంతో కష్టభూఇష్టంగా ఉంటాయి. వారి చర్యలు మన సహనానికి అగ్ని పరీక్షలవుతాయి.

ఒకసారి బాబా ఉత్తర దేశపర్యటన చేస్తూ భగవాన్ అనే ఊళ్లో దర్శనమిస్తున్నారు. అనంతరం గృహసందర్శనల సమయంలో ఫడాలి ఆనే ప్రేమికుడి ఇంటికి వెళ్లారు. యజమానురాలు కనిపించకపోయేసరికి అతడి భార్యను పిలిచారు. ఆమె సిగ్గుతో బాబా ముందుకు రావటానికి ఇష్టపడలేదు. భర్త ఫడాలీకి కోపం వచ్చి బాబా ఎదుట విధేయురాలు కానందుకు చాచి కొట్టాడు. ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయిన బాబా అతడ్ని మందలిస్తూ

మరెన్నడూ అలా ప్రవర్తించవద్దని కేకలేశారు. హమీర్‌పూర్‌లో స్త్రీలు ముసుగు వేసుకోవటం ఆచారం. బంధువులు, పరాయి పురుషులు ఎవరు వచ్చినా ఎదుట పడరు కానీ ఈ సంఘటన జరిగాక, వారంతట వారే బాబా ముందుకు రావటమే కాక గొప్ప లబ్ధిని పొందారు.



## ధ్యానం

ధ్యానముపై బాబాకు అంతగా ఇష్టము ఉండేది కాదు. ఆధ్యాత్మికంగా పురోగమించుటకు అవసరమైన సరంజామాను ప్రోత్సహించే అవకాశం ఈ ధ్యానమార్గంలో లేనందున బాబా ఆసక్తి చూపలేదు. కొంత మంది పాశ్చాత్య ప్రేమికులకి ఆధ్యాత్మిక మార్గంలో యోగవిధానాలపై నమ్మకం ఉడటంతో వారిని తృప్తిపరచే ప్రయత్నంలో తనదైన అద్వితీయ విధానం ద్వారా మేల్కొలిపారు. ఏదైన పొరపాటు అభిప్రాయాన్ని కలిగివున్నప్పుడు, తనదైన మార్గం ద్వారా బాబా దానినిపైకి తేలేట్లు చేసి, వారికొక గుణపాఠాన్ని నీ గురువు చేప్పేది విశ్వసించు అని నేర్పటమే ఆ విధానం ఇక్కడ ఆధ్యాత్మికత అంటే సమతుల్యత. ఎంటువంటి పరిస్థితినైనా సరే సమతుల్యంగా ఉంచే పరిపూర్ణ సమతుల్యతను ఆధ్యాత్మికత అంటారు. ఇది సాధించాలంటే ధ్యానం అలవాడాలన్న దురభిప్రాయాన్ని తన అనుయాల్లో రూపుమాపేందుకు బాబా చక్కని అనుభవాన్నదించారు.

మైసూరు రాష్ట్రంలో కొంత పొలంకొని అందులో కొందరు శిష్యుల్ని ఈ ప్రపంచంతో ఎలాంటి సంబంధంలేనటువంటి జీవితాన్ని గడుపుతూ ధ్యానం చేయుటకు దాన్ని ఉపయోగిస్తానని ప్రకటించారు. దాని కోసం ఆ స్థలంలో రెండుపాకల్ని కట్టించారు. అవి పైకి చూచేందుకు చాలా అసహ్యంగా ఉన్నాయి. అయినావాటిని ఉచితరీతిలో ప్రారంభోత్సవం జరపాలని నిశ్చయించి బ్రహ్మాండమైన ప్రారంభోత్సవం జరుగుతున్నట్లు ఆహ్వానపత్రికలు అచ్చువేయించి, వివిధ రాజకీయనాయకులకు, పలువురు సంఘసేవకులకు పంపి ఆహ్వానించారు.

ఆ సందర్భంగా ఉపన్యశించేందుకు ప్రధానవక్తగా మైసూరు రాష్ట్ర ముఖ్యమంత్రిని కూడా ఆహ్వానించగా ఆయన వచ్చేందుకు అంగీకారం తెలిపారు. మద్రాసులోని ఒక ప్రముఖ లాయరుకూడా వచ్చేందుకు అంగీకరించాడు. బాబా మండలి అంతా అతిధులకు స్వాగతం చెప్పే ఏర్పాట్లలో హడావిడిగా ఉన్నారు.

ఆహూతులంతా ఆ పొలంలో ఒక పక్కన కూర్చున్నారు. ప్రముఖులు ఉపన్యాసాలు చెపుతున్నారు. ఆ స్థల ప్రాముఖ్యతను గురించి మాట్లాడుతూ, బాబా మార్గదర్శకత్వంలో దీనికెంతో ఆధ్యాత్మిక ఔన్నత్యం సంతరించుకున్నదని అంతా వివరిస్తున్నారు. కార్యక్రమమంతా అద్భుతంగా జరిగింది. కానీ మండలిని ఒక చిన్న విషయం చెడగొట్టింది. బొంబాయిలోని ఒక ప్రముఖుడు వ్యక్తిగతంగా బాబా యందున్న అయిష్టతవల్ల, బాబా కేదో హాని చేయాలని తలపెట్టాడు. సరిగ్గా ఈ ప్రారంభోత్సవం జరిగే సమయానికి ఒక కారునిండా జనాన్ని దింపి, ఆ సమావేశాన్ని అల్లరిపాలు చేయాలనుకున్నాడు. పెద్ద మనుష్యుల సమక్షంలో మెహెర్‌బాబాను చిన్నబుచ్చమని తన మనుషులను ఆదేశించాడు. ఇతడి విషయాన్ని పసి గట్టిన బాబా శిష్యులు, అసలా జనాన్ని పొలం దగ్గరకు రానీయకుండా ఎదుర్కొనేందుకు తమను వాళ్ల దగ్గరకు వెళ్లుట కనుమతించమని బాబాను కోరారు.

అది విన్న బాబా ఫకాలున నవ్వి, అంత శ్రమ మీకవసరం లేదు. మీరెవరూ వెళ్లకండి. అన్నారు. ఈ విషయాన్ని ఎవరూ పట్టించుకోకండా కార్యక్రమాన్ని యధావిధిగా కొనసాగించారు. దరిదాపులకు వాళ్లు చేరుకున్నారన్న విషయం తెలిసిన శిష్యులు కొంచెం కంగారు పడ్డారు. వారికి విషయం తెలుసును గనుక, బాబా బహిరంగంగా అవమానంపాలు కావటం వారికి ఇష్టం లేదు. అయితే హఠాత్తుగా ఊహించిన దానికి భిన్నంగా జరిగింది. ఆజనం వస్తున్న కారు స్టీరింగ్ దారిలో చెడిపోవటంతోగురి తప్పిబోల్తా కొట్టింది. ఎవరికీ దెబ్బలు తగలలేదు. కానీ వాళ్లు మిగతాదూరాన్ని చేరే వాహనం దొరకనందున ఆ అవకాశాన్ని కోల్పోయారు. అప్పుడు బాబా తన శిష్యులవైపు చూస్తూ, జరిగిన సంకేతానికి సూచనగా, ఎప్పుడైనాసరే అంతా తనకు వదిలేస్తే, ఆపని సక్రమంగా జరిగిపోతుందని సౌంజ్ఞలు చేశారు.

ఇక్కడ తలపెట్టిన ధ్యానం కార్యక్రమం సంగతి ఎలా ఉన్నా, బాబా ఒకసారి తన శిష్యులతో ఏడు దైవనామాల్ని రోజూ ఒక గంటసేపు ధ్యానం చేయమని ఆదేశించారు. ఏడుగురు శిష్యులు, ఒక్కొక్కరు ఒక్కొక్కనామాన్ని

ఏడుసార్లు బిగ్గరగాను, తక్కినవారు మనస్సులోను హృదయపూర్వకంగా ఉచ్ఛరించమన్నారు. డా॥ నీలూ, ఓం పరబ్రహ్మ పరమాత్మ, పాద్రి యాయ జడాన్ బైదిల్ ఇలాహ్, ఇల్లిల్లాహీ, ఎరుచ్-ఓగాడ్ ఫాదర్ ఇన్ హెవెన్, మరో ముగ్గురు పూర్వపుగారి అహూరమజడా,ఈజాద్. అనే నామాల్ని మననం చేస్తూ పాడేవాళ్లు. వీరి మనస్సును ఆ ఏడునామాలపైన, వాటి భావాలపైన లగ్నం చేయమని ఆదేశించారు. దీనివల్ల వారికి అలసటతోపాటు, నెత్తిమిద ఏదో తెలియని బరువు పెట్టినట్లైంది. రోజూ ఉదయం 5-30 లకు పంటింట్లో నేలమీద కూర్చొని వారు దైవనామాల్ని చేస్తుంటే కొన్నాళ్లు అలా చేసే సరికి నిద్రమత్తు ముంచుకురాసాగింది వారుపడే బాధకంటే ఎక్కువగా లయబద్ధంగా పాడుతుంటే హార్మోనియం వాయించే మణికి మరింత భాద ఎక్కువైంది. ఈ క్రమశిక్షణ ఒక నెలరోజులుపాటు సాగింది. మధ్యాహ్నామయ్యేసరికి బాబా గంట మ్రోగించేవారు. గంట మ్రోగగానే శిష్యులు హాల్లోకి వెళ్లి నేలపైన వలయాకారంలో కూర్చొనేవారు. పైకి, వినపడకుండా నోట్లోనే పై ఏడు అవతారుల నామాల్ని స్మరిస్తూ శ్వాసపీల్చేవారు.

అవతారుని చేష్టలు దురూహ్యములు. ఆయన చేసే కార్యక్రమం, మానవ మేధస్సుకు అందదు. సాధారణమైన యోగ సాదనలు మంచి సంస్కారాల్ని కలిగిస్తాయి. కాని ముక్తిని ఇవ్వలేవు. మోక్షార్థి ఈ మంచి చెడులతో కూడిన సంస్కారాల్ని తన ఖాతా నుంచి పూర్తిగా తుడిచి వేసి, స్ఫటికంలా నిర్మలంగా తయారవ్వాలి. అలాంటి నిర్మలమైన ఫలకాన్ని కలిగి ఉండాలంటే, సద్గురు కృప మాత్రమే తప్ప మరే ఇతర సాధన సహాయ పడదు. మానవుడు మోసే అనంత సంస్కారాలను ఒక పెద్ద పెంట కుప్పగా పోల్చవచ్చును. కానీ ఒక సద్గురువు ఇంత పెద్ద పెంట కుప్పను క్షణకాలంలో నాశనం చేయగలడు. ఆ సద్గురువే బాబా అయినందున, ఆయన్ని ప్రేమించేవారు మోక్షార్థులయ్యేందుకు ఎటువంటి యోగ సాధనలతో పనిలేదన్న సత్యాన్ని మనం తెలుసుకొనుటకే ఇటువంటి అనుభవాల్ని కల్పించారు. నిజమైన యోగమంటే నీవు పోవుట అని, ఈ “నీవు” అనే అహం పోయేందుకు ఏకైక సాధన ప్రేమ మాత్రమేనని బాబా చెప్పారు.

బాబా ఎంత దయాళుడంటే, ఆయన తన పేరునే ధ్యానించమన లేదు. ఏ పేరుపెట్టి పిలిచినా పలుకుతానన్నారు. సర్వకాల సర్వావస్థల యందు తమ ఇష్ట దైవాన్ని స్మరనలో ఉంచుకోమన్నారు. వ్యథ చెంద వద్దన్నారు. సంతోషంగా ఉండమన్నారు. కోరికలతో తన వద్దకు రావద్దన్నారు. మన మాయన్ని హృదయపూర్వకంగా మనసా వాచా, కర్మణా కొలిస్తే మన అవసరాలను తానే

చూచుకుంటానని అభయమిచ్చారు. చివరి వరకూ బాబా కొంగును విడువకుండా ఉండాలంటే ఆయన నామాన్ని విడువకుండా స్మరించడ మొక్కటే శరణ్యం కానీ ఏ యోగ సాధన తోడ్పడదు.

"యోగము" అంటే అసలు అర్థం ఐక్యత. భగవంతునిలో ఐక్యం కావటం యోగం. దేవునిలో సమైక్యమయ్యేందుకు తీవ్రమైన తపనను పడిపడి చివరకు, ఆత్మ సాక్షాత్కార ప్రాప్తి పొందటమే ఈ యోగము. దైవీ ప్రేమికుడు దైవంలో ఐక్యమవ్వటమే యోగమన్న మాట. ఇటువంటి ఐక్యతను పొందేందుకు ఎన్నో మార్గాలున్నాయి. అనేక యోగాలున్నాయి. అయితే మెహెర్ బాబా ఎక్కువగా ప్రేమతో భగవంతుడ్ని సేవించే భక్తి యోగానికే అధిక ప్రాధాన్యత నిచ్చారు.

"ధ్యానము" అనే సరికి, ఏదో ఒక ఆలోచనపైన, లేదా విషయంపైన, మనస్సును యాంత్రికంగా నిలుపుటగా అభిప్రాయము కలుగుతుంది. యాంత్రికంగా మనస్సును ఇలా నిబ్బరంగా ఉంచటం కష్టమే అవుతుంది. ఇక్కడ ప్రధాన పాత్ర మనస్సుది. అది తన కిష్టమైన విషయంపై పరిభవిల్లుతుంది. అందులో దానికెంత ఇష్టము ఉంటే అంతగా అర్థం చేసుకుంటుంది. కనుక మనస్సుకు అలవాటైన భౌతిక విషయాలపై మనస్సును నిలుపుకొనే ప్రయత్నం చేయుట కాక, ఆధ్యాత్మిక సత్యంపై మనస్సుకు ఉత్సాహం కలిగేట్లు చేయటమే నిజమైన ధ్యానమని బాబా ఎరుక పరచారు. యాంత్రిక ధ్యానము ఏక స్వరకాఠిన్యాన్ని పెంచుతుంది. ప్రతిభ గల ధ్యానం మనస్సును క్రమబద్ధం చేసి ఉత్కృష్టమైన అంతర్ జ్ఞానాన్ని స్వతఃసిద్ధంగా మనస్సంతా నింపుతుంది.

# సర్వరక్షకుడు

మెహెర్ బాబా తన ప్రేమికుల ప్రేమకు బానిస నన్నారు. పరిశుద్ధమైన మనస్సుతో నూటికి నూరుపాళ్లు నిజాయితీతో బాబాను ధ్యానిస్తే, ప్రేమిస్తే, ఆయన అద్భుతాలు చేయకపోయినా హృదయ పూర్వకంగా ఎవరు ఏది ఇకోరుకున్నా అది ఇస్తారు. కష్టాల్లో ఆదుకొనే రక్షకుడాయన. ఆ కోరిక హృదయ లోతుల నుండి రావాలి. "నా ప్రేమను కోరేవాడు నాకు అత్యంత ఇష్టుడు" అని బాబా చేప్పేవారు. ఒక రకంగా వారి సహన శక్తికి అగ్నిపరీక్ష ఎదురైనా, ఆపదలో ఆదుకొనే జగద్రక్షకుడు మెహెర్ బాబా.

ఇప్పుడు మెహెరాబాదులో "డి" హాస్టలు అజమాయిషీ చూస్తున్న కృష్ణ నాయరును ఎరుగని వారుండరు. ఆయన బాబాకు ఒకప్పుడు కావలి వానిగా

ఉండేవాడు. 1956లో రెండవ సారి కారు ప్రమాదం జరిగాక బాబా సతారా నుండి మెహెరాబాదుకు తిరిగివచ్చారు. సతారాలో ఉండగానే కృష్ణను వాళ్లింటికి పంపేశారు. కృష్ణ సతారా నుండి బొంబాయి వెళ్లాడని తెలుసుగాని, మండలి ఎవరికీ అతని అడ్రస్సు తెలియదు. ఒక రోజున బాబా హఠాత్తుగా భావూకల్చూరిని పిలిచి, కృష్ణా అడ్రసేమిటి అని ప్రశ్నించగా తెలియదనటంతో "విచారించకు. నేను నీతో ఉన్నాను. నేనెన్నడూ నిన్ను వదలను. బాబాను ప్రేమించు - మెహెర్ బాబా" అని ఒక టెలిగ్రాం చెప్పి కృష్ణ కేర్ ప్రశిడెంటు బాబా సెంటరు బొంబాయి పేర తక్షణం పంపించమన్నారు. రోజూ టపా తీసుకెళ్లే కుర్రాడికిచ్చి పంపిద్దామని బయటకు వెళ్లేసరికి అంతకు ముందే ఆ కుర్రాడు నగరు వెళ్లిపోయేసరికి, అదే సంగతిని బాబాకు భావూ చెప్పాడు. "నేనేం చేయమంటే అది చేయాలి. కుర్రాడు వెళ్లిపోతే మరో కుర్రాడితో పంపాల్సింది నీవు ఎందుకూ పనికి రాని మూర్ఖుడవు" అంటూ మండిపడుతూ బాబా ఆ టెలిగ్రాం కాగితాన్ని తీసుకొని ముక్కలుగా చించివేసి, మరో టెలిగ్రాంను వ్రాయమని చెప్పారు. "నీవు నాకు అత్యంత ప్రీతి పాత్రుడవు. ధైర్యంగా ఉండు. అంతా మంచి జరుగుతుంది" అని వ్రాసి వెంటనే పంపమన్నారు. మరో కుర్రాడికి ఇచ్చి పంపుదామని బయటకు వెళ్లేసరికి అతడూ అంతకుముందే ఏదోపని మీద నగరు వెళ్లినట్లు తెలిసింది. మళ్లీ బాబా వద్దకు వెళ్లి జరిగింది చెప్పేసరికి, నీవు ఆలోబాకు ఇచ్చి పంపిచాల్సిందని కేకలు వేశారు.

"ఎంతో ముఖ్యమైన విషయాన్ని వప్పగిస్తే నీవు ఆచరించలేక పోయావు. నీవు నా కార్యక్రమ ప్రాముఖ్యతను అవగాహన చేసుకోలేక పోతున్నావు ?" అంటూ 2 గంటలపాటు తిడుతూనే ఉన్నారు. అలా మందలించుట అయిం తర్వాత పక్కపై దొల్లుతూ బాబా ఎంతో ఆవేదన పడ్డారు. ఎంత ప్రయత్నించినా ఆపుకోలేకపోయారు. చివరకు సాయంత్రం 7-00లకు లేచికూర్చొని, తియ్యటి రోజ్‌వాటరు త్రాగేందుకు తెమ్మని కొద్దిగా త్రాగి కుదుట పడ్డారు. ఆయన అలా ఎందుకయ్యారో ఎవరికీ బోధపడలేదు. భావూ మాత్రం ఆ టెలిగ్రాం ఇవ్వమని చెప్పిన సమయం, ఆ తారీకు వగైరా అన్నీ తన డైరీలో వ్రాసిపెట్టుకున్నాడు. కొద్ది వారాల తర్వాత పూనాలో సెయింట్ మీరా హైస్కూలు ఆవరణలో బాబా దర్శన ఏర్పాటు జరిగింది. బొంబాయి నుండి కృష్ణ కూడా వచ్చాడు. మాటల సందర్భంలో అతడేం చేస్తున్నాడని అడుగగా ఏదో ఉద్యోగం దొరికిందని, ఒక నెల నుండి ఉద్యోగం చేసుకుంటున్నానని చెప్పాడే కాని, దానికి ముందేం జరిగిందో చెప్పలేదు. అతను చేస్తున్న పని గురించి చెప్పేందుకు

వెనుకాడుతున్నాడని పించింది. భావూ వదలక వత్తిడి చేసే సరికి, కృష్ణా తన కధనిలా చెప్పాడు :-

బొంబాయిలో నెలల పర్యంతం ఉద్యోగం కోసం ఎంతో ప్రయత్నించాను. నా వద్ద పైకం లేదు. ఉద్యోగం లేదు. ఆ రోజుల్లో తినేందుకు తిండిలేదు. ఏదన్నా ఉద్యోగం వస్తుందన్న ఆశలేదు. కొద్ది వారాలముందు, నిరాశతో చచ్చిపోవాలనుకున్నాను. ఆత్మహత్య చేసుకోవాలను కున్నాను. బొంబాయి నుండి దగ్గరలో నున్న ఒక కొండ దగ్గరకు వెళ్లాను. ఆ కొండ కొసకంటా పైకి ఎక్కాను. అక్కడ నుండి క్రిందికి దూకాలను కుంటుండగా బాబా నాకు ఎదురుగా కనిపించారు. ఆయన్ని చూడగానే నాకు మరింకే ఆలోచనా రాలేదు. తిన్నగా కొండ దిగి మళ్లీ బొంబాయి చేరాను. కొద్ది రోజుల్లోనే ఉద్యోగం దొరికింది. అప్పటి నుండి పని చేస్తున్నాను. ఇప్పుడంతా బాగానే ఉంది" అంటూ జరిగిందంతా చెపుతుంటే భావూకు తన డైరీలో బాబా పంపమన్న టెలిగ్రాంల తేదీ సమయము జ్ఞాపకానికి వచ్చాయి. ఆ టెలిగ్రాం వ్రాయించిన 3-00ల సమయంలో కృష్ణా బొంబాయి నుండి బయలుదేరాడు. టెలిగ్రాం పంపలేక పోయినందున ఆయన మనోభావాలు మారుతున్న సమయంలో ఆయన కృష్ణా దగ్గరకు చేరి కొండపై అతనికి కనిపించారు. అక్కడ నుంచే అతను ఇంటికి తిరిగివెళ్లాడు. ఇటువంటి అనూహ్యామైన విధానాల్లో బాబా తన ప్రేమికులను రక్షిస్తూ ప్రాణాల్ని ఎలా కాపాడతారో అర్థం చేసుకుంటే "నేనేమీ మహత్తులు చేయనం"టూనే మెహెర్ బాబా సర్వరక్షకుడిగా ఆదుకోవటం విదిత మవుతుంది.

దక్షిణ అమెరికాలోని అర్జంటైనాలో ఒక క్రీస్తు భక్తురాలుండేది. అడ్వర్డో అనే మెహెర్ ప్రేమికుడి హోటలుకు రోజూ ఉపాహారం తినేందుకు వచ్చేది. ఆయన మెహెర్ బాబా ప్రేమికుడైనందున తన హోటలు ప్రవేశ ద్వారంలో నిలువెత్తు బాబా ఫొటోను అమర్చాడు. కష్టమర్లకు స్వాగతం, వీడ్కోలు చెబుతున్నట్లా చిత్రం అందరినీ ఆకర్షించేది. ఈ క్రీస్తు భక్తురాలికి ఒక కొడుకు ఉన్నాడు. వాడు వట్టి తాగుబోతు. ఇంటిపట్టున ఉండక తల్లి దండ్రులకు భారమై, రోజు రోజుకు చెడిపోతున్నాడు. వాడిని సన్మార్గంలో పెట్టేందుకు ఎంతగా ప్రయత్నించినా మారలేదు. దానితో విసిగిపోయిన అతడి తల్లి, తాను రోజూ వచ్చే హోటల్లో దర్శనమిచ్చే ఫొటోలోని మెహెర్ బాబాను ఒక మహనీయునిగా తలిచి, ఆ మూర్తి ఎవరో తెలియకపోయినా, తన కొడుకును గురించి ఆయనతో మొరపెట్టుకున్నది.

దయతో అనుగ్రహించి తన కొడుకును సక్రమ మార్గంలో పెట్టమని అభ్యర్థించింది. ఆశ్చర్యంగా ఆమె కుమారుడు ఒక వారంలోపే పూర్తిగామారిపోయాడు. దుర్వ్యసనాలన్నీ వదిలేశాడు మరెన్నటికీ తాగనని తల్లికి ఒట్టువేసి చెప్పాడు. మామూలుమనిషిగా మారిపోయి, అందరి మన్ననలూ పొందసాగాడు. కొడుకులోని ఈ హఠాత్పరిణామానికి, ఎడ్వర్డ్ హోటల్లోని ఫోటోలో ఉన్న మహనీయుడే కారణమని గ్రహించిన ఆ తల్లి వేంటనే ఆ హోటలుకు వెళ్లి, ఆ ఫోటోముందునిలబడి, తనయందు చూపిన అవ్యాజానురాగప్రేమకు కృతజ్ఞతలు తెలుపుకుంటూ కన్నీళ్లు కార్చింది. హృదయార్తితో పిలిస్తే తన అక్కున చేర్చుకుంటానన్న మెహెర్ బాబా, ఆమె హృదయావేదనకు ప్రతిస్పందించి, ఆమె కొడుకును సన్మార్గంలో పెట్టటమేకాక ఆ కుటుంబమంతటినీ తన ప్రేమలో ముంచేశారు. ఎడ్వర్డ్ ద్వారా ఆయన అవతార్ మెహెర్ బాబాగా తెలుసుకొని మెహెరాబాదు వచ్చి బాబా దర్శనం చేసుకొన్నది. ఆమె కుటుంబమంతా బాబా ప్రేమికులయ్యారు.

మెహెర్ బాబా హాస్య సంభాషణా చతురుడు. ఆయన హాస్యప్రియుడై నందున, ఉద్రేక సందర్భాల్లో సైతం పరిస్థితిని హాస్యంగా మలచటం ఆయన సొత్తు. హాస్యం, వ్యంగ్యం, చురకలు చెణుకులు, ఒకటేమిటి, ఇలాహాస్యానికి చెందిన అన్ని స్థాయిల్ని బాబా స్పృశించి, నవ్వుల హరివిల్లును సృష్టించే వారు. హావ భావాల్లో ముఖ కవళికల్లో, తనదైన శైలిలో ఒక ప్రత్యేక తనురంగరించి, తన శిష్యుల కవసరమైన శిక్షణనిచ్చేవారు. ఆటలన్నిటిలో మేటి అయిన బాబా తన నొక జోకరుగా పొల్చుకుంటూనే ఆ జోకరు యొక్క విలువను, ప్రాముఖ్యతను గ్రహించేందుకు, కష్టతరము, అనితర సాధ్యమైన హాస్యంతో నవ్వులాటకు జీవం పోశారు.

1957లో మెహెర్ బాబా తన మండలితో పూనా గురుప్రసాద్ గణేష్ ఖండ్‌గార్డెన్సులో విడిదిచేసి ఉన్నారు. రాత్రి కాపలాలో భావూ కల్చూరి కావలి కాస్తున్నాడు. ఒక రోజున భావూతో "నేనీ వేళ బాగా అలసిపోయి ఉన్నాను. నాకు పూర్తి విశ్రాంతి కావాలి. కనుక చాలా జాగ్రత్తగా కావలి కాయుము. ఏ మాత్రం శబ్దం చేయవద్దు. కనీసం నీవు అటూ ఇటూ కదలటం కూడా చేయవద్దు సుమా !" అంటూ ఒకటికి రెండుసార్లు హెచ్చరించారు. బాబా గురకకొడుతూ పడుకున్నారు. భావూ చాలా మెళకువగా కాపలా కాస్తున్నాడు. కొంతసేపు అంతా బాగానే గడిచింది. కానీ అంతలోనే పాపం భావూ గొంతులో గురగుర మొదలైంది. దగ్గుతెర తోసుకొచ్చింది. దీన్ని ఆపు చేసేందుకు రెండు చేతుల్ని అడ్డుపెట్టుకొని

నోటిని గట్టిగా మూసుకున్నాడు. దగ్గును అణుచుకొనుటకు ఎంతగా ప్రయత్నిస్తే అంతగా ఆ దగ్గు తోసుకువచ్చింది. వెంటనే జేబులోంచి రుమాలు తీసి నోట్లో కుక్కుకున్నాడు. ఏం చేసినా దగ్గు ఆగక, గొంతులోంచి "ఊం...." అంటూ శబ్దం తోసుకొచ్చేసింది.

ఆ శబ్దానికి బాబా కళ్లుతెరచి, చిరాకు పడ్డారు. "నీవు నాకు సేవ చేయటానికి వచ్చావా ? లేక నన్నేడిపించుటకు వచ్చావా ?" అంటూ విసుక్కున్నారు. "నీకు ముందుగానే నాకీ రాత్రి ఎటువంటి ఇబ్బంది కలిగించవద్దని ఎన్నోసార్లు హెచ్చరించాను. అయినా ఇప్పుడు నీ వల్ల నాకు మెలకువ వచ్చేసింది. మరిప్పుడీ రాత్రంతా నాకు నిద్రపట్టదు" అని మందలిస్తూ వెళ్లి స్త్రీ మండలి వారిని పిలుచుకు రమ్మన్నారు. స్త్రీలు రాగానే బావూను బయటకు వెళ్లి కూర్చోమన్నారు. ఆడవాళ్లతో మాట్లాడుతూ, "భావూతో నేను బాగా అలసిపోయాను. నాకు విశ్రాంతి కావాలని ఎంతగా చెప్పినా అతడు శబ్దం చేసి నిద్రాభంగం కలిగించాడు. ఇతడు నాకు సేవ చేయడు. నేను మరణించాకే చేస్తాడు. మరి అతడ్ని నాతో ఉండమని నేను ఎందుకు పిలవాలి ? ఇప్పుడీ రాత్రంతా నాకు నిద్రపట్టదు. అసలే నేనీ రోజు అలసిపోయి ఉన్నాను. నాకు చాలా నీరసంగా ఉంది. డా॥ గోహెర్ ! నా నాడి పరీక్షించు!" అంటూ చేయి చూపగా డా॥ గోహెర్ పరీక్షించింది. ఆమె ఏదో చెప్పబోతుంటే, "ఇదంతా భావూ వల్లే జరిగిందం"టున్న బాబాతో మణీ అందుకుని "బాబా, అతను కావాలని అలా చేయలేదనుకుంటాను" అన్నది "అవునవును. అతను కావాలని చేయలేదు. అది నాకు తెలుసు. అయినా అతను నాకు నిద్రా భంగం కలిగించాడు. మరి దీనిసంగతేమిటంటావు ?" అని బాబా అడుగుతుంటే గుమ్మం బయట కూర్చుని అంతా వింటున్న భావూ, బయటే ఉండి, "అయితే బాబా ! నీవు నిద్రపోకూడదనే, నేను అలా చేశానంటావా ?" అనడిగాడు. "కాకపోతే నీవా శబ్దాన్ని ఎందుకు కలిగించావు ?" అని బాబా ప్రశ్నించారు.

"బాబా ఈ ప్రశ్నను నీవు మొదట్లో నన్ను అడుగలేదు. నేను వివరించే అవకాశం నాకివ్వలేదు" అన్నాడు. "అయితే ఇప్పుడు అడుగుతున్నానుగా నీ వెందుకు అలా శబ్దం చేశావు ? ఇప్పుడు చెప్పు" అన్నారు. "ఏమని చెప్పను బాబా! నాకు వచ్చిన దగ్గును ఆపుకోలేక చావటానికి సిద్ధమయ్యాను !" అన్నాడు భావూ "అయితే సరే చచ్చిపో ! ఏం జరుగుతుంది ?" అంటూ బాబా పశివానిలా ప్రశ్నించారు. పాపం, భావూ తన దగ్గును ఆపుకొనుటకు ఎంతగా ప్రయత్నించాడో అంతా బాబాకు విన్నవించుకున్నాడు. అప్పుడు బాబా ముఖం నుంచి ఒక

పశివాని అమాయకత్వం వ్యక్తమైంది. ఎంతో జాలిగా ఏమీ ఎరుగనట్లు "అలాగా ! నిజమా ! ఇదే మీ నాకు అసలు తెలియనే తెలియదు. రా! రా!" అంటూ లోనికి పిలిచి, ఆలింగినం చేసుకున్నారు. చెక్కిళ్ళపై ముద్దు పెట్టుకున్నారు. అప్పుడు బాబా అసలు విషయాన్ని బయట పెట్టారు. "భావూ ! నేను నిన్ను అమితంగా ప్రేమిస్తున్నాను. అందుకే నేను నిన్నింతగా పీడించాను. నిన్నిలా ఏడిపించటం, నేను నీకిచ్చే మహా ప్రసాదం" అన్నారు.

## నవజీవం



బాబా జీవితమంతా వివిధ దశల్లో, నిర్ణీత కార్యప్రణాళిక ననుసరించి గడిపారు. అశ్రమాల స్థాపన, పేదల కార్యక్రమం అస్పృశ్య నివారణ, ప్రపంచ పర్యాటనలు, దర్శనాలు, మనస్త కార్యక్రమాలు, కుష్టురోగుల సేవాకార్యక్రమాలు, మధ్య తరగతి కుటుంబాలు బీదరికంలో మగ్గుతున్నవారికి సహాయాలందించుట, ప్రకృతి పర ఆపదల్లో చిక్కుకున్నవారికి, ఇతరులను దేహి అని చేయిచాచి యాచించుటకు సిగ్గుపడే గర్విష్టులను ఆదుకొని స్వయంగా సహాయపడుట వంటివెన్నో, అద్భుతఘట్టాలు బాబా జీవితంలో సంభవించాయి. వీటన్నిటికంటే అత్యంత ముఖ్యమైన ఘట్టం, పరివ్రాజిక జీవితం గడుపుతూ నిరాశామయ నిస్సహాయ జీవితం గడపటం. దీన్ని బాబా నవజీవనం అన్నారు. ఇటువంటి ఎన్నో కార్యక్రమాలతో కూడిన విశాలమైన బాబాపరిధి చివరివరకూ నిరంతర శిక్షణా క్షేత్రమై తన శిష్యులైన ఎందరో స్త్రీ పురుష అనుచరులకు, దైవాన్ని ప్రేమించే జీవితాన్ని సాధన చేసేందుకు ఉపయోగపడింది. నిస్వార్థసేవ, పరిపూర్ణవిధేయత నీతివంతమైన ప్రేమ, సహనము, అలవడేట్లు దోహదపడింది.

బాబా జీవితంలో అత్యంత ముఖ్యమైన, ప్రధాన ఘట్టం నవజీవనం. ఇది 16అక్టోబరు 1949న ప్రారంభమైంది. పాతపద్ధతుల్ని వదిలేసి, బాబా మాటలకు విధేయులై, పరివాజుకుల వలె భిక్షాటన చేస్తూ ఎవరినీ అర్థించకుండా రేపటి గురించిన చింతను వదిలేసి, రామావతారంలోని రాముని వనవాసజీవితాన్ని మరిపిస్తూ బాబాతో గడినపినజీవితమది, ఈ నవజీవనాన్ని మెహర్ బాబా

స్వయంగా నిర్దేశించిందే అయినా తానుమాత్రం దానికి కట్టుబడి ఉండవలసిన అవసరంలేదని, దీనికి అంతం లేదని, శాశ్వతంగా కొనసాగుతుందని, దీనిని కాపాడేవారు కఠోరనియమాలకు బద్ధులై యుండాలని, ఏ వాంఛలు, ఏ ఆశలు, ఏకోరికలు, మమతలు, ద్వేషాలులేకుండా జాతి, కుల, మత, భేదాలు లేకుండా, ఎన్ని కష్టాలైనా ఎదుర్కొని సంతోషంతో గడపగల వారుమాత్రమే దానికి అర్హులని బాబా ప్రకటించారు బాబా నూటికి నూరుపాళ్ళుపట్టుదలతో ఈనవజీవనాన్ని గడపదలచారు. ఇప్పటివరకు శిష్యులంతా ఎంతో విశ్వాసంతో ఆయనను అంటిపెట్టు కొని ఉన్నారు. ఎటువంటి స్వలాభాన్ని ఆపేక్షించకుండా బాబాకు సర్వార్పణయ్యారు. అన్వేషకునికి ఆధ్యాత్మిక క్రమ శిక్షణ అలవడితేనే యధార్థ సత్యాన్ని పొందటంలో, అహంనశించేట్లు సహాయ పడుతుంది. తన శిష్యులకు భోగమయ వాతావరణం కల్పించి వాటిమధ్య జీవిస్తూనే నిస్సహాయ జీవన మలవడేట్లు ఎంతో తర్ఫీదు ఇచ్చారు. అయినా బాబా ఆశించి న గీతాజీవనం అలవడలేదు. అందుకే కఠోర మైననియమాలతో అనూహ్యామైన ఆజ్ఞలను విధేయతతో పాటించ కలిగేట్లు తయారు చేయాలని బాబా సంకల్పించారు.

అలాంటి ఆధ్యాత్మిక క్రమశిక్షణ అలవడినవారు అత్యున్నత స్థానంలో ఉన్నట్లు పరిగణించ బడతారు. విడవకుండా దైవాన్ని గుర్తుంచుకోవటం, ఏదీ విడువకుండా దైవాన్ని స్మరిస్తూ దైవంలో లీనమయ్యే క్రియని సహజధ్యానం అంటారు. అలా చేయటంవల్ల చివరకు తమజీవిత గమ్యమైన సహజ సమాధి స్థితికి చేరకలుగుతారు. సంపూర్ణ బాహ్య పరిత్యాగం అలవడితేనేగాని ఇది అబ్బదు. సర్వమూ త్యజించి, భగవంతునికి సర్వార్పణ గావించుకొని ఆయన సహాయముపై ఆధారపడ కలగాలి అందుకు తొలుతగా విధేయత తప్పని సరి. అయితే అవతారునికి అర్పణ అయిన వారి విషయంలో ఎదురు చెప్పటం అనే అవకాశం ఉండదు. తిరుగులేని విధేయత అనుక్షణం అత్యంతావశ్యకము. అవతారుని పదసేవలో ఆయన ప్రేమలో ప్రతి వారు ఆపాదకమస్తక శూన్యులై సంచరించాలి. ఆయన చెప్పినట్లు చేయమన్నప్పుడు వినులకది సులభంగా అనిపించవచ్చును. కానీ ఆచరణలో చాలా కష్టం. ముఖ్యం గా ఆయనతో గల ఆధ్యాత్మిక సంబంధంరీత్యా మరీ కష్టం.

బాబా నవజీవనంలో అనుసరించిన వారంతా ప్రమాణం చేసి ప్రతిజ్ఞ చేసిన షరతేమంటే ఎవరూ కోపం తెచ్చుకోరాదు అని. ఒక రోజున బాబాయే స్వయంగా తన అదుపును కోల్పోయి, చేసిన ప్రతి జ్ఞ జవదాటి కోపం తెచ్చుకున్నారు మరి అలా తమ ప్రతిజ్ఞను పాటించనందుకు శిక్షగా తనతోఉన్న మిత్రులందరినీ

వరుసగా ఒక్కొక్కరే వచ్చి బలం కొద్దీ తనను లాగి తన్నమన్నారు. నవజీవనంలో అన్నిటికంటే అత్యంత ప్రధానమైన షరతేమంటే బాబా ఆజ్ఞలు ప్రతివారు తప్పక విధేయత తో పాటించితీరటం జరగాలి. ఒకవిధంగా బాబా నవజీవనంలో తాను ఎంతమాత్రం, అవతారునిగా గానీ, కనీసం ఒక సద్గురువుగా గాని కనపడక, కేవలం ఒక మిత్రునిగా, ఒక పెద్దన్నయ్యగా మాత్రమే ఉన్నారు. అన్ని విధాల బాబామిత్రుడే అయినప్పటికీ, అందరివలెనే పని చేస్తున్నప్పటికీ, తోటి మిత్రులంతా ఆయన ఆజ్ఞలకు బద్ధులై అన్ని విషయాల్లోనూ ఆయనకు విధేయులుగా ఉండితీరాలి. ఏమాత్రం బెరుకు జంకు లేకుండా ఉండాలి. స్వయం నిర్ణం, స్వంతాలోచనలకు చోటుండకూడదు. గురువాజ్ఞగా పాటించాలి.

అందుకే బాబా తను చేసిన తప్పుకు తనను తన్న మన్నప్పుడు, శిష్యులంతా విధేయత పాటించారు. డా॥ ఘనీ వంతువచ్చే సరికి, బాబాను చాలా తీవ్రంగా ఎదుర్కొని బలమైన తన్ను తన్నేవిధంగా సిద్ధపడ్డాడు. కాని చివరకు తేలిగ్గా కాలు ఆనించి తీసివేశాడు. అప్పుడు బాబా అంత బలంగా తన్నబోయి, తేలిగ్గా కాలానించి తీసివేశావేమని ఆశ్చర్యంగా అడిగారు. తానంతవరకూ నవజీవంలో పడ్డకష్టాలవల్ల తనలో అణిగి ఉన్న కోపాన్ని ఈ అవకాశంద్వారా తీర్చుకోవాలనుకున్నాడు కానీ తీరాతన్నాలని బలంగా ఎత్తిన కాలు బాబాదగ్గరకు వచ్చేసరికి ఆయనలో తన చిన్ననాటి మిత్రుడు కనపడేసరికి, అలా తన్నలేక కేవలం బాబా ఆదేశాన్ని పాటించాలి కనుక, నెమ్మదిగా ముట్టించానని చెప్పాడు. మొత్తంమీద బాబా గడిపిన నవజీవనంలో ఏదో మహత్తరమైన ఆధ్యాత్మిక రహశ్యం గోచరిస్తుంది.మార్గమధ్యంలో చేసిన భిక్షాటన లో సైతం, మానవనైజం గురించిన అంతర్ దృష్టి వ్యక్తమయ్యేది. గ్రామీణులు, తాము దుర్భర దారిద్ర్యంతో సతమతమవుతున్నప్పటికీ, పిడికెడు బిచ్చం పెట్టేందుకు తిరస్కరించక, ఉన్నదాంట్లోనే లేదనకుండా బిచ్చమిడటం వెనుక, దినభత్యానికి చేతిలో పైసాలేకపోయినా, ఆయనపై భారం వేస్తే ఎలా సహాయపడతారో రుచిచూపారు.

మెహెర్ బాబా నవజీవనం గురించి తెలుసుకోవాలంటే అది అత్యంత రహస్యమైన ఘట్టం. ఈ అత్యంత రహస్యాన్ని అవగాహన ఛేసుకోవటం, ఆయన సన్నిహిత సహచరులకే సాధ్యం కాలేదు. మరి మనబోటి వారి సంగతి సరేసరి. ఆధ్యాత్మికంగా అతి నిగూఢమైన మర్మం ఇందులో ఉన్నది. మెహెర్ బాబా ఈ నవజీవనం గురించి 1949 సంవత్సరం ఆరంభంలోనే పరోక్షంగా అనేక సూచనలను అందించారు. 1949 జనవరి 1న జారీ చేసిన సర్క్యులర్‌లో "ఈ 1949వ సంవత్సరంలో కృత్రిమ ఆరంభానికి ఒక కృత్రిమ అంతం జరుగుతుంది. అలాగే

నిజమైన అంతానికి వాస్తవమైన ప్రారంభం జరుగుతుంది. ఈ సంవత్సరమంతా అందరికీ కష్టాలు, అగ్ని పరీక్షలు ఎదురైతే నాకు మాత్రం, వ్యక్తిగత విపత్తు సంభవిస్తుంది'' అని తన ప్రేమికులను హెచ్చరించారు.

నాతో ఎవరు ఉన్నా, ఎవరు వెళ్ళిపోయినా, నేను లెక్కచేయను 1949లో రేపు గురించి చింతించాల్సి ఉన్నది. కనుక ఇప్పటి నుండే 50 శాతం ఖర్చు పొదుపు చేయాలి 90% నామండలి నన్ను వదిలివెళతారు. 1949లో నాదంటూ ఏది మిగలదు. అందరినీ నేను క్షమించాను నన్ను భగవంతుడు క్షమించాడు కానీ ఇక మీదట, క్షమాపణలకు అవకాశం ఉండదు. మీరంతా నాతో చాలా కాలంగా ఉన్నారు. అందువల్ల మీలోని బలహీనతలకు నేనే బాధ్యుడిని అయితే మీ బలహీనతలను నేను అవకాశంగా తీసుకోదలచలేదు. కనుక మీరు వాటికి లోబడవద్దని, 1949లో తుడిచివేయమని హెచ్చరిస్తున్నాను''. అంటూ ముందు హెచ్చరికలుగా ఎన్నెన్నో సూచనల నందించారు.

అయితే అప్పట్లో ఈ సూచనల అంతరార్థాన్ని ఎవరూ గ్రహించలేదు. పైప్రకటనల బట్టి అనూహ్యమైన మార్పేదో ఆయన కార్యక్రమంలో జరుగబోతోందని మాత్రం, తన మండలి తెలుసుకోగలిగారు. ఐశ్వర్యంతో భోగభాగ్యాలతో తులతూగుటకు అలవాటు పడిన మానవాళిని భౌతిక సంపదలకు అతీతులను చేసి, బాహ్యవిషయాలపై దృష్టిని కేంద్రీకరించకుండా, నిరంతర ప్రభునామస్మరణతో గడపగలిగేందుకు తన శిష్యులకిచ్చే తర్ఫీదు యావత్ప్రపంచానికే ఒక మేలు కొలువు కావాలని బాబా సంకల్పించిన ఈ నవజీవన ఘట్టాన్ని చేపట్టినట్లు అవగతమవతుంది. బాహ్యపరిత్యాగము అలవడితేనే కాని విధేయత అబ్బదు. భౌతికంగా వివిధ అస్తిత్వాల మధ్యవ్యవహరించే మానవుడు, విధేయత అలవడితే కాని, సర్వంతో సమంగా ఏకమై దైవానుగ్రహానికి పాత్రుడు కాలేడు. వివక్షత, పక్షపాతము ద్వేషము, ఈర్ష్య వంటివి ఎవరిపట్ల చూపడుండా అందరిపైనా ప్రేమను కురిపించకలిగితే, దైవ ప్రేమను స్వీకరించే మహద్భాగ్యం లభిస్తుంది. కానీ అవతారుని దివ్య సన్నిధిలో మసలుతూ ఎన్నెన్నో అనుభవాలు చవిచూచినా తన మండలికి గీతా జీవనం అలవడలేదని బాబా అన్నారంటే, ఇదెంత కష్టమో విదితమవుతుంది.

మనలోని బలహీనతలనధిగమించి, అత్యంత వాంఛనీయమైన మనోభావాల్ని అలవరుచుకుంటేనే తాత్విక స్థాయి అబ్బి, అత్మ నిగ్రహం సాధ్యపడుతుందనే భావనలో బాబా అటువంటి జీవితం ఎలా గడపాలో

చూపేందుకే నవజీవనాన్ని గడిపారు. తీవ్ర భావాల సుడిగుండం నుండి, కోరికల ఊబినుండి బయటపడాలంటే సంసారముపై ఉదాసీనత తప్పనిసరి, దైవేచ్ఛకు సర్వాదా తితీక్షతో సర్వార్పణ అయితేనే, అధ్యాత్మిక సమత్వం సంప్రాప్తిస్తుంది. సాధారణ మానవుడు దీనిని సాధించాలంటే ఎంత కష్టమో, తన నవజీవనం ద్వారా బాబా అచరణాత్మకంగా విశదపరచారు.

తన ప్రియతమునితో దివ్య సంబంధాన్ని ఏర్పరుచుకొని, అయనపైనే పూర్తిగా అధారపడితేనే, మనకు నిరాశామయ, నిస్సహాయ జీవితము అలవడుతుందని బాబా నిరూపించారు. యుగయుగాలుగా మనలో పాతుకున్న నేను నాది అనే అహమును పోగొట్టి మనల్ని ఉద్ధరించేందుకు ఈ నవజీవన ఘట్టం ఉద్దేశించబడింది. తన ఉపదేశాలను తాను ఆచరించి మనకు దైవాన్ని ఆదర్శంగా చూపి, కేవలం, తాను ఒక పెద్దన్నయ్యగా, మానవజీవితపు పరమార్ధమేమిటో, ఈ నవజీవనం ద్వారా ఎరుకపరచి మన మానసిక ప్రవృత్తిని సంపూర్ణంగా మార్చివేసి, ఆధునిక మానవతా చరిత్రలో ఒకనూతన అధ్యాయాన్ని ప్రతిష్టించారు. తాను నిర్వహించిన కార్యక్రమం అన్నిటికంటే అతి రహస్యమైనదని ఆయనే స్వయంగా ప్రకటించారు. దీని విధానాన్ని మహాత్ములకు సైతం అర్ధంచేసుకొనుటకు సాధ్య పడదన్నారు.

గతాన్ని పూర్తిగా విస్మరించి, వర్తమానంలోనే జీవిస్తూ భవిష్యత్తును గురించిన ఆలోచన లేని జీవితాన్ని పరివ్రాజక జీవితం అంటారు. నిన్న గడిచిపోయింది. అది గడుచురీతిలో నేడు కూడా గడిచి పోయింది. ఎలాగో మరి రేపు గురించి చింత ఎవరికి? రేపు కూడా గడిచిపోతుందిలే అన్నధీమా యీ పరివ్రాజక జీవితం కలిగిస్తుంది. ఇటువంటి జీవితాన్ని దాని ప్రయోజనాన్ని తెలుకొనే అవకాశాన్నందించేందుకు మెహెర్ బాబా 16 అక్టోబర్ 1949న నవజీవనం అనే ఒక కొత్త ఘట్టాన్ని 20 మంది ఎంచుకున్న సహచరులు (4స్త్రీలు 16 పరుషులు) తో ప్రారంభించి 16 ఫిబ్రవరి 1952 వరకు కొనసాగించారు. మన వ్యక్తిగత అలవాట్లు, ఆవేశాలు, ఆశలు కోరికలను నిర్మూలించేందుకే ఈ కొత్త ఘటాన్ని ఉపయోగించి తన సహచరులలో ప్రేరితమయ్యే ఉద్రేకాలను, అలవాట్లను అత్యంత సామర్థ్యంతో నిర్మూలించి వారిని గీతా జీవనానికి అర్హులయ్యేట్లు తీర్చిదిద్ది వారికి త్యాగమయ జీవితాన్ని అలవర్చిన సంకేతాన్ని అందించారు.

సాక్షాత్తు అవతారుని సన్నిధిలో మసలుతున్నప్పటికీ భౌతిక బంధాలెంత బలీయంగా మనపై పని చేస్తాయో ఈ నవ జీవన ఘట్టంలో అనేక సంఘటనలు రుజువు చేశాయి. బాబా నవజీవన కాలంలో సహచరులంతా శాకాహారం

మాత్రమే తినాలన్న నియమాన్ని పాటించారు. మొరాదాబాదులో ఉండగా హిప్పీ జీవనము అనే విచిత్ర జీవనాన్ని గడుపుతున్నారు. ఒక రోజున డా॥ ఘనీ ప్రస్తుతం విరామకాలాన్ని గడపుతున్నందున రోజూ తినే చెత్త వంటి భోజనానికి బదులు మాంసాహారాన్ని ఎందుకు తినకూడదు ? అని వ్యాఖ్యానించాడు. ఈయన మెహెర్ బాబాకు చిన్ననాటి సహాధ్యాయి అయినందున బాబా వద్ద బాగా చొరవ వుండేది. ఇతని వ్యాఖ్యకు స్పందించి, నా వద్ద పైకము లేదంటూనే రిజర్వు ఫండులో నుండి రూ. 10/- ఇచ్చి, తనకు నచ్చిన హోటలుకు వెళ్లి ఇష్టమైన మాంసాహారాన్ని తిని రమ్మన్నారు.

ఆ మర్నాడు క్రిష్టమస్ పండుగ. డా॥ ఘనీ ఒక పెద్ద హోటలుకు వెళ్లి కడుపార తిని, సర్వర్లకు టిప్పులు కూడా ఇచ్చి వచ్చాడు. ఆ మర్నాడు ఉదయం బాబాను శిష్యులంతా కలసినప్పుడు బాబా తనకా రాత్రంతా అసలు నిద్రే పట్టలేదని చెప్పారు. తన సహచరుల మధ్య అంతరాన్ని చూపినందుకు ఎంతో బాదపడటం వల్ల నిద్ర రాలేదని చెప్పారు. తక్కిన వారికి ఇవ్వని స్వేచ్ఛను డా॥ ఘనీకి మాత్రమే ఇచ్చి మాంసాహార భోజనానికి ఏల ప్రత్యేకత ఇవ్వవలసి వచ్చింది ? తక్కిన వారు ఇందుకు అర్హులు ఎందుకు కారు ? అతనివలే మీకు మాత్రం అభిరుచులు లేవా ? మీరు ఎందుకు మాంసాహారం తినకూడదు ? అన్న ఆలోచనలతో నిద్రపట్టలేదు. దీనికి పర్యవసానంగా ఏం చేయాలా అని దీర్ఘంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను" అని వివరించారు.

ఏమిటా నిర్ణయమని అంతా ఎదురు చూస్తుండగా "ఈ రోజున డా॥ ఘనీ అదే హోటలుకు వెళ్లి మన అందరికీ సరిపడినంత ఆహారాన్ని భిక్షగా అర్థించి తేవాలి. ఇది నా ఆదేశం" అన్నారు. ముందుగా ఈ ఆదేశాన్ని విన్న డా॥ ఘనీ గాభరాపడ్డాడు. నిన్న తాను డబ్బులిచ్చి, టిప్పులిచ్చి ఘరానాగా భోజనం చేసి వచ్చిన హోటలుకు వెళ్లి ముష్టి అడగాల్సి రావటం నిజానికి అతనికి అగ్ని పరీక్షే! మారాలోచన చేయలేదు. అంతా బాబాపైనే భారం వేశాడు. నవ జీవన దుస్తులు ధరించాడు. జోలే, క్యారియరుతో ఆ హోటలుకు వెళ్లాడు. అడిగేది బాబా, పెట్టేదీ బాబాయే నన్న భావనతో భిక్ష పెట్టమని ఆ హోటలు యజమానిని అభ్యర్థించాడు. మేనేజరు, సర్వర్లూ అంతా ఇతడ్ని గుర్తుపట్టారు. నిన్న డబ్బులిచ్చి ఖరీదైన భోజనం చేసి వెళ్లిన వ్యక్తి ఈ రోజున "సోదరా భిక్ష పెట్టు" అంటాడేమిటను కున్నారు.

అతడ్ని చూస్తే ఒక ముష్టివాడనిపించ నందున సమీపించి అతడి గురించిన

వివరాలడిగారు. తానొక బృందపు సభ్యుడనని, తమ బృంద నాయకుడు పెద్దన్నయ్య ఏం చేయమంటే అది చేయటం తమ పని అని, తామంతా పరివ్రాజక జీవితాన్ని గడుపుతూ దేశ సంచారం చేస్తున్నామని, తామంతా ఆయనకు విధేయులమని చెప్పాడు. నిన్న 10/- ఇచ్చి హోటలుకు వెళ్లి భోజనం చేసి రమ్మన్నందున, వచ్చితిని వెళ్ళానని, మరల ఈ రోజున ఇదే హోటలుకు వెళ్లి నిన్న నేను తిన్నవన్నీ మా అందరికి సరిపడినంత భిక్షగా మీ హోటలునుండే అడిగి తెమ్మన్నందున వచ్చి భిక్ష అడుగుతున్నానని చెప్పాడు. అందుకా హోటలు యజమాని అబ్బురపడి అతని జోలెనిండా ఆహారము నింపి పంపాడు. ఈ అనుభవాన్ని డా॥ ఘనీతోటే తక్కిన వారికి చెప్పించారు.

ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన ముఖ్య విషయమేమంటే, మానవ జీవితంలో, మోహానికి, అహంకారానికి, ప్రత్యేక స్థానమున్నది. కాషాయ వస్త్రాలు ధరించి భిక్షుక వృత్తిలో జీవిస్తూ కౌపీనధారణ చేసినంత మాత్రంచేత మోహానికి అహమునకు అతీతులు కాలేరు. అందుకే మెహెర్ బాబా నిష్కపటమైన ప్రేమ, విధేయతలను అలవరుచుకొని గడిపిన జీవనం సహజమైన జీవనమని, అది నిష్కపటానికి పరిణామమని, నిశ్చలత్వం ప్రేమ దయలకు ప్రేరణ అని ఎరుకపరచారు. ఈ స్వేచ్ఛను ఇతరులపై బలవంతంగా రుద్దక, తాను గడపవలసిన జీవితంలో ఆదర్శప్రాయంగా ముందుగా తాను ఆచరించి, తనను అనుసరిస్తున్న సహచరులు అచరించేట్లు అలవర్చారు. భావితరాలకు ఆదర్శ ప్రాయమయ్యే విధంగా బాబా గడిపిన నవజీవనం చిరస్థాయిగా నిలిచి పోయింది.

బాబా కేవలం మానవ మండలి తో మాత్రమే తన విశ్వ కార్యక్రమాన్ని నిర్వహించ లేదు. పరిణామక్రమంలోని రాతి దశనుండి జంతు దశ వరకు ఉన్న అన్ని సామ్రాజ్యాల్లో ని జీవులతో సంబంధం పెట్టుకొని పని చేశారు. అన్ని రంగుల రాళ్లతోనిండిన తెంబి కొండను తన ఏకాంత వాస కొండగా ఎంచు కున్నారు. మెహెరాజాదును తన నివాసంగా ఎంచుకొనిరక రకాల, పూలమొక్కలు, లతలు, తీగలు, ఫలపుష్ప భరిత మహావృక్షాలను పెంచారు. పక్షులు, సరీస్పపాల,తో పాటు అనేక నాలుగు కాళ్ళ జంతువుల్ని మక్కువతో పెంచారు. ఏ ప్రాణిని తక్కువ గా చూడరాదన్నది బాబా అభిమతం. పురుగుకు గాని చీమకుగాని, తెలిసి హాని చేయరాదని, ఎరుక లేకుండా హానిచేస్తే క్షమించవచ్చని చెప్పేవారు. ఎలుక లేదా చుంచు ఏదన్నా ప్రమాదంలో పడితే దానిని రక్షించి, బోనులో బంధించి జనసంచారానికి దూరంగా వదిలి స్వేచ్ఛ కలగించేవారు. గోడమీద సాలీడు కనిపిస్తే, తుండుపైకి,పట్టి, గుమ్మంబయటకువిసిరేవారు.

జబ్బుతో ఉన్న పక్షులు, చిన్నిచిన్ని ఎలుక పిల్లలు, కుక్క పిల్లలు, వంటివెన్నో బాబా సమక్షంలో స్వర్గంలా అనుభవించేవి. బాబా పెంచేపెంపుడు ప్రాణులేవైనా మరణిస్తే వాటిని జాగ్రత్తగా సమాధి చేసేట్లు స్వయంగా పర్యవేక్షించేవారు. అవతారము అనేది అనంత చైతన్యము, పరిమిత మానవరూపాన్ని ధరించేందుకు చెల్లించేంటాక్సు ఆయనమానవుల మధ్య మానవుడిగా మసులు తూనే, ఏ షరతులు లేని ప్రేమను కరుణను తన సృష్టిలోని సకల జీవకోటిపైన కురిపించేందుకు ఆయన జీవితంలో చేసిన కార్యక్రమాల్లో, జంతువుల యెడల ఆయన చూపిన ప్రేమ వాటితో ఆయన నిర్వహించిన ప్రత్యేక కార్యక్రమం ఒక ప్రత్యేక ఘట్టంగా నిలిచి పోతుంది. నామాల పిల్లి, పీటరు అనే కుక్క షెబా అనే గుర్రపిల్ల రెండు పందులు బోలారాం, అనే ఒంటే, రెండు ఇంగ్లీషు ఎద్దులు, సక్కుతక్కు అనే రెండు ఆడగాడిదలు, రెండు ఆవులు, రెండు చిలక పిల్లలు, పావురాలు వంటివెన్నో ప్రాణులు, బాబా అమృత హస్త స్పర్శ పొంది పరిణామక్రమంలో ఉన్నత స్థాయికి అభివృద్ధి చెందేట్లు సహాయపడ్డారు.

## షెబా

1953 లో మెహెర్ బాబా డెహరాడూన్ లోఉండగా శతృఘ్న కుమార్ బాదం కాయరంగుల్లో ముఖాన తెల్లని మచ్చతో చక్కని జాలువారే జూలుతో ముద్దులొలికే మూడునెలలు వయస్సున్న ఆడగుర్ర పిల్లను బహుకరించాడు. దానిని మెహెరా పెంచింది. డెహరాడూన్ నుంచి బాబా తిరిగి సతారాకు వస్తూ దానిని కూడా తెచ్చి, స్వయంగా తెప్పించి, పాలు పట్టి పెంచారు. చివరకది బాబాకు నాలుగు కాళ్ల మండలిలో బాబా కుక్కపీటరుతో పాటు చేరిపోయింది. రెండు మూడేళ్లయిన తరవాత దానితో తన పని పూర్తయిందన్నట్లు సరోష్‌ని పిలిచి ఈ గుర్రాన్ని ఉంచుకుంటే నీతో ఉంచుకోలేదా మంచి ఇంట్లో వప్పగించమన్నారు. సరోష్ దానిని తీసుకు వెళ్లి తన స్నేహితుడైన ఒకమిలిటరీ కమాండెంటుకు వప్పగించాడు. ఆయన దానిని తన రైడింగు క్లబ్బులో తర్ఫీదు ఇప్పించి మంచి పందెపు గుర్రంగా తయారు చేసి, బాబా అనుమతితో పందెంలో పోటీకి పెట్టారు. పూనా రేస్‌క్లబ్‌లో జరిగిన పందెంలో షెబా నెగ్గింది. దానిపై సరోష్ కూడా పందెం కాసి రూ 300 గెలుచుకున్నాడు.

# జంతు ప్రదర్శన

బాబా మెహెరాబాదులో ఉంటున్న రోజుల్లో, బాబా సరోష్‌ను పిలిపించి రెండు ఇంగ్లీషు జాలి ఆవుదూడలు కావాలి రేపు మధ్యాహ్నానికి తెమ్మన్నారు. పెయ్యఅయినా గిత్త అయినా పరవాలేదన్నారు. కొంత ప్రయత్నంచేసి, చివరకు సరోష్ కర్కి మిలటరీ డైరీ ఫారంలో రెండు ఇంగ్లీషు జాతి గిత్త దూడల్ని తీసుకొని బాబాకు వప్పగించాడు. చక్కగా ముద్దువస్తున్న ఆ దూడల్ని చూచి బాబాఆనందించారు. బాబా స్వయంగా పాలుపట్టి వాటిని పెంచారు. వాటిల్లో ఒకటి మరణించింది. పెద్దన్నయ్య బాబా రాజా అనే ఎద్దుకు తోడుగా మరో ఎద్దును కలిపి పాద్రాతో బెనారస్‌కు నవజీవనం రోజుల్లో తెప్పించి అనూహ్యమైన కార్యక్రమమేదో చేశారు. ఈ రాజా అంటే బాబాకు చాలా ఇష్టం దానికి బండి కట్టి నడిపించారే తప్ప తనెన్నడు ఎక్కలేదు. ఒక రోజున డెహరాడూన్ లోనే ఉన్నపశులోకం అనే ఘోశాలకు తన బహుమతిగా దానిని వప్పగించారు.

సరోష్ గిత్తదూడల్ని తెచ్చి బాబాకు వప్పగిస్తూన్నపప్పుడు, ఆయన ప్రక్కనే ఉన్న ఎలిజబెత్ పాటర్సన్ బాబాతో మనం పందుల్ని కూడా ఎందుకు పెంచకూడదు అన్నది. అంతే వెంటనే రెండు పంది పిల్లల్ని బాబా తెప్పించారు. అచిరకాలంలోనే బాబా అలనలో పెరిగి పిల్లలు పెట్టసాగాయి. మెహెరాజాద్ కొండంతా పందులమయమైపోయింది. కొద్ది కాలంలోనే ఎటుచూచినా పందులే. ప్రొద్దుటి నుంచి, సాయంత్రం వరకూ పందుల గోల వినపడేది. ఒకరోజున మండలి పక్కల్నిండా నల్లులుండటంతో వాటిని ఎండలో ఆరబెట్టి చంపమన్నారు. రోజంతా ఎండబెట్టి మళ్లీ గదుల్లో పరుచుకున్న పిదప, బాబాను డా॥ నీలు దేవుడు వీటన్నిటిని ఎందుకు సృష్టించాడని అడిగాడు. అందుకు బదులిస్తూ ఇ స్నీ భగవంతుడిచే సృష్టి ప డలేదు. యాంత్రికంగా తయారయ్యాయి. ఆదిలో దేవుడు మాత్రమే ఉన్నాడు. మరేజీవిలేదు. ఆయనలో సర్వం ఉన్న అయితే తానే భగవంతుడినన్న ఎరుక లేదు. ఆ చైతన్యాన్ని పొందేందుకే ఈ బంది అంతా తయారయింది. అన్నారు. అందుకే అవతారుడిగా వాటన్నిటిలో ఆ చైతన్నాన్ని మేల్కొలిపేందుకు చేసే సహాయమే ఆయన కార్యక్రమ అంతర్గతము.

నవ జీవన సమయంలో కూడా బాబా జంతువులతో పనిచేశారు. బెనారస్ లో ఉండగా డా॥ నాథ్ గారిని ఎక్కడా మచ్చలేని తెల్లటి గుర్రం ఒకటి, ఒక ఒంటే, ఒక ఆవును దూడను రెండు ఆడగాడిదలను తమ ప్రేమకు తాము ధరించిన

బట్టలు తీసుకునే షరతుపై భిక్షగా ఇవ్వమని కోరారు. వాటన్నిటినీ డా॥ నాథ్ సేకరించి బాబా ఆదేశాల ప్రకారం సమర్పించుకున్నాడు. బాహ్యంగా బాబా బృందంతో ఈ జంతువులను తీసుకువెళుతున్నట్లు కనిపించినప్పటికి తన గత అవతార సమయాల్లో, జంతులోకానికి చేసిన మేలుకంటే, ఈ సమయంలో సరిక్రొత్త అత్యున్నత కార్యక్రమమేదో చేశారు. తెల్ల గుర్రం జో రాష్టరు చేసిన కార్యక్రమానికి చిహ్నం. ఆవు కృష్ణుని కార్యక్రమానికి ప్రతీక. ఆధ్యాత్మిక కుదుపును కలిగించేందుకు మధ్యేమార్గంగా జీసస తన కార్యక్రమంలో ఉపయోగించిన జంతువులు గాడిదలు. మహమ్మదు తన కార్యక్రమంలో ఒంటెను ఉపయోగించాడు. మెహెర్‌బాబా ఇప్పుడీ అన్నింటినీ ఏకకాలంలో ఉపయోగించారు.

1920 లో బాబా మస్తాన్ అనే కుక్కను పెంచారు అది చూట్టానికి ఎంతో భయంకరంగా గుర్రపిల్లంత పెద్దదిగా ఉండేది. కొత్తవారిని కరిచి పీకేది. అందుకే ఎల్లప్పుడూ కట్టేఉంచేవారు. ఒకసారి సమీపంలో ఒకరైతును చూచి, మెహెర్‌తో వాహ్యాళికి వెళుతున్న మస్తాన్ మొరిగే సరికి భయపడిన ఆ రైతు ఒకరాతిని దానివైపు విశిరాడు. ఆరాయి మెహెరాను దూసుకుంటూ పోయింది. అప్పుడు బాబా అతని చర్యకు దండనగా తన కాళ్ల ముందు, ముక్కును నేలపై రుద్దమని ఆదేశించి తమపని వాడితో అతని చెంపను చెళ్లుమనిపించారు.

పిపీలకాది సకల జీవకోటికి చెందినవాడు, అవతారుడు.దైవం అవతరించి నప్పుడు, ఆరూపం మానవుల మధ్యమానవుడిగా మానవాళికొరకే పనిచేయటం కాక అదే సమయంలో సృష్టిలో సకల ప్రాణులకు, జీవనిర్జీవాలకు చెందిన వాడై వాటన్నిటిలో తానొకడవుతాడు. ఈ సత్యాన్ని మెహెర్ బాబా ఒక జాబులో తన తల్లిదండ్రులకిలా తెలియపరిచారు.

అవతారుడు అనే పదాన్ని పూర్తి అర్థాన్ని గ్రహించటం మానవుడికి చాలా కష్టం. అవతారుడు అంటే దేవుడు అని దేవుడు మానవుడయ్యాడని ప్రకటించటం చాలా తేలికే. అయితే అవతారుడు అనే పదానికి చెప్పుకునే అర్థం ఇదికాదు. అవతారుడంటే దేవుడని, దేవుడు మానవ జాతికంతటికి ఒక మానవుడిగా మారి అదే సమయంలో అదేభగవంతుడు సృష్టిలోని పిచ్చుకలన్నిటికీ ఒక పిచ్చుకగా సృష్టిలోని పందులన్నిటికి ఒక పందిగా, సృష్టిలో సకల ధూళికి ఒక ధూళికణంగా అలాగే సృష్టిలోని తదితరమైన ప్రతి సర్వస్వానికి తాను అదేగా మారుతున్నాడు

- మెహెర్‌బాబా.

"అంతా మానవులు, వాయువు, మేఘమాలు వృక్షములు, సర్వము ఆయన రాకకైఎదురు చూస్తున్నారు. కానీ ఏ ఒక్కరూ ఆయన్ని చూడటం లేదు. అంతా అంధులే. అయినప్పటికీ, తన ప్రేమను, తనకరుణను, అందరిపైనా, అన్నిటిపైనా కురిపిస్తున్నాడు అని మెహెర్‌బాబా ప్రకటించారు. ఆయన అవతారుడిగా ప్రతివ్యక్తి స్థాయికి ప్రతిప్రాణి స్థాయికి, దిగివచ్చి ప్రతిప్రాణితో అద్వితీయసంబంధాన్ని పెట్టుకున్నారు. కొందరికాయన దివ్యమాత, మరికొందరి ప్రియతమ తండ్రి, హితుడు, గురువూ, దైవంకూడా అయ్యారు తన ప్రేమికుల కాయనే శాశ్వత ప్రియతముడు.

## విశిష్టా ద్వైతం

గీత ఎం చెపుతున్నది ? కోరిక బంధాన్ని పెంచుతుంది. కనుక మోక్షాన్ని కూడా కోరవద్దు. అన్నీ వదిలి పెట్టి నన్నే ఆశ్రయించండి అన్నది శ్రీకృష్ణుని ప్రభోదము ఇదే ప్రియతమునితోఉండే సమత్వం ఆనాటి ఈ దివ్యవాణినేటికీ ప్రియతమ బాబా ద్వారా ప్రతిధ్వనిస్తోంది. ఆచరణలేని సిద్ధాంతం శుష్క వేదాంతమే అవుతుంది. కనుక బాబా మాటలతో పనిలేని చేతల ద్వారా తాను చెప్పదలచిన దివ్య సత్యాలను ఆచరించి వ్యక్తపరచారు. మనము విశ్వాసాలు, మూఢవిశ్వాసాలు లేకుండా పరిరక్షించుకొనేట్లు ఎన్నెన్నో అనుభవాలందించారు. **"నేను బోధించుటకు కాక మేల్కొలుపుటకే వచ్చాను"** అని అంటూ మన మనస్సును హృదయంతో మేళవించి సహకరించేట్లు, మనకు తెలియకుండానే తీర్చిదిద్దారు.

అశాశ్వతమైన ఐహిక వాంఛలను విసర్జించి, శాశ్వతమైన ముక్తిని, దివ్య సమత్వాన్ని పొందాలన్న తీవ్రమైన తితీక్ష ఒక్కటే మానవుడ్ని మాధవునిగా మార్చగలదు. యధార్థ గురువులు, లేదా అవతారుడు చేసే మహిమలు, అద్భుతాలు మానవునిలో ఇటువంటి విముక్తి మార్పును ప్రోత్సహించి ప్రభావితుల్ని చేస్తుంది. బాబా నవ జీవన కాలములో ఒక సంవత్సరం గడిపి, మధ్యలో 16-10-1950న మళ్లీ పాత జీవితంలోనికి వచ్చి, కొందరు ప్రేమికులకు మహాబలేశ్వర్‌లో దర్శనమిస్తూ అందించిన ధర్మోపన్యాసము అత్యంత ఆధ్మాత్మిక ప్రాధాన్యత ఉన్న దివ్య సందేశము. అతిక్లిష్టమైన ద్వైతాద్వైతత్వాన్ని చాలా తేలికగా అర్థం చేసుకొనుటకు అనువుగా వివరించారు. ఉన్నది భగవంతుడు ఒక్కడే ఇదిమినహా జీవుడి పరంగా భ్రమతో చలామణి అవుతున్న సర్వమూమాయే బ్రహ్మంనుండి ప్రకృతిని, జీవుని మినహాయిస్తే అది అద్వైతం. ఈ రెండింటిని

జోడిస్తే విశిష్టాద్వైతం. ఈ దివ్యరహస్యాన్ని మానవాళికి వ్యక్తపరిచేందుకే బాబాను బాబాలో కాక ఆయన్ని అందరిలో దర్శించమని చెప్పారు. అందరిలోను, అంతటా దైవాన్ని దర్శించ కలిగిన రోజున, ఈర్ష్య, ద్వేషము, అసూయ, పగ, తరతమ భేదాలవంటివన్నీ తమంట తామే హరించుకుపోతాయి. ఇది ఒక్క దివ్య ప్రేమకే సాధ్యము.

అవ్యక్తమైన పరాత్పర పరబ్రహ్మ స్థితినుండి అవతారుడు వ్యక్తమవుతాడు. అస్థిత్వం నుండి ఆవిర్భవించిన అవతారుడు తన విశ్వ కార్యక్రమాన్ని మానవాళి కొరకు అధర్మప్రాయంగా పరిమితత్వాన్ని పెనవేసుకొని, ఏక కాలంలో దైవంగా, మానవుడిగా యీమాయా సృష్టిలో కొనసాగిస్తాడు. ఆయన ఊహాతీతుడయినప్పటికీ, సగుణసాకారునిగా, పరిమిత దేశకాల గుణముల పరిధిలో, మన ఆలోచనలు భావాలకనుగుణ్యంగా ఆయన కార్యక్రమం ఉంటుంది. మానవుడు మాధవుడిగా మారుటకు ప్రేమ తప్ప మరే ఇతర సాదనా సహాయపడదని బాబా చెప్పారు. మహనీయులెందరో ఎన్ని ఆధ్యాత్మిక సత్యాల్ని ప్రవచించినా, మానవాళి అసత్యాన్నే అంటి పెట్టుకుని, ఎదుగు బొదుగూ లేక, చెంతనున్న దైవాన్ని కనలేక, అన్వేషిస్తూనే ఉంటారు.

మెహెర్‌బాబా కార్యక్రమ విధానానికి ఒక ప్రత్యేకత ఉండేది. ఆయన అందరికోసం వచ్చారు. మన అందరి ప్రేమను కోరి వచ్చాడాయన. తండ్రిగా, తల్లిగా పరిపూర్ణమైన వ్యక్తిగా తన ప్రేమను మనందరికీ అందించి, మన నుండి ప్రేమను స్వీకరించుటకు ఆయన వచ్చారు. ఆయన ప్రేమ మహాసాగరుడు. ఎంత తీసుకున్నా తరగనిదా ప్రేమ. ఒక స్నేహితుడిగా, హితుడిగా, ఆత్మీయుడిగా, సోదరునిగా ఆయన్నెలా భావించినా, ప్రేమించుట ముఖ్యం.

ఆయన వచ్చింది తన ప్రేమనందిచుటకు కనుక, మనమాయాన్ని చూడాలన్నిది ముఖ్యం కాదు. దర్శనకార్యక్రమాల్లో ఎందరో ఆయన్ని చూచారు. మరి వారంతా ఏమయ్యారు ? కనుక చూడటమనేది ప్రధానం కాదు. స్వయంగా దర్శించకుండానే ఈనాడు, ఎందరో తమ జీవన రంగంల్లో ఎన్నో సమస్యలు ఎదురవుతున్నా, ఆయన్ను స్మరిస్తున్నారంటే, ఆయననుండి ప్రేమకానుకను పొందుట వల్లే సాధ్యపడింది. ఎన్నో ఏళ్లు పరమనిష్టతో సాధనచేసిన యోగులకంటే తన మండలి ఎంతో అదృష్టవంతులని బాబా చెప్పారు.

న్యూయార్కు నగరంలో ఒక నిగ్రో ఉన్నాడు. అతడు మహమ్మదీయ భక్తుడు నిత్యం అయిదుసార్లు నమాజు చేసేవాడు. ఉద్యోగరీత్యా స్వగ్రామం

నుండి మహా నగరానికి రావటంతో యాంత్రిక జీవనానికలవాట వటం తప్పని సరైంది. నమాజు చేసే నిర్ణీత సమయానికి చేయలేకపోతున్నాడు. అందువల్ల ఒక రోజున ఇక నుంచి రోజూ పొద్దున్న, సాయంత్రం రెండుసార్లే నిర్ణీత సమయానికి హృదయపూర్వకంగా చేస్తానని అల్లాకు విన్నవించుకుంటూ నమాజుకు ఉపక్రమించి వంగబోతుంటే ఎవరో వెనుక నుంచి చాచి తన్నారు. తీరా నేను తిరిగి తన్నిందెవరని చూడగా ఒక దివ్యమంగళ రూపం దివ్యకాంతులు వెదజల్లుతూ కనిపించింది. ఆ రూపాన్ని అతడంతకు ముందెన్నడూ చూడలేదు. "నీవు ప్రార్థిస్తున్న దేవుడు అటువైపు లేడు. ఇటు - ఇక్కడ ఉన్నాడు. ఇటు చూస్తూ ప్రార్థించు" అంటూ అంతార్ధానమైపోయాడు.

ఈ వింత అనుభవానికి ఆ నీగ్రో ఆశ్చర్యపోయాడు. కానీ తాను చూచిన అద్భుత రూపం మాత్రం గుర్తున్నది. ఆయన ఎవరో, ఎందుకలా చెప్పారో తెలియక తల్లడిల్లి తెలుసుకోవాలన్న జిజ్ఞాసతో తహతహలాడాడు. కొన్నాళ్లకు, ఒకనాడు ఉద్యోగానికి వెళుతుండగా రోడ్డుపైన ఒక వ్యాను తన ప్రక్క నుండి దూసుకువెళ్లింది. దాని వెనుక ఒక అందమైన కటవుట్ వేలాడుతోంది. తనకు అంతకు ముందు సాక్షాత్కరించిన అద్భుత రూపముదే ఆ బొమ్మ. కనుక ఆ బొమ్మ ఎవరిదో తెలుసుకోవాలన్న తపనతో ఆ వ్యానును వెంబడించాడు. అర్జంటైనా వాస్తవ్యుడైన బాబా ప్రేమికుడు ఎడ్వర్డో హోటలు వ్యాపారం ఎత్తివేసి, న్యూయార్కుకు వచ్చి ఆటోమొబైల్ వ్యాపారం చేస్తున్నాడు. ఆయనకు చెందిందే ఈ వ్యాను.

కూడలిలో ఎర్రలైటుపడటంతో ఆగిన వ్యానును సమీపించి, ఆ నీగ్రో యువకుడు వ్యానుకు ఉన్న కటౌటులో ఉన్న బొమ్మ ఎవరిదని డ్రైవరును అడిగాను. అది అవతార్ మెహెర్‌బాబా బొమ్మ అని, ఆయన్ని గురించి మరింత తెలుసుకోవాలంటే మా యజమానిని కలవమని చెప్పి ఎడ్వర్డో అడ్రస్సు ఇచ్చాడు. వారింట్లో మెహెర్ నడుపుతున్నాడు. ఈ నీగ్రో వారింటికి చేరే సరికి సంకీర్త పూర్తయింది. ఎడ్వర్డో బాబా అనుభూతులను కథలుగా చెపుతున్నాడు. ఆయన ప్రసంగం కాగానే ఈ కొత్త వ్యక్తయిన నీగ్రో లేచి, అయ్యారు చెప్పిన కథలన్నీ విన్నాను. నాకు చాలా ఆనందం కలిగింది. అయితే నా కథకూడా వినండని తన కథంతా వివరంగా చెప్పాడు. అలా ఆ నీగ్రో బాబా ప్రేమపరిధిలోకి వచ్చాడు. మెహెరాబాదు వచ్చి దర్శనం కూడా చేసుకున్నాడు.

బాబా నిరంతరం మన కొరకు ఎదురు చూస్తూనే ఉన్నారు. కానీ మనం మాత్రం ఆయన కోసం ఎదురు చూడటంలేదు. మనకు కావలసింది, ఆయనతో ప్రత్యక్ష సంబంధం. ఇది భౌతికంగా బాబాను దర్శించినంత మాత్రం చేత ఏర్పడేది కాదు. మన హృదయంలో ఆయన నామాన్ని నింపుకోవాలి. ఆయన రూపాన్ని ప్రతిష్టించుకోవాలి. అప్పుడు ఆయనే మనతో అంతర్ బంధాన్ని కలిపిస్తారు. దానివల్ల బాబాను గురించి తెలియనివారితో కూడా బంధాన్ని ఏర్పరచుకోగలుగుతాం.

# చరమాంకము

1952లో తన ఉద్భుతమైన నవజీవన ఘట్టం పరిసమాప్తం కాబోతున్నదని బాబా ప్రకటించిన పిదప, ప్రాక్పశ్చిమ దేశాల్లో దాదాపు ఒక దశాబ్దంపాటు ప్రజాబాహుళ్యంతో సన్నిహిత్యం పెంచుకొని గడిపారు. 1952లోనే మెహెర్‌బాబా అమెరికాలో పెద్ద ఎత్తున పర్యటించారు అందులో భాగంగా మిర్టిల్‌బీచ్‌లో తన కార్యక్రమ నిర్వహణ కోసం ఒక ఆధ్యాత్మిక కేంద్రాన్ని స్థాపించటం ఒక ముఖ్య విషయమైంది. ఇది దక్షిణ కరోలినాలో ఉన్నది. 18-4-1952 న బొంబాయి నుండి బయలుదేరి న్యూయార్కుకు విమానంలో కొందరు మండలి సభ్యులతో వెళ్లారు. సౌత్ కరోలినాలోని ఫ్లొరెన్సుకు రైల్లో వెళ్లి మిర్టిల్‌బీచ్‌కు కారులో చేరారు. యుగాలకు పూర్వం తానా ప్రాంతంలో సంచరించానని, అది తనకెంతోఇష్టమైన స్థళమని చెప్పాం. 20-5-1952న వరకూ అ్కడే గడిపి, అనేకమందికి దర్శనభాగ్యాన్ని కలిగించారు. 21 - మే - 1952న రెండు కార్లలో బాబా బృందం కాలిఫోర్నియాకు బయలు దేరింది. బాబాకారును ఎలిజబెత్ పాటర్సన్ నడుపుతోంది. అదే కారులో మెహెరా, మణి, మెహెరూలూకూడా కూర్చున్నారు.

సర్వజ్ఞుడైన బాబా, కారు బయలు దేరబోయే ముందే ఎలిజబెత్‌ను కారు భీమాపాలసీనీ తెచ్చి కారులో ఉంచుకోమని ఆదేశించారు. ఆమెకు బాబా భీమాపాలసీని ఎందుకు తెమ్మన్నారో అర్థం కాకపోయినా, ఆయన చెప్పినట్లు చేసింది. 1932లో బాబా అమెరికా వచ్చినప్పుడు, 24-5-32న ఎలిజబెత్‌కు ఒక గులాబీ పువ్వును ఇచ్చి, దీనిని ఇచ్చిన ఈ తేదీని బాగా గుర్తుపెట్టుకోమని ఆమెను ఆదేశించారట. ఆ పువ్వును ఆమె తన బైబిల్‌లో దాచి పెట్టుకొని ఆ తేదీ నిర్వాసి పెట్టుకున్నా, కాలక్రమంలో ఆ విషయం గురించి మరచిపోయింది. 21వ తేదీన

మిర్టిల్‌బీచ్ నుండి బయలు దేరిన బాబా దారిలో తన అనుచరులందరికీ చూడదగిన ప్రదేశాలన్నీ చూపిస్తూ ప్రయాణం చేశారు. ఉత్తర కరోలినాలోని కొలంబియా, మర్ఫీ, రుబీజలపాతం వంటి ముఖ్య ప్రదేశాలు సందర్శించి ఓక్లా హమావైపు 24 మే 1952నపయనిస్తున్నారు. ప్రేగ్ సమీపానికి వస్తుండగా, ఓజమ్ వద్ద బాబా కారు మరో కారుతోఢీకొని ఘోర ప్రమాదం జరిగిపోయింది. బాబా ఎడమకాలూ, చెయ్యి విరిగిపోయాయి. అయినా, ఆ బాధల్ని ఆయన సావధానంగా భరించారు. ఏ మాత్రం బాధను వ్యక్తపరచకండ ఆనందంతో సంతృప్తిని వ్యక్తపరచారు.

బాబా అంతకుముందే, కొన్ని సంవత్సరాల క్రితం శారీరకంగా తనకు స్వయం కల్పిత ప్రమాదము సంభవించనున్నదని జోశ్యం చెప్పారు. ఈ ప్రమాదం కూడా అమెరికాలోనే జరిగితీరాలని భగవంతుడు సంకల్పించాడని కూడా విరించారు. 24 మే 1952న అలాగే జరిగింది. 64వ నంబరు రహదారి కొండదారి. రోడ్డు విశాలంగా ఉండదు. దీనికి తోడు ఆ రాత్రి వర్షం కురవటం వల్ల రోడ్డంతా తడిసిఉన్నది. వీరికొరకు ఎదురుగా మరో కారు అతివేగంగా రాకూడని వైపుగా వస్తుంటే పాపంఎలిజబెత్ తనకారువేగాన్ని తగ్గించి అదుపులో ఉంచుకున్నది. అయినా ఎదురుగా వస్తున్న కారు వేగంలోనే బాబాకారును ఢీకొట్టింది. ఈకారు యజమాని కొరియా యుద్ధంలో కాలుపోగొట్టుకున్న ఒక క్షతగాత్రుడిది.తను స్వయంగా నడుపుకొగలిగేట్లు ఆకారుని తన కొసం తయారుచేయించుకున్నాడు. దానిని తానే స్వయంగా మొదటి సారిగా నడపడంతో దానిని అదుపు చేయడంలో విఫలమయ్యాడు. అతనితో పాటు అకారులోని మణి తప్ప తక్కిన వారంతా ఎముకలు విరిగిన గాయాలతో రోడ్డుమీద పడిపోయారు.

బాబాబృందంలోని రెండవ కారును సరోష్ నడుపుతున్నాడు. కూల్‌డ్రింకు, తాగేందుకు, బాబా వద్దన్నా దారిలో ఆగిపోవటం వల్ల ప్రమాద సమయానికి వాళ్ళు దగ్గర లేకపోయారు. ఎదురుగా వస్తూన్న ఒక కారు యజమాని, తన భార్యకు పురుడు పోయించేందుకు సమీపంలో ని ప్రేగ్ అసుపత్రిలో చేర్చేందుకు తీసుకువెళతూ ఈ ప్రమాదాన్ని చూచి, ఆగిపోయి, అప్పటి కప్పుడు రెండు అంబులెన్సులు రప్పించి, గాయపడినవారిని అంబులెన్సుల్లో ఎక్కిస్తూన్నసమయంలో, సరోష్ కారువచ్చింది. ఆదృశ్యాన్ని చూచి వారంతా దిగ్భ్రాంతి పడ్డాలో వైద్యసేవలందించారు. బాబా తనరక్తాన్ని అమెరికా నేలపై చిందించటంలోని ప్రాముఖ్యతను గురించి ఇలా వివరించారు. నేను ముందే

చెప్పిన ఈ ప్రమాదం, నా భౌతిక దేహాన్ని గాయపరచి అమెరికానేలమీద నారక్తాన్ని చిందే ట్లు చేసింది. బాహ్యంగా కాలూ చెయ్యి విరగటమేకాక, మానశికబాధను కూడా కలిగించింది. దైవేచ్ఛ ప్రకారం ఇది అమెరికాలో జరగాల్సిఉన్నందున, నేను చెప్పినట్లే జరిగింది.అని చెప్పారు.

ఈ ప్రమాదంతోపాటు 1956లో భారతదేశంలో మరో రోడ్డు ప్రమాదం జరిగింది. అప్పట్లో సతారాలో ఉంటున్న మెహెర్ బాబా పూనాకు వెళ్లితిరిగి వస్తుండగా, సతారాకు 14 మైళ్లదూరంలో ఉడతారా అనే వూరికి దగ్గర్లో 2 డిశంబరు 1956న ఈ ప్రమాదం సంభవించింది. అనుభవజ్ఞుడైన డ్రైవరు ఎరుచ్ కారును డ్రైవ్ చేస్తున్నాడు. ఎదురుగా మనుషులుగాని, ఏ వాహనాలూ కానీ అడ్డుగా రాలేదు. అకారణంగా కారుస్టీరింగు అదుపు తప్పి రోడ్డు వంతెన గట్టుకు గుద్దుకుని ప్రక్కనున్న గోతిలో పల్టీ కొట్టింది. ఈ ప్రమాదంలో బాబా కుడి పార్శ్వంలోని అవయవాలన్నీ విరిగిపోయాయి. తలకు ముఖానికి పెద్దదెబ్బలే తగిలాయి. నాలుక తెగిపోయింది. ఎరుచ్, పెండూ, విష్ణూలకు కూడా దెబ్బలు తగిలాయి. తాను కోరుకున్నట్లుగానే డా॥ నీలు మాత్రం బాబా సన్నిధిలో ఈ ప్రమాద సమయంలో మరణించాడు.

మానవాళి తమతమ కర్మానుసారం ఫలితాలననుభవిస్తూ బాధలు పడతారు. కొందరు ఇతరులకోసం బాధ పడితే, సద్గురువులు, ప్రపంచం కొరకు బాధపడతారు. మెహెర్ బాబాకూడా అవతారుడిగా తనకు తగిలిన దెబ్బల వల్ల కలిగే బాధను గురించి ఒకసారి వ్యక్తం చేస్తూ నేను అనుభవిస్తున్న విశ్వ వ్యాప్త బాధకు ఈ ప్రమాదం పైకి కనిపించే స్వల్ప సంఘటనలు మాత్రమే. అయినా నేను సంతోషంగానే ఉన్నాను. నేను కావాలనుకున్నట్లుగానే జరిగింది. అన్నారు.

# మెహెర్ బాబా ఎవరు ?

1950 వదశకంలో బొంబాయి నగరంలో ఇండస్ట్రీయల్ ఎగ్జిబిషన్ జరుగుతోంది. ఆ ఎక్జిబిషనులో మెహెర్‌బాబా స్టాలు ఒకటి ఏర్పాటు చేశారు కొందరు బాబా ప్రేమికులు. ఆ స్టాలును ప్రజలు తండోప తండాలుగా వచ్చి దర్శిస్తున్నారు. వచ్చే వారంతా నిర్వాహకులను మెహెర్‌బాబా అంటే ఎవరు? అని ప్రశ్నించ సాగారు. రకరకాలుగా మెహెర్ దేవుని గురించిన వివరణలు చెప్పినా వారెవరికి సరియైెప అవగాహన కుదరటంలేదు. అందువల్ల స్టాలు ర్వాహకులైన బాబా ప్రేమికులు, అప్పుడు బొంబాయిలో నే విడిది చేసియున్న మెహెర్‌బాబాను

కలిసి మెహెర్‌బాబా ఎవరు? అనే ప్రశ్నను యనకేవేసి దీనికి ఏం జవాబు చెప్పాలో చెప్పమని బాబాను అడిగారు.

అందుకుబాబా ఇలా బదులిచ్చారు. ఎవరైతే మిమ్ములను ఈ ప్రశ్న వేసేట్లు ప్రేరేపించారో ఆ ఏకైకుడే మెహెర్‌బాబా. ఆయన అందరిలోనూ ఉండే కేకైకుడు ఈ విషయాన్ని ఒకసారి స్నొబాలనాటుగారు నాతో ప్రస్తావిస్తూ ఆయన అందులో ఉన్న ఏకైకుడు అయినప్పటికీ ఈ సత్యాన్ని అనుభవంలో తెలుసుకోవటం చాలా కష్టమన్నారు. బాబా చెప్పినట్లు, మంచికి వశులై దుర్లక్షణాల్ని విడనాడి, మన లో ఉన్న చెడును సత్ లక్షణాలుగా మార్చుకొంటెనే ఇది సుసాధ్యమవుతుంది. ఈ వైరాగ్యపు ఆటలో ఆధ్యాత్మిక సాధకులు పశిపిల్లలు గా మారాలి. పశిపిల్లలు గా మారినాకొంగును పట్టుకోండి అని బాబా నొక్కి చెప్పారు. ఇక్కడ పశివాడిలా మారాలనటంలో అర్థం పశితనంగా మారటం కాదు. పశావాడేం చేస్తాడు? రద్దీగా ఉన్న బజార్లో, తల్లీ తో వెళుతున్నప్పుడు ఆ వాతావరణానికి భయపడి తల్లి కొంగును గట్టిగా పట్టుకుంటాడు. ఆమెను వదలక, అంటిపెట్టుకొనే ఉంటాడు. అలాగే ఈ ప్రపంచమనే సంతలో సతమతమయ్యే మనం, రక్షణను కోరి, బాబా కొంగును జారవిడయకుండా గట్టిగా పట్టు కొని ఆయన్ని అంటి పెట్టుకొని ఉండమని బాబా తరచూ చెప్పేవారు.

ఒకసారి తన మండలికి తన కొంగును పట్టుకొనుటను గురించి వివరిస్తూ ఒక ముస్లిం మత గురువుకు సంబంధించిన కథను చెప్పారు. తన జీవితాన్ని భగవంతునికి అర్పించుకున్న భక్తుడైన ఒక ముస్లింముల్లా ఉండేవాడు. ఆతను దైవమందు పరిపూర్ణ విశ్వాసమును ఉంచి, పూర్తిగా ఆయనపైనే ఆధారపడ్డాడు. తన ప్రభువును అన్వేషిస్తు, ఆయన్ని దర్శించాలని, యాత్రలు సాగించాడు. అలా దారివెంట పోతుండగా దాహంవేస్తే నీళ్లనూతినుండి తోడుకొనుటకు పనికి వస్తాయన్న ఉద్దేశ్యంతో ఓ తాడును ఒక బకెట్టును కూడా తన వేంట తీసుకు వెల్లాడు. వెళ్లగా, వెళ్లగా ఎడారిలో మిట్టమధ్యాహ్నామైనందున ఎండతీవ్రతకు తట్టుకోలేకపోయాడు. దాహం తో అలమటించి పోయాడు. మరిశక్తిని కొల్పోయి, ప్రభూనీ అన్వేషణలో నిన్ను కాంచలేక పోయాను. దాహంతో చచ్చిపోయేటట్లున్నాను. ఏమిటి నాకీ పరీక్ష? అని పరితపిస్తున్నంతలో కొద్దిదూరంలో ఒక పశువుల మంద నీటిని త్రాగుతున్నట్లు గమనించాడు. అవిమోరలు పైకెత్తినప్పుడు వాటి నోటినుండి నీటిబిందువులు జారటం చూచి, అక్కడేదో నీటి ప్రవాహమున్నదనుకొని వేగంగా అక్కడకు చేరుకున్నాడు.

అక్కడ ఒక పెద్ద తొట్టివంటి గొట్టంలో అమందనీటిని త్రగుతున్నాయి. నీరు చూడగానే ఆత్రంగా ఆనీటిని తన బకెట్టుతో ముంచి తోడుకొని త్రాగాలని ప్రయత్నించే సరికి నీటి మట్టం క్రమంగా భూమిలోకి కుంగి పోతూ బకెట్టు తాడుకు అందలేదు. ఆ పరిస్థితికి విస్తుపోయినముల్లా నేనేంపాపంచేశాను? నాబకెట్టుకు అందకుండా నీటి మట్టం ఎందుకు దిగిపోయింది? నోరు లేని ఈ పశువులకు నీటిని పైకి రప్పించి తలవంచితే అందేటంత పైకి జలము అందేట్లు చేసిన ఆ భగవంతుడు, నోరు ఉన్న నాకు అందనంతటి లోతుకి నీటిని ఇంకింప చేశాడు? ఇదేమి వింత? అనుకున్నాడు.

అంతలో అతనికి ఒక అశరీర వాణి వినిపించింది ఆపశువులు పూర్తిగా నాపైన విశ్వాసమునుంచి నాపైనే ఆధారపడినవి. అందువల్లనే వాటి బాధ్యతను నేనే పూర్తిగా తీసు కోవలసి వచ్చింది. అయితే నీవు మాత్రం నీబకెట్టు తాడుమీదే ఆధారపడ్డవే తప్ప నామీద ఆధారపడలేదు. మరి తాడు బకెట్టుమీద ఆధారపడినందున అవి నీకెలా సహాయపడకలగాయోగమనించావా? అనడిగేసరికి అతనిలో జ్ఞానోదయమైంది. తన అవివేకానికి పశ్చాత్తాప పడ్డాడు. పరిపూర్ణ విశ్వాసాన్ని భగవంతునిపైనే లగ్నంచేసి, తన దాహాన్ని తీర్చమని ప్రార్థించాడు. అంతలోనే జలధార పైకి రాసాగింది. చేతితో బకెట్టు ముంచితే అందేమట్టానికి రాసాగింది. చేతిలో బకెట్టుముంచితే అందేమట్టానికి నీరు రాగానే, బకెట్టుతో నీటి ని ముంచి తనివి తీరా త్రాగి తన ప్రయాణాన్ని ముందుకు సాగించాడు.

అలా వెళుతుండగా దారిలో ఒక చోట ఓ సద్గురువు తన శిష్యులకు, భగవంతుని పై పూర్తివిశ్వాసాన్నుంచిన భక్తుడు, ఆయన పై ఎలా ఆధారపడాలో భోదిస్తున్నాడు. ఈ ముస్లీంముల్లా ఆ గురువును కలిసి, తన అనుమానమును గురించి చెప్పుకున్నాడు. నోరులేని పశువులకు నీటిని నోటికందేట్లు చేసిన భగవంతుడు, నోరున్న తనకు ఎందుకు అందకుండా చేశాడని అడిగాడు. అందుకే గురువు ఓరి, మూర్ఖుడా నీలో ఓర్పు లేదు, సహనంలేదు. పూర్తిగా దైవంపై ఆధారపడే మనస్సు లేదు. పైకి వచ్చేనీరు నీ నోటికి అందేవరకు ఆగలేక పోయావు. మరికాశేపు ఆగకలిగి ఉంటే, పశువుల నోటికి అందిన స్థాయిలోనే భగవంతుడు, నీవు నీతలను వంచితే నీనోటితో జుర్రకొనేందు కనువుగా నీటిని అంచులపైకి తెచ్చేవాడు. అంతవరకూ ఆగలేక పోయావు. ఇది నీ మూర్ఖత్వం. సర్వం ఆయనకే వదిలి పూర్తిగా దైవం పైపూర్తిగా ఆధారపడకలిగితే, ఆ పశువుల మాదిరి గానే నీవూ, ఎలాంటి శ్రమ లేకుండా నీ దాహాన్ని తీర్చుకోగలగేవాడవు. ఇదే నీలోని లోపమని మందలించాడు. అందువల్ల, మన తెలివి తేటలనుపయోగించక,

ఆమాయకంగా సర్వంబాబాకు వదిలిపెట్టి, ఆయనపైనే ఆధార పడటం, పశిపిల్లలుగా మారటమవుతుంది. అప్పుడు మన అవసరాలను ఆయనే తీరుస్తానంటాడు అందుకే నేను నీ అవసరాలను తీరుస్తాను. కానీ కోరికలను కాదు అని హెచ్చరించారు బాబా.

ఒక పర్యాయం నేను సో॥ వై. మాణిక్యాలరావుగారు మాచర్ల వెళ్లాం. అక్కడ సో॥ వంకాయల వెంకయ్యగారు మాచెర్ల బాబా సెంటరు ప్రారంభోత్సవం చేస్తున్నారు. నరసరావు పేట సెంటరు వారి ఆహ్వానంపై మేము బయలుదేరాం. నరసరావుపేటలో శ్రీ నాగసరపు రామచంద్రరావు ఇంటికి వెళితే అక్కడ నుండి వారు ఏర్పాటు చేసిన బస్సులో మేము మాచర్ల చేరాలి. మేమిరువురం మధ్యాహ్నం 1-00 గంటకే విజయవాడలో బయలుదేరినా మేము ఎక్కిన బస్సు స్థానికంగా జరుగుతున్న రాజకీయ పార్టీవారి ఊరేగింపువల్ల, బారేజివైపు వేళ్లే వీలులేక చిక్కుకుపోయింది. రద్దీ తగ్గి దారి సరయ్యే సరికి సాయంత్రం 6-00 అయింది. మేము నరసరావు పేట చేరేసరికి రాత్రి 10-00 అయింది. మా కోసం, చూచి చూచి, నరసరావుపేట సెంటరు భక్తులు మాచెర్ల వెళ్లిపోతూ, ఆంధ్రాబ్యాంకు ఎదురు రోడ్డులో ఉన్న శ్రీ వంకాయల వెంకయ్యగారింటికి హైదరాబాదు బస్సులో రమ్మనమని చెప్పి వెళ్ళారు. మా జేబులో ఉన్న బస్సు టికెట్టుపై వారు చెప్పిన అడ్రసువ్రాసుకొని 11-00లకు హైదరాబాదు బస్సు ఎక్కి రాత్రి 1-30కు మాచెర్ల చేరాం.

రోడ్డు మీదున్న ఒక కాకాహోటలులో, బ్రడ్‌తిని టీ త్రాగి, మేము వెళ్లాల్సివారింటి అడ్రసుకై జేబులో వేతికితే ఆ టికెట్టు జారిపోవటం వల్ల కనిపించలేదు. పేరుమరిచిపోయాము. తొలిసారిగా మా చెర్లరావటంవల్ల అంతా అయోమయంగా తయారైంది. స్థానికంగా ఉన్నదేవాలయంలో రేపు మెహెర్‌బాబా కార్యక్రమం ఒకాయన ఏర్పాటు చేశారు. ఆయనపేరు గుర్తుకు రావటంలేదు. వారిల్లు పేరు తెలుసాఅని, కాకాహోటలు వ్యక్తిని అడిగాం. తెలియదన్నాడు. ఎవరో వస్తుంటే అడిగాము. ఆయనా తెలియదన్నాడు. ఏం చేయాలో తోచలేదు. అప్పట్లో బస్సుస్టాండులో ఎటువంటి షెడ్డు సౌకర్యమూలేదు. జనసంచారం అంతగాలేదు. మాణిక్యాలరావు గారికి సహనం నశించి ఇంటికి తిరిగివెళ్లిపోదా మన్నారు. మరి కొద్దిసేపట్లో హైదరాబాదు నుంచి తెనాలి వెళ్ళే బస్సు వస్తుందని బోర్డుపై చూశాం. వెళ్ళిపోదామనుకుంటున్నంతో ఒకతోపుదు బండి వాడు అరటిపళ్లుతో వస్తూ కనిపించాడు. రేపు ఏర్పాటు చేసిన మెహెర్‌బాబా కార్యక్రమ నిర్వాహకులు గురించి అడిగేసరికి, వంకాయల వెంకయ్యగారిల్లా అన్నాడు.

అంతే వెంటనే పేరు అడ్రసు అన్నీ గుర్తొచ్చాయి. నా వెంటరండి. మా ఇంటి పక్కనే ఆయనిల్లు అని తీసుకువెళ్ళాడు. కొద్దిదూరం వెళ్ళగానే వారింటి సందువచ్చింది. ఇదే వారిల్లని, తలపు మూసివున్న ఇంటిని చూపాడు. తలుపు తట్టగానే వెంకయ్యగారు వచ్చి తలుపు తీశారు. మాటల సందర్భంలో జరిగింది చెప్పగా, అరటి పళ్ళు అమ్మేవక్తి మా ఇంటి పక్కన ఉండటమేమిటి మా బజారంతా వ్యాపారస్తుల ఇళ్ళేనంటూ బయటకు వచ్చి చూస్తే బండి, బండివాడు కనిపంచలేదు. అప్పుడర్థమైంది. అది బాబా సహాయమని.

# భగవంతుడు - జగత్తు

సాధారణ మానవులు ఈ జగత్తులో దాని ఆకర్షణలకు మోహితులై చిక్కుకుంటున్నారు. నిజానికి జగత్తంతా కేవలం భగవంతుని యొక్క నీడే కాని యధార్థం కాదు. సర్వాన్ని పరిసమాప్తం చేసేది దైవం. ప్రతిదాన్ని మలిచేది దైవం. అటువంటి దైవాన్ని అనుభవానికి తెచ్చుకోవటమే ఈ మానవ జీవితపు ముఖ్యోద్దేశ్యము. దీనిని మన ప్రాపంచక విధులను నిర్వర్తిస్తూనే సాధించవచ్చును. తీవ్రమైన కార్యక్రమాల్లో మునిగినప్పటికీ వాటిని గురించి పట్టించుకోకుండా, అట్టి కర్మలన్నీ ప్రియతమునికే అర్పించుకుంటూ చేయాలి.

ప్రతి మానవుడు జీవిత లక్ష్యాన్ని చేరేందుకు 84,000,00ల జన్మలు ఎత్తాలని బాబా చెప్పారు. ఈ క్రమంలో మానవుడి సగటు జీవిత ప్రమాణం నూరేళ్ళ లోపేనని లెక్కకట్టుకుంటే, ఇట్టి ప్రతి జీవిత కాలము కేవలం ఏడు నిమిషాల భాగంగా సరిపోతుంది. ఈ విధంగా గడిపే ఈ ఏడు నిమిషాల సమయాన్ని దైవము గురించి ఆలోచించేందుకు ఆయన్ని సేవించేందుకు, వినియోగిస్తే మనం పొందే లబ్ధి మాటలకందని అమూల్య నిధి అవుతుంది. అందుకే దైవనామ స్మరణలో గడిపే ప్రతిక్షణం, ఎంతో విలువైనదని, ఆయన్ని గురించి చేసే ప్రతి ఆలోచనా ఎంతో ప్రాముఖ్యమైనదని బాబా చెప్పారు. దైవచింతనకు చెందిన ప్రతి ఆలోచనా, ప్రతి చర్య, ప్రతిమాట, ఈ జీవితాన్నే కాక, రాబోయే జీవితాన్ని కూడా మలిచి దైవ సన్నిధికి చేరువయ్యేట్లు సహాయపడతాయి.

బాబా నామస్మరణతో గడిపే ప్రతిక్షణం ఆయన స్మరణ లేకుండా అన్వేషించే నూరేళ్లతో సమానమని బాబా చెప్పారు. హృదయపూర్వకంగా ఎరుకతో సర్వము మన ప్రియతమునికి అర్పించుకోగలిగితే ఆయనకు నిజమైన ప్రేమికులముగా మారతామని, ఆయనకు పాత్రులమవుతామని బాబా చెప్పారంటే

ధానర్థం ఆయన సేవకు అంకితమైతే మనం పొందే ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సూచిస్తుంది. పునర్జన్మ క్రమంలో యుగ యుగాలుగా రాత్రిళ్లు నిద్రపోయి మరలా ఉదయాన నిద్రలేస్తున్నట్లు ఎప్పటి కప్పుడు ఏదో ఒక కొత్త సాధకములో కొత్తగా మేల్కొంటూ దానిని నడపటం నేర్చుకోవటం, మళ్లీ కొన్నాళ్లకు దానిని వదిలేసి, మరో కొత్త వాహనాన్ని ఎంచుకొని, దానిని నడపటాన్ని మళ్లీ నేర్చుకోవటమనేది అంతుబట్టని రహశ్యంగా మిగిలిపోతోంది. ఎప్పటికప్పుడు అదే ఒక కొత్త జన్మగా భావిస్తూ, నిరర్థకమైన సాధనలను చేస్తూనే ఉన్న మనల్ని ప్రియతమ బాబా "అత్యంత అల్పమైన ఈ జీవిత కాలాన్ని సద్వినియోగపరచేట్లు మనల్ని తయారు చేసి ఇది ఒక శిక్షణాకాల అనుభవంగా మన మేల్కొలపటమే తన అవతార మంత్రాంగమని చెప్పారు.

నా విషయానికి వస్తే నేను మెహెర్ బాబా ప్రేమ పరిధిలోకి రావటం అనూహ్యంగా జరిగిపోయింది. 1954లో మెహెర్ బాబా ఆంధ్రా టూరు సందర్భంగా ఫిబ్రవరి 21న విజయవాడ వచ్చారు. అప్పట్లో ఎస్.ఆర్.ఆర్. కాలేజీలో చదువుతున్న నేను, ఇప్పుడు 'క్షేత్రయ్య కళాక్షేత్రం ఉన్న చోట జరిగిన బ్రహ్మాండమైన ప్రజాదర్శన కార్యక్రమంలో బాబాను తొలిసారిగా దర్శించి, స్వయంగా అందించిన అరటిపండు ప్రసాదాన్ని అందుకున్నప్పటికీ 1966 నాటికి గాని ఆయనకు సర్వార్పణ అయ్యే అదృష్టం కలగలేదు. "నన్ను హృదయపూర్వకంగా గుర్తుంచుకో. నా నామాన్ని హృదయ పూర్వకంగా స్మరించు. నా కార్యక్రమాన్ని నిర్వహించు" అంటూ 1967లో ప్రియతమ బాబా పంపిన టెలిగ్రాం నాలో చైతన్యాన్ని తట్టిలేపి, ఆయన సేవకు పూర్తిగా అంకితమయ్యేట్లు చేసింది.

ఉద్యోగరీత్యా అప్పట్లో నేను నూజివీడులో ఉండటంతో నూజివీడు పరిసర గ్రామాలలో బాబా నామ వ్యాప్తికై ఎన్నో వినూత్న కార్యక్రమాలు నిర్వహించే అదృష్టం నాకు దొరికింది. క్రమంగా బాబా సత్యప్రేమ సందేశ వ్యాప్తిలో ప్రసంగాలు, కరపత్ర ప్రచురణలు చేయటం మొదలు పెట్టాను. అచిరకాలంలోనే గ్రంథ రచనలను పురికొల్పబడ్డాను. నా తొలి గ్రంథా[illegible] సందర్భంగా బాబా ఆశీస్సులందిస్తూ 21-9-1968న ఒక సందేశం పంపారు. "అవతారుడి చరిత్ర వ్రాయాలన్నా, ప్రసంగించాలన్నా, పెనుతుఫానులో అల్లకల్లోలంగా ఉన్న సముద్రంలో ఈత నేర్చుకొనుటకు ప్రయత్నించటం వంటిది. సంకల్పం నాదై ప్రేరణ నాదైతే వ్రాసేది, వ్రాయబడేది కూడ్నా నేనే అవుతాను. నీకు నా ఆశీస్సులు - మెహెర్ బాబా" ఈ విధంగా 1968 నుండి బాబా

నామాన్ని భిన్నమార్గాల్లో ప్రజల దృష్టికి తెచ్చే ప్రయత్నాల్ని ఒకవైపు ఉద్యోగ ధర్మాన్ని ఆచరిస్తూనే, కొనసాగించే అవకాశాన్ని బాబా నాకు ఇచ్చారు.

అవతార్ మెహెర్ బాబా ఆంధ్రా సెంటరుతో పాటు అవతార్ మెహెర్ పత్రికా నిర్వహణలో కూడా బరువైన బాధ్యతలు నిర్వహించే అదృష్టం కలిగిన నాకు 1992లో నా పదవీ విరమణానంతరం నా జీవితంలో మరో కొత్త ఘట్టం చోటు చేసుకున్నది. పూర్తి కాలాన్ని బాబా సేవకే అంకితం చేసుకొని, ఆయన ప్రేమలోనే గడుపుతూ రాష్ట్రంలో అనేక సెంటర్లలో జరిగే బాబా కార్యక్రమాల్లో పాల్గొంటూ నాకు దొరికిన అమూల్య నిధిని సాటివారి మధ్య పంచే ప్రయత్నం చేస్తున్నాను. బాబా దూతగా అన్ని సెంటర్లతో సాన్నిహిత్యాన్ని పెంచుకొనే అవకాశం బాబా కృపవల్ల నాకు దొరికింది. ప్రియతమ దైవంగా మెహెర్ బాబా పైనే పూర్తి విశ్వాసమును ఉంచి, నా పదవీ విరమణానంతర శేష జీవితాన్ని నా ప్రియతమునికి అర్పించుకొని బాబా సేవా కార్యక్రమాలకు అంకితం కావటమనేది బాబా ఇచ్చిన వరం, కనుకనే అనారోగ్యం సైతం నన్ను అడ్డుకోలేక పోతోంది. బిల్.లీ.పేజి, స్టీవ్‌క్లీన్, మెకాయి, డా॥ ఆనే, డా॥ భరూచా, జి.ఎస్.ఎన్. మూర్తి, పుకార్, సి.డి. దేశ్‌ముఖ్, ఆది. కె ఇరానీ, ఆలోబా, జాల్.పి. దస్తూర్, బాలనాటు, ఎరుచ్, బావూకల్చూరి, మధుసూధన్ పూండ్ తదితరులు మన రాష్ట్రంలోను మెహెరాబాదు, మెహెరాజాదులలో చేసిన ప్రసంగాలకు తెలుగులో అనువదించే సదవకాశం నాకు పలు పర్యాయాలు బాబా కల్పించారు.

ప్రేమ అతి రహశ్యమైనది. దీనిని గురించి తెలుసుకొనుటకు సహాయ పడేందుకు గురువు తన కరుణను బహిర్గత పరచటంలో కఠినంగా వ్యవహరిస్తాడనుట ముమ్మాటికి నిజం. 1994 ఫిబ్రవరిలో సో॥ మధుసూధన్ సుభద్ర దంపతులు సో॥ ఎం.బి.జి. శాస్త్రి బృందంతో కలిసి ఆంధ్రాలో పర్యటించారు. వారితోపాటు నేనూ విజయవాడ నుండి కాకినాడ వరకూ జరిగిన అనేక సెంటర్ల కార్యక్రమాల్లో వారం రోజులుపాటు అనువాదకునిగా పర్యటించాను. ఫిబ్రవరి 13న నూజివీడు తిరిగి వచ్చాను. ఫిబ్రవరి 14న విజయవాడ ఆకాశవాణి కేంద్రం ద్వారా బాబా జన్మదిన సందేశాన్ని ప్రసంగించేందు కనువుగా రికార్డింగు చేసే ఏర్పాటు నిమిత్తం విజయవాడ వెళ్లాల్సి వచ్చింది. ఆనాటి జన్మదిన కార్యక్రమంలో విజయవాడ సెంటరులో మా శ్రీమతితో పాటు పాల్గొన్నాను. రాత్రి 10-00ల ప్రాంతంలో హఠాత్తుగా గుండెపోటు వచ్చింది. నా కుమారుడు స్వయంగా డాక్టరైనందున తక్షణం హాస్పిటలుకు తరలించి వైద్య సదుపాయం కల్పించాడు. అయినా పరిస్థితులు డాక్టరుల చేయిదాటి పోయింది.

శారీరక, మానశిక బాధల్ని మనకు భగవంతుడిచ్చే నజరానాగా వినయంతో స్వీకరిస్తే, అది శాశ్వత ఆనందానికి దారితీస్తుందన్న బాబా అభయం నాకా సమయంలో గుర్తొచ్చింది. బాబా.... బాబా..... అంటూ బాబా నామస్మరణ బిగ్గరగా చేస్తున్నాను. పరీక్ష బల్లపై పడుకోబెట్టిన నా శరీరంపై పరీక్షలకై అనేక వైర్లు బిగించారు. ఇ.సి.జి. తదితర పరీక్షలు జరుగుతున్నాయి. మరో మెషిన్ హృదయ స్పందనను చూపెడుతోంది. అంతలోనే హృదయ స్పందన క్రమంగా క్షీణించటం క్షణాల్లో జరిగిపోయింది. పెద్ద పెద్ద ఆవలింతలు రాసాగాయి. ఊపిరి ఆడటం లేదు. అయినా, ప్రతి అవలింత కాగానే "బాబా" అని అరిచేస్తున్నాను. నా అంతరాంతరాల్లో నాకు అంతిమ సమయం వచ్చిందన్న స్పృహ కలుగుతోంది. పరీక్షిస్తూన్న డాక్టర్లు నా అవస్థను ఆశ్చర్యంతో గమనిస్తున్నారు. నా ఏకైక కుమారుడు డా॥ జి.వి. పూర్ణచందు వడిలో నా తలనుంచి తుదిశ్వాస విడవాలన్న కోరిక కలిగి, డా॥ రావుగారితో చెప్పాను. మా అబ్బాయి వచ్చేలోపే, నా హృదయ స్పందన ఆగిపోయింది. ఆ తర్వాత ఏం జరిగిందో తెలియదు.

ఇంటి నుండి బయలుదేరే ముందు, నాభార్యకు, కానీ నా కోడలుకి గాని నా గుండెపోటు గురించి చెప్పకుండా హడావిడిగా బయలుదేరి రావటం వల్ల, ఇప్పుడు తన తల్లికి ఏం సమాధానం చెప్పాలా అన్న వ్యధతో నా కుమారుడు మదనపడుతున్నంతలో డాక్టరు గారు నా శరీరానికి అమర్చిన పరికరాలు ఊడతీసే ప్రయత్నం చేశారు. సరిగ్గా అదే సమయంలో ఆయన నాలో చైతన్యం పునరుత్పత్తవుతోందని గమనించారుట. చలనం ప్రారంభమయ్యే సరికి ఆగిపోయిన పరికరాలన్నీ కదలసాగాయి. ఒక అద్భుతమైన తేజస్సు నా ముందు ప్రత్యక్షమవుతున్న అనుభవం నాకు కలిగింది. ఆ కాంతి పుజం ఎక్కడ నుంచో నా ముందుకు దూసుకువస్తున్నట్ల నిపించింది. అప్పుడు నాలో పెల్లుబికిన నునువెచ్చని ఆనందానుభవాన్ని వివరించేందుకు మాటలు చాలవు. అత్యద్భుతమైన ఆ తేజఃపుంజము, నాలోనూ, నా చుట్టూ కూడా అలుముకున్నట్లని పించటంతో పాటు అనూహ్యామైన నాదమేదో వినిపించింది. నేను ఆసుపత్రిలో బల్లమీదున్నట్లు గాని, నాకేవో పరీక్షలు జరుగుతున్న ఎరుకగాని, నాకు కలగ లేదు. గల గలమంటున్న ఆ దివ్య నాదంలో బాబా రూపం తప్ప మరేమీ కనిపించలేదు. విడవకుండా బాబా నామాన్ని స్మరించుట మాత్రం గుర్తున్నది. మూడురోజులు ఇన్‌టెన్సివ్ కేర్‌లో ఉంచారు. తరువాత పదిరోజులు మెడికల్ కేర్‌లో అసుపత్రిలోనే ఉన్నాను.

డాక్టర్ల వైద్యం కంటే, బాబా నామస్మరణే వేగంగా స్వస్థతను చేకూర్చిందన్న

అనుభవము కలిగింది. కోరుకోకుండా వచ్చే భాదల్ని దైవమిచ్చే ఆశీర్వచనంగా తీసుకోమన్న బాబా సందేశం నాకొక మేలుకొలుపు నిచ్చి పూర్తిగా ఆయన ఇచ్ఛకు అర్పితమై, బాబాను సేవించుకుంటూ ఆయన కొంగును పట్టుకొనేట్లు సహాయపడిందని ఆశిస్తున్నాను.

# అహంకార నిర్మూలన

మెహెర్ బాబా తాను దేవుడ్ని అని చెపితే బహుకొద్ది మందే నమ్మారు. మరి ఎక్కువ మంది ఎందుకు విశ్వశించలేదు ? మనకు నోటి భాషే తెలుసు హృదయ భాష తెలియదు. ఈయన మీనాన్న అని చెపితే ఆయనే మా నాన్న అని ఈమె మీ అమ్మ అని అంటే, ఆమే మా అమ్మ అని, అలాగే తాను వారబ్బాయని తెలుసుకుంటున్నాము అలాగే ఆ తల్లిదండ్రులు కూడా తమ బిడ్డగానే చూస్తారు. మరి మెహెర్ బాబా కూడా తానే మన తల్లి తండ్రి అని మనమంతా ఆయన బిడ్డలమని చెప్పారు కదా ! అటువంటప్పుడు మనమెందుకని నమ్మలేకపోతున్నాం? ఇక్కడ అహం అడ్డువస్తోంది. మనస్సు వల్ల, అజ్ఞానం వ... ఈ సత్యాన్ని తెలుసుకోలేకపోతున్నాం. మాయ కారణంగా మన తల్లితండ్రుల్ని నమ్మినంత తేలిగ్గా బాబాను నమ్మలేకపోతున్నాం.

అందుకే అందరికోసం వచ్చిన తండ్రిగా మెహెర్ బాబా తనతో మనకు ప్రత్యక్ష సంబంధాన్ని కల్పించేందుకు చక్కని మేల్కొలుపులెన్నో ఇచ్చారు. హృదయాంతరాళాల్లోంచి పెల్లుబికే ఆర్తి ప్రియతముడ్ని ఆనందపరుస్తుంది. అహం తుడుచుకుపోతేనే ఈ ఆర్తి అలవడుతుంది. హృదయార్తి లేకుండా చేసుకునే వేడికోలును బాబా పట్టించుకోరు. "నన్ను ప్రేమించే వారి కోసమే నేనున్నాను. నన్ను ప్రేమించే వారు నాకు గురుతుల్యులు" అని బాబా ప్రవచించారు. తన యడల అచంచలమైన పరిపూర్ణ విశ్వాసాన్ని పెంచి, తన ఇచ్ఛకు పూర్తిగా అర్పణమ్యేట్లు చేస్తే బాబా విధానం, అపురూపమైంది.

ఒకసారి బాబా పూనా గురు ప్రసాద్‌లో దర్శనం ఇస్తున్నారు. సో॥ మధుసూధన్, సుభద్రలు అతి మధురంగా అవతారుడిని కీర్తిస్తూ పాటలు పాడి శ్రోతలందరిని మైమరిపించారు. వారు పాడిన ప్రతిపాట తమ హృదయార్తిని విన్నవించింది. "మెహెర్ ఏకం" అనే పాటలో సాహిత్యపు విలువలేవీ లేకపోయినప్పటికీ అది హృదయ భాషతో నింపబడింది. భక్తితత్వం అసాంతం నిండిపోవటం వల్ల అది పరిమితులు లేని హృదయ భాష అయింది. స్వర రచన,

సాహిత్య ప్రయోగం కాక, హృదయాంతరాళాల్లోంచి పెల్లుబికిన ఆర్తి ప్రియతముడ్ని ఆనందపరచింది.

ఆ మరుసటి రోజున మరో గాయకుడు బాబా సమక్షంలో సంకీర్తన చేస్తున్నాడు. కంఠ స్వరం అద్భుతంగా ఉన్నది. చక్కని సాహిత్య రచన చేసి మధురంగా పాడుతున్నాడు. అతడు పాడుతున్నంతసేపూ బాబా రెండు చెవులూ గట్టిగా పలుమార్లు మూసుకోవటం జరిగింది. సభా సదుల నుండి కూడా స్పందన కరువైంది. స్వరకల్పనలోనూ, సాహిత్య పరంగా రచనలోనూ, పద నిర్దేశంలోనూ తప్పులుండటంతో బాబా, ఇతడు పాడిన ఆ పాటను కాగితం పై వ్రాయించుకొని, స్థానికంగా ఉన్న సంగీత కళాశాల ప్రొఫెసరు దగ్గరకు తీసుకుకువెళ్లి, ఆ పాటలోని తప్పులను దిద్దించుకు రమ్మని బాలనాటును పంపారు.

బాబా ఆదేశంపైన బాలనాటు, ఆ ప్రొఫెసరును కలసి, చాలా స్వరాల్లో దొర్లిన తప్పులను సరిదిద్దించుకున్నాడు. తప్పులు సరిదిద్ది ఇస్తూ ఆ ప్రొఫెసరు, ఈ పాటలోని భావం హృదయంలోంచి రాలేదు. ఇందులోని భాష హృదయంలోంచి రాలేదని ఇది హృదయ భాష కాదని కూడా చెప్పాడు. ఇదే విషయాన్ని బాలనాటుగారు బాబా వద్దకు వచ్చి, తెలియపరిచాడు. బాబా ఆ గాయకుడిని పిలిపించి అతని పాటలోని తప్పులను దిద్దించటమే కాకుండా, అతనిలో గూడుకట్టుకున్న అహమును కడిగివేసి, హృదయాంతరాళం నుండి ఆర్తిని పెల్లుబికేట్లు, అతడిని తీర్చిదిద్దారు.

## మెరిసేదంతా బంగారం కాదు

బాబా సేవలో ఎటువంటి బంధాన్ని పెట్టుకోరాదు. ముందుగా ఆయన అవతారుడన్న ఆధ్యాత్మిక స్థాయిని అనుభవించాలి. అక్షరాలు దిద్దకపోతే భాషను ఎలా చదవలేమో అలాగే అవతారుడ్ని అర్థం చేసుకోకపోతే ఆయన్ని ప్రేమించలేము. ఆయనకు కావలసింది ప్రేమ. ఆయన మనకిచ్చేదీ ప్రేమే. భోగభాగ్యాలు, సుఖ సంతోషములు వంటివేవీ ఈ ప్రేమకు సాటిరావు.

1939 జనవరిలో బాబా ఉత్తర భారతంలో పర్యటిస్తున్నారు. జనవరి 10న జబల్పూరులో బాబా దర్శన కార్యక్రమం జరుగుతోంది. ఆ రోజున కేవలం స్త్రీలను మాత్రమే ఆ సమావేశానికి అనుమతించారు. పురుషులెవరినీ అనుమతించనందున, బాబా తన అక్షర ఫలకంపై అందించే సందేశాల్ని ఛాన్జీకి బదులుగా సో॥ మణీ చదవాల్సి వచ్చింది. ఆ రోజున ఉదయం 7-30లకు

మొదలైన దర్శన కార్యక్రమాన్ని ఆపకుండా సాయంకాలం చీకటిపడే వరకూ కొనసాగించాల్సి వచ్చింది. ఒకరి తర్వాత ఒకరు, వరుస క్రమంలో వచ్చి బాబా దర్శనం చేసుకోవటం కొనసాగింది. భోజనం వేళ మించిపోవటంతో ఛాన్జీ, "బాబా! ఏం తొందర ముంచుకు పోయింది ? కాసేపు ఈ దర్శనాన్ని భోజనం చేసేందుకు ఆపరాదా ?" అని ఒకామెతో కబురు పంపాడు. ఈ సలహాకు ప్రతిస్పందించిన బాబా "కేవలం ఈ అదుర్దాతో కూడిన వాతావారణంలోనే, నా పని పూర్తవుతుంది. ముఖ్యంగా శుభ్రపరచటం, ఊడ్చివేయటం, వంటి కార్యక్రమం దిగ్విజయంగా నెరవేరుతుంది" అంటూ తనదైన, నిగూఢ పదములతో బదులు పంపారు.

అంతలో ఆలీ అక్బరు అనే ఒక డిప్యూటీ సూరింటెండెంటు ఆఫ్ పోలీసు చాలా కంగారుపడుతూ వచ్చి తన కుమారుడు జబ్బుచేసి ఆసుపత్రిలో ప్రమాదంలో ఉన్నాడని, కరుణతో వాడిపై తన నజరును ప్రసరింప చేయమని బాబాను వేడుకున్నాడు. అతడిని బాబా ఓదారుస్తూ "విచారించకు ! వాడు భాగుపడుతాడు. నేను వానిపై నా దృష్టినుంచాను" అని తన అభయాన్నందిచారు. ఈ అవకాశాన్ని తీసుకొని చాన్జీ భోజనానికి లేవమని మరల కోరే సరికి అతని కోరికను మన్నించి బాబా దర్శనాన్ని ఆపి, భోజనానికి లేచారు.

భోజనం పూర్తవుతుండగా మాండ్లా నుండి మహేంద్రలాల్ చౌదరి అనే బాబా ప్రేమికుడు బాబా దర్శనానికై వచ్చాడు. అతనితో పాటే మరో ప్రేమికుడు ఫాతక్ ప్లీడరు కూడా వచ్చాడు. ఈయన ఇంతకు ముందొకసారి బాబా తన ఆశ్రమాన్ని మాండ్లాలో స్థాపించుకొనుటకు అనువుగా తగినంత స్థళాన్నిచ్చేందుకు ముందుకు వచ్చి, బాబాను మండ్లాకు తీసుకువెళ్లి స్వయంగా అజాగాను చూపించాడు. అయితే స్థళాన్ని పరిశీలించిన మెహెర్ బాబా అతడికెటువంటి హామీని ఇవ్వలేదు. మరిప్పుడు అధిక సంపన్నుడైన మహేంద్రలాల్ చౌదరి వచ్చి, తాను తన ప్రభువుకు ఒక చిరు కానుకను సమర్పించ దలచుకున్నానని, ప్రేమతో స్వీకరించమని వేడుకున్నాడు. "ఏమిటా బహుమతి ?" అని ఏమీ ఎరుగనట్లు అమాయకంగా బాబా ప్రశ్నించారు. మాండ్లాలోని సర్క్యూట్ హౌస్ వెనుక 2000 మామిడి చెట్లున్న తన వందెకరాల మామిడితోట అని చౌదరి బదులిచ్చాడు.

"నాకు కావలసింది ప్రేమ మాత్రమే - దక్షిణ కాదు. నేను కోరేది భౌతిక ప్రసాదనైవేద్యం కాదు. ఎవరైనా సరే ఇవ్వతగిన అత్యున్నతమైన బహుమానము

పరిశుద్ధమైన ప్రేమ దక్షిణ మాత్రమే" నని బాబా అతనికి వివరించారు. అయినప్పటికీ చౌధరీ, ఫాథక్ లిరువురూ వదలక, ఈ బహుమతిని అంగీకరించి స్వీకరించమని ప్రార్థించారు. దానిపై రెండు గంటలపాటు సుదీర్ఘ చర్చ జరిగింది. చివరకు మెహెర్ బాబా ఆ ఆస్తిని అంగీకరించారు. దాంతో పరమానంద భరితుడైన ఛౌదరి, తన దక్షిణను చిరుకానుకగా బాబా అంగీకరించినందున తానెంతో ఆనంద భరితుడనయ్యానని, తన ప్రభువు తనకా శీస్సులందించినట్లను కుంటున్నానని, తనపై బాబాకు ఉన్న ప్రేమకు ఇది చిహ్నముగా భావిస్తున్నాని విన్నవించుకున్నాడు. మాండ్లాకు వచ్చి తన పతిపావన పాదస్పర్శతో పునీతం చేయమని వేడుకున్నాడు.

ఆ మర్నాడు జనవరి 11వ తేదీన బాబా తన పరివారంతో మాండ్లా వెళ్లారు. చౌదరి సమర్పించిన అందమైన మామిడితోటను సందర్శించి అమితానంద పడ్డారు. ఒక మామిడి చెట్టు క్రింద అర్ధగంటసేపు కూర్చున్నారు. అప్పుడు బాబా ఇలా వ్యాఖ్యానించారు "నేను అనంతంగా వృద్ధుడినైపోయాను. కానీ ఇప్పుడు మీ మధ్య నేను నవ యువకుడినయ్యాను. ఈ జాగా అంతా అతి పురాతనమైన నా చోటు" అంటూ చౌదరి, పాదక్ల వైపు క్రీ గంట చూస్తూ "ఇక్కడ నా పాత మిత్రులు, చాలా ప్రాచీనమైన పాత మిత్రులు ఉన్నారు......" అని చెప్పి, తనతో వారికున్న గత సంబంధాల్ని మాత్రం వెల్లడి చేయలేదు. మధ్యాహ్నానికి జబల్పూర్ తిరిగి వెళ్లిపోయి, చట్టప్రకారం ఆ ఆస్థిని బదులాయింపు చేసే ఏర్పాట్ల బాధ్యతను జాల్‌కేరావాలాకు అప్పగించారు.

# మస్తుల కార్యక్రమం

బాబా జీవిత ఘట్టంలో మస్తులతో ఆయన చేసిన కార్యక్రమం అత్యంత ప్రధానమైనది. ప్రతివారూ దైవ ప్రేమికులు కాలేరు. దైవ ప్రేమికులైన వారు భగవంతుని యందున్న ప్రేమతో దహించుకుపోతారు. ఆ విరహ బాధలోనే ఆనందాన్ని అనుభవిస్తూ మునిగిపోతారు. ఆధ్యాత్మికంగా పురోగమించాలన్న ఆలోచన గాని, తన ప్రియతమునితో వేరుగా ఉన్నామని గాని, ఆయనలో ఐక్యం కావాలన్న కోరికగానీ ఏవీ ఉండవు. ఆ ప్రేమలో ఉన్మత్తులై శరీర ఉనికినే మరిచిపోతారు. వీరినే మస్తులంటారు. ఒకసారి బాబా తనకు ఏది ఇష్టమో చెపుతూ "నాకు అమితమైన ఇష్టం - మస్తుల సాంగత్యం, మరియు చిన్న పిల్లల సాంగత్యం - నేను మస్తుల్ని వారి బలాన్ని చూచి, పిల్లల్ని వారి అమాయకపు

నిస్సహాయతను చూచి ప్రేమిస్తాను. మస్తులు తమకు భగవంతునియందున్న ప్రేమ జ్వాల చేత ప్రియతమునికే ఒక సవాలుగా నిలుస్తారు" అని వివరించారు.

మస్తులతో బాబా జరిపే ఏకాంత కార్యక్రమం గురించి ఎన్నడూ ఎవరికీ వివరించలేదు. వారు తనను ప్రేమిస్తున్నారని, తానూ వారిని ప్రేమిస్తున్నానని, తాను వారితో కలిసి గడిపే కొద్ది క్షణాల సమయం వారికీ తనకూ కూడా లాభదాయకమేనని చెప్పారు. ఒక రకంగా దీని భావాన్ని అవగాహన చేసుకుంటే, సాధారణ మానవుడు జీవితమంతా తన శరీర పోషణ గురించే తపిస్తాడు. తన మనస్సంతా తన శరీరరము గురించే, పని చేస్తుంది. దీని గురించిన అన్ని జాగ్రత్తలు తీసుకోవటం, అన్న పానియాలతో పెంచి పోషించటం, వాటి సంపాదనకై పడే తాపత్రయంలో శరీస్మృతితోనే చేస్తూ తన ధ్యాసనంతా శరీరంపైనే కేంద్రీకరిస్తాడు. మస్తులు ఇందుకు భిన్నంగా తమకున్న జ్ఞానాన్నంతా భగవంతుడ్ని ప్రేమించటంపైనే ఉంచుతారు కనుక, దీనిని మనకు ఆదర్శంగా చూపి, మనలో జ్ఞానోదయమయ్యేట్లు మేల్కొలపటం కూడా ఒక భాగం కావచ్చనిపిస్తుంది.

బాబా ఆశేతు హిమాచల పర్యంతరం పర్యటించి, మస్తు అన్వేషణ జరిపి, ఈ మస్తుల కార్యక్రమాన్ని నిర్వహించారు. 20000 మంది మస్తుల్ని 25000 మైళ్ల కాలినడకన, ఎడారుల్లో, దట్టమైన అడవుల్లో, పర్వతాలు, లోయల్లో సైతం వెదికి ఆ మస్తుల్ని గాలించారు. ఒంటెలు, గుర్రాలు, చివరకు గాడిదలపై సైతం ఎక్కి స్వారీ చేస్తూ ఈ అన్వేషణలో పాల్గొన్నారు. కాలిబాటల్లో, ఎడ్లబళ్ల మీద టాంగాల్లోనూ, మైలు మైలుకూ ఎక్కుతూ దిగుతూ, తిరుగాడారు. రాత్రింపగళ్లు, ధూళి దూసరితమైన మూడవ తరగతి రైలు పెట్టెల్లో క్రిక్కిరిసిన ప్రయాణీకుల మధ్య నిలబడుటకు కూడా సందు లేకపోయినా ఎంతో హైరానా పడి పర్యటించిన సందర్భాలెన్నో ఉన్నాయి. మస్తులు ఏ పొదలమాటునో ఉండి ఒక పట్టాన దొరికేవారు కారు. గ్రామాల్లో, పట్టణాల్లో కూడా ఎదురుగా కనిపించేవారు కారు.

బైదిలు, కాకా బారియా, ఎరుచ్‌లు ఈ మస్తుల వేటలో నిష్ణాతులు. ఒక మంచి మస్తును అరుదుగా లభించే అపూర్వ నగ వంటివాడని బాబా అనేవారు. స్థానికంగా మహనీయులని పేరు పొందిన వారిని కలిసి, వారు అసలైన మస్తులుగా భ్రమసి బాబా దగ్గరకు శిష్యులు తీసుకు వస్తే, వారు వట్టి పిచ్చివారని చెప్పి తిప్పి పంపించేవారు.

1930లో మెహెరాజాదులో బాబా ఒక పిచ్చివారి ఆశ్రమాన్ని నడిపారు. ఇది మస్తు ఆశ్రమం కాదు. ఇందులోని వారంతా పిచ్చివాళ్లే, ఈ పిచ్చి

వాళ్లందరిలో మరీ ఎక్కువ పిచ్చి ఉన్న వాడిపేరు ఫకీరుబువా. మెరిసేదంతా బంగారం కాదని బాబా తరుచూ చెప్పేవారు. ఈ ఫకీరుబువా అలాంటి మెరిశే బంగారం లాంటివాడు. ఇతనిలాగానే గురువులు, యోగులుగా చలామణి అవుతున్న కొందరి గురించి ప్రస్తావిస్తూ ఒక సారి బాబా ఇలా ప్రవచించారు.

"దారి తప్పకండి. మెరిశేదంతా బంగారం కాదు. కనుక నిజాయితీగా ఉండండి. నేను నా ప్రేమికుల ప్రేమకు బానిసను. గురువులుగా చలామాణి అవుతున్న వారు కొందరున్నారు. వాళ్లు ఉత్తరాలు వ్రాస్తూ నాకు కూడా ఆశీస్సులందిస్తారు. దైవ జీవితాన్ని అనుభవంతో గడపటం వేరు. మాయా జీవితంలో నటించటం వీరిసొత్తు. నిర్వికల్ప సమాధి వేరు. యోగ సమాధి వేరు. నిర్వికల్ప సమాధిలోని వారు దేవునిగా నియుక్తమైన వారు. సద్గురువు యొక్క "నేను భగవంతుడను" అనే స్థితిని అనుభవిస్తారు. కానీ యోగ సమాధిలో ఉన్నవారు, మంత్ర తంత్రాలతో వివిధ రకాల యోగాల్ని తెలుసుకొని చురుకుగా అభ్యాసం చేసినప్పుడు, అద్భుత శక్తులు కలగవచ్చును. అటువంటి వారు అన్న పానీయాలు ముట్టరు. నిద్రపోరు. కొన్ని వందల సంవత్సరాల నుండి యోగ సమాధిలో ఉన్న ముగ్గురు యోగులు ఇప్పుడున్నారు. వారికి కనురెప్ప, వెంట్రుకల కనుబొమ్మలు, బారుగా పెరిగి ఉన్నాయి. బాగా బక్క చిక్కి ఉన్నారు. అయినా వారు నన్ను తెలుసుకోలేదు. నన్నెరుగకున్నారు" అని చెపుతూ పిచ్చివారి ఆశ్రమం గురించి ప్రస్తావించారు.

"నేను ఈ పిచ్చివారి ఆశ్రమాన్ని మెహెరాబాదులో ఎత్తివేసినప్పుడు అందులో ఉన్న పిచ్చివాళ్లందరిని వారి వారి స్వస్థళాలకు పంపివేశాను. వారిలోని ఫకీర్ బువా అనే పిచ్చివాడిని పూనా పంపించాము. నా దగ్గర పని చేస్తున్న ఒక పనివాడు, నేను నా ఆధ్యాత్మిక భారాన్ని ఫకీరు బువాకు వప్పగించానన్న వదంతిని వ్యాపింప చేశాడు. దాని ఫలితంగా ఈ పిచ్చివాడు ఒక సద్గురువుగా చలామణి అయ్యాడు. జనం అతడ్ని సింహాసనంపై కూర్చోపెట్టారు. అతని దర్శనం కోసం జనం తండోప తండాలుగా ఎగడబాడ్డరు. అతని ప్రతి కదలిక, అద్వితీయమైన ఆశీస్సులుగా స్వీకరించబడసాగాయి. అతని కొరకు జనం విపరీతంగా డబ్బు ఖర్చు పెట్టారు. ఒక కారులో అతడ్ని కూర్చోపెట్టి, నగర సంకీర్తనతో ఊరేగించారు. అయితే యధార్థానికి ఫకీరుబువా పూర్తిగా ఒక పిచ్చివాడు. అందుకే, మీరు మెరిసేదంతా బంగారమని దారి తప్పకండి. నిజాయితీగా ఉండండి. నిజమైన అధికారం లేకుండా తనకు మ్రొక్కించుకొనే వారు తనకు మ్రొక్కే వారందరి సంస్కారాలను తీసుకొని ఇంకా పెంచుకుంటున్నాడు." అని బాబా హెచ్చరించారు.

బాబా ఏం చెప్పినా తన దైవాధికారంతో చెపుతున్నాననే వారు. మస్తులు భగవదావేశ పూరితులైన మహాత్ములు. వారు ఆనందానుభూతిలో తన్మయులై ఆంతరంగిక భూమికలలో చిక్కుకొని, జడస్థితిలో ఇరుక్కుపోతారు. వీరివలన మానవజాతికి ఎనలేని ప్రయోజనమున్నది. నిత్య జీవితములో సకల ప్రాణి కోటి రక్షణకై ఈ మస్తుల మనస్సులను మెహెర్ బాబా ఒక సాధనంగా ఉపయోగించారు. దైవ సాన్నిధ్యాన్ని చేరి పరమాత్మతో సూటిగా సంబంధం పెట్టుకున్నవారి ద్వారా, సహజంగా పరిమితమైన వాటితో సంబంధం పెట్టుకున్న సాధారణ మానవుడ్ని ఆ బంధాల నుండి బయటపడేట్లు చేయుటకు అతి నిగూఢమైన ఆధ్యాత్మిక కార్యక్రమాన్ని బాబా యీ మస్తుల ద్వారా మానవాళికి మహోపకారాన్ని చేశారు.

ఒక పర్యాయం మస్తు టూరులో 1939లో పయనిస్తూ జబల్‌పూర్ మకాంలో ఉన్నప్పుడు, మహ్మద్ మస్తును జబల్పూరుకు రప్పించారు. రోజూ బాబా స్వయంగా అతడికి స్నానం చేయించి, అన్నం తినిపించే వారు. సమీపంలో ఎవరినీ ఉండనిచ్చే వారు కాదు. ఏకాంత ప్రదేశంలో బాబా, ఆ మస్తు పక్కనే కూర్చొని తన పనిని, నిర్వహించేవారు. మహ్మద్ మస్తుకు వ్యక్తిగత సేవకుడిగా ఎరుచ్‌ని, నియమించారు. అతడి ఇష్టా ఇష్టాలకు అనుగుణ్యంగా అడిగినవి ఏర్పాటు చేయటం ఎరుచ్ విధి. అన్నంలోకి ఫలానా కూర కావాలని మస్తు అడిగితే ఆ కూరనేమార్కెట్టు నుండి ఎరుచ్ కొని తెప్పించేవాడు.

ఒకసారి మహ్మద్ మస్తుకు భోజనం తినిపిస్తుండగా తనకు బఠాణీల కూర కావాలని కోరాడు. పాపం ఎరుచ్ కూరల మార్కెట్టులో ఎంత ప్రయత్నం చేసినా బఠాణీలు దొరకలేదు. బఠాణీలు దొరకనందున, అతడికి వంట చేసే గయ్‌మాయి వేరే కూర వండింది. మహ్మద్ మస్తుకు బాబా స్వయంగా అన్నం పెడుతుండగా మస్తు నానా గోల చేసి "నా బఠాణీల కూర ఏది ? నా కూర ఎక్కడున్నది ? గమ్‌మాయి నేనడిగిన కూర ఎందుకు వండలేదు ? ఆమెని ఇక్కడకు పిలువు ?" అంటూ బాబా ముందు అరవసాగాడు.

బాబా ఆదేశం ప్రకారం ఎరుచ్ వెళ్లి గైమాయని తీసుకువచ్చాడు. బాబా ఆమెను మస్తుకు చూపిస్తూ, "ఈమే, యీ వేళ నీకు బఠాణీల కూర వండి పంపలేదు. అందుకోసం ఆమెను నేనిపప్పుడు దండించబోతున్నాను" అంటూ ఆమెను కొట్టబోతున్నట్లు చేతిని పైకెత్తారు. అప్పుడు మహమ్మదు మస్తు "వద్దు, వద్దు ఆమెను కొట్టబోకు బాబా. ఆమెను క్షమించి వదిలేయి. ఈ వేళ్టికి నేనేదో ఒకటి తింటాలే" అన్నాడు. అంతటితో సమశ్య సమిసిపోయింది. మహ్మద్

మస్తు కూడా సంతోషించాడు. బాబా యుక్తికి ధన్యవాదములు చెప్పాలి. సృష్టిలో జరిగే ప్రతికార్యము ప్రతి కదలికా మానవ సంక్షేమం కోసం, అవతారుడి అజమాయిషీలో జరుగుతుందని బాబా చెప్పారు. బాబా తన దివ్య ముఖార వింద పతిత పావన సముఖంలో మస్తు ద్వారా జరిగిన ఈ హాశ్య సన్నివేశం ద్వారా, విధేయతతో తన యెడల ప్రేమ కలిగి సేవించుకుంటున్న గయ్‌మాయికి ఎటువంటి ఆశీస్సులందించారో కదా ! బాబా కరుణ అపారము. బాబా ప్రేమైకమూర్తి. సాక్షాత్తు ప్రేమే, మెహెర్ బాబా కనుక మనమూ ప్రేమను మాత్రమే కోరాలి.

# మన కర్తవ్యం

భగవంతుడ్ని ప్రేమించటం కంటే మించిన కర్తవ్యం మరింకేముంది మనకు ? మెహెర్ బాబా ప్రేమ పరిధిలోకి వచ్చిన వారు తాము ఆధ్యాత్మిక పథంలో ముందున్నామని తలపోస్తే అది పతనానికే దారి తీస్తుంది. కనుక మనం చేయవలసింది. బాబాను ప్రేమించేందుకు ప్రయత్నించటం మాత్రమే. మనస్సును అదుపులో ఉంచుకొని, బాబా నామాన్ని స్మరించేందుకు, సదా ఆయన్ని తలచుకొనేందుకు, ఎవరికి వారు ప్రయత్నించవచ్చును. కానీ, ఈ సందర్భంలో బాబా చెప్పిన మాటలు మనకు ఆదర్శం కావాలి. "నా సత్య ప్రేమ సందేశాలను ప్రసరింప చేయాలనుకునే వారు ఒక విషయం గుర్తుంచుకోండి. నేనా పనిని మీ చేత చేయించక పోతే, మీరా పనిని చేయలేరు. ఏలననగా నా పనిని నేను తప్ప వేరెవ్వరూ చేయలేరు" అని అంటూ తన కార్యక్రమంలో పాలు పంచుకొనే మహద్భాగ్యాన్ని మనకు ప్రసాదించానన్నారు.

అలా బాబా ప్రేమనుపాలు పంచుకొనుటకు చేసే ప్రయత్నం వల్ల ఆయన సాన్నిధ్యాన్ని పొందకలిగేట్లు చేస్తుంది. తన ప్రేమలో ఎన్నెన్నో హృదయాలు ఒక చోట ఒనగూడితే తన కెంతో సంతోషమని బాబా తరచూ అంటూ ఉండేవారు. అందుకే ఆయన పేరు మీద మెహెర్ ప్రేమికులు తరచు సమావేశాలు ఏర్పాటు చేయడం, వాటిల్లో ఎందరో పాల్గొనటను బాబా ప్రోత్సాహపరచారు. ఈ సమావేశాలు ఏర్పాటు చేసే వారి కొరకు, లేదా సంఘం కొరకు గాక, మెహెర్ బాబా కోసమే జరుగుతున్నాయని, బాబా అక్కడ ఉన్నారన్న భావంతో ఎవరికి వారు పాల్గొనటం జరగాలి. అది వారి కర్తవ్యంగా గుర్తించాలి. బాబా అక్కడున్నారన్న భావం ఉండటం వల్ల, మనమాయన్ని సంతోష పెట్టడానికి

ప్రయత్నిస్తాము. ఇక్కడ ఆయన్ని సంతోష పెట్టడం ముఖ్యం కానీ, మధుర సంగీత ఝరిలో మునిగి రుచికర ప్రసాదాలను తిని మనకు మనం సంతోష పడటం ముఖ్యం కాదు.

"ఎక్కడ నలుగురు ఉండి నన్ను గురించి స్మరిస్తారో నేను అక్కడ ఉంటాను' అని బాబా అన్నారంటే, మనం మెహెర్ బాబా సెంటరుకు ఎందుకు వెళ్లాలో సూచించారన్న మాట. బాబా అంతటా ఉన్నారు. నలుగురున్నచోటే నేనున్నానని అన్నా రెందుకని ? ఇది ఒక విధమైన బాబా యొక్క బావైక్యత. బాబా అంతటా ఉన్నారు కనుక మా యింట్లోనూ ఉన్నారన్న భావంతో ఎవరికి వారు తమ ఇంట్లోనే ఆయన్ని సేవించుకోవచ్చును. అయితే పదిమందితో కలిసి పాల్గొన్నప్పుడు, అక్కడ అనేకమైన మనస్సులు చేరి పని చేయుటం మొదలుపెడతాయి. కలిసి పని చేయటమనేది మనస్సుకు ఉన్న స్వభావం కాదు. కలసి పని చేసే స్వభావం హృదయానిది. హృదయానికి దైవాన్ని ప్రేమించటం తప్ప ఇతర విషయాలేవీ పట్టవు. అందువల్ల అనవసరమైన ఇతర విషయాల వైపు పరుగులు తీయించే మనస్సును హృదయంతో కట్టిపడేసేందుకు మనకు తెలియకుండానే సెంటరు కార్యక్రమాల్లో పాల్గొనే ఒకటి, రెండు గంటల సమయం ఎంతగానో సహాయపడుతుంది.

బాబా మనలను తన ఎదుట పశి పిల్లలుగా మారమన్నారు కనుక స్వేచ్ఛగా ఇంట్లో ఉన్నట్లే, మసలే వాతావరణం మనకు బాబా సెంటర్లలో లభిస్తుంది. కర్మకాండలు, పూజా పురస్కారాల వంటి క్రమ శిక్షణాయుత నియమాలేవీ ఉండవు. తన ఇంట్లో తన ప్రియతముడ్ని పూజించేందుకు, ఆరాధించేందుకే వచ్చామన్న ఆలోచన మాత్రమే కలిగి మన హృదయాన్ని విప్పి ఆయనకు నివేదించుకొనే వీలు కలుగుతుంది.

ఆ రోజుల్లో బొంబాయిలోని మెహెర్ ప్రేమికులంతా కలసి, లెమింగ్టన్ రోడ్డులో మూడవ అంతస్థులో ఉన్న భవనాన్ని బొంబాయి మెహెర్ సెంటరు కోసం శ్రమించి సేకరించారు. షోరాబ్జీ ఆ సెంటరుకు అధ్యక్షుడుగా ఉండేవాడు. అంత ఖర్చును భరించి కష్టపడి సెంటరు స్వంత భవనాన్ని నెలకొల్పుకున్నా, జనం పెద్దగా వచ్చేవారు కాదు. వారానికి ఒక్క రోజు మాత్రమే జరిగే బాబా సెంటరు కార్యక్రమాలకు, ఎవరూ సరిగా హాజరు కాకపోవటంతో షోరాబ్జీ నీరుకారిపోయాడు. నిరాశతో బాబాను కలసి, జనం రాకపోవటాన్ని మొరపెట్టుకున్నాడు. అప్పుడు బాబా షోరాబ్జీకి చక్కని సందేశాన్నిచ్చారు.

"నీవు చెప్పినదంతా విన్నాను. నీవు ఒక విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి. నేను చెప్పేది జాగ్రత్తగా విను. నీవు వెంటనే మీ ఇంటికి తిరిగి వెళ్లిపో. ఇప్పటి నుంచి జరిగే కార్యక్రమాల్లో, జనం వచ్చారా లేదా అన్నభావాన్ని నీ మనస్సులోనికి రానీయకు. నీవు హాజరైనప్పుడు, నీతో పాటే నేను ఉంటాను. కనుక నీవు అక్కడ నన్ను చూడు. అంతేకాని జనం వచ్చారా లేదా అని ఆలోచించకు". అంటూ తన సెంటరులో తానుంటానన్న హామీని ఆనాడు షోరాబ్జీకి ఇచ్చినా ఈ హామీ అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ మనందరికీ చెప్పినట్లే. తప్పక నలుగురూ కలిసి తనను గురించి ముచ్చటిస్తూ తననే స్మరించే చోట ఆయన ఉండి మన మొరలాలకిస్తారన్నది వాస్తవము. అంతే కాదు మెహెర్ సెంటరు పవిత్ర ఆరాధనా క్షేత్రం. అది ఒక దివ్య దేవాలయం. బాబా యందు పరిపూర్ణ విశ్వాసము నుంచి, మన తండ్రిగా దివ్యమాతగా, మన కష్టాల్ని ఆయనకు మొరపెట్టుకుంటే ఆయన సెంటరులో ఉండి మన సమశ్యలన్నిటినీ తనపై వేసుకొనే బాధ్యతను తీసుకుంటారు. అలాగే బాబా సమాధికి కూడా ఒక ప్రత్యేకత ఉన్నది. మనం ప్రతివారం మెహెర్ సెంటరుకు వెళుతున్నామంటే, ఆ వారం రోజుల్లో జరిగిన కాలంలో చార్జీ తరిగిపోయిన మన హృదయ బ్యాటరీని తిరిగి చార్జి చేయటం కోసమేనన్నది కటిక నిజం. మళ్లీ గడవాల్సిన వారంలో ఆబ్యాటరీ తిరిగి పని చేయాలంటే కనీసం వారానికి ఒక్కసారన్నా ఈ బ్యాటరీని రీచార్జి చేయాలి. అందుకే బాబా ఉండే నిలయానికి (సెంటరుకు) వెళ్లి తీరాలి. మనసా, వాచా, కర్మణా బాబాను ప్రేమిస్తూ ఆయనకు అర్పణయ్యేందుకు, మనం ఎదుర్కొనే స్వీయ కష్టాల్ని బాధల్ని, ఆయన ముందు మొరపెట్టుకొనేందుకు, మన ప్రియతముడ్ని స్వయంగా కలుసుకొనుటకు అనువైన స్థళం మెహెర్ బాబా సెంటరు.

అందువల్ల ఆయన కార్యకర్తలుగా పని చేసేవారు, అందరి హృదయాలకు హత్తుకొనే విధంగా బాబా సందేశాల్ని ప్రచారం చేయాలి. పాల్గొంటున్న వారందరికి, బాబా ముందు స్వేచ్ఛగా మాట్లాడే స్వతంత్రం ఇవ్వాలి. పాల్గొనే ప్రేమికులంతా తమ తమ మనస్సుల్లోని, హృదయాల్లోని భావాన్ని వెల్లడి చేయకలిగి తుది నిర్ణయాన్ని బాబాకే వదలాలి. సెంటరు కార్యక్రమాల్లో పాల్గొంటున్న వారంతా వినోదించుటకు రాలేదని, ఆ నిలయంలో ఉన్నది, వచ్చినదీ బాబా మాత్రమేనని గుర్తించాలి. అక్కడ జరిగే భజనలు, ప్రసంగాలు, వినోద కాలక్షేపాలు, నృత్య, నాట్య, తదితర తమాషాలేవైనా సరే వన్నీ ఆయన కోసమేనన్న భావాన్ని కలిగి, ఆయన మూర్తిని, నామాన్ని స్మరించుకుంటూ అంతసేపూ ఆయన సాన్నిధ్యాన్ని అనుభవించాలి. ఇది మన కర్తవ్యం కావాలి.

# బాబా నిత్య నిరంతరుడు



మెహెర్ బాబా అనంత మహా సాగరుడు. ఆ ప్రేమ మహాసాగరము నుండి ప్రేమను తనివితీరి గ్రోలి ప్రతివారు తమ దాహాన్ని తీర్చుకోవచ్చును. అయితే భగవంతుడు మన మధ్యకు వచ్చినప్పుడు ఆయన యెడల మనము అంతగా శ్రద్ధ చూపం. ఆయన్ని లక్ష్యపెట్టక, అశ్రద్ధ చేస్తాం. ఆయున ఈ నాటకరంగం నుండి నిష్క్రమించినా తన అపార కరుణా కటాక్షము వలన, బాబా కృపను నిరంతరం అనుభవించేందుకు లభిస్తూనే ఉంటుంది. భౌతికంగా ఆ దివ్యమంగళ రూపాన్ని చూడకపోయినా, అటువంటి వారెంతో ధన్యులు. ఎందుకంటే వారు చూడలేనిది చూస్తూ మరింత తీవ్రంగా బాబాను ప్రేమించ కలుగుతున్నారు. బాబా శరీరధారిగా లేనప్పుడు ఆయన్ని ప్రేమించ కలగడమనేది, అట్టివారికాయన ఇచ్చిన వరము.

ఇప్పుడు మెహెరా బాదు పిలిగ్రిం సెంటరు ఆసుపత్రిలో డా॥ ఆనీ అనే ఆమె బాబా ప్రేమికులందరికీ పరిచయస్తురాలు. ఆమె ఫ్రాన్సు దేశంలో ఒక నాస్తిక కుటుంబంలో జన్మించింది. ఆమె తల్లి తండ్రులకు భగవంతుడంటే నమ్మకం లేదు. అసలు భగవంతుడంటేనే వారికి భయమట. డా॥ ఆనీ వైద్య విద్యాభ్యాసం చేసే రోజుల్లో, మనస్సులో దైవం గురించిన అనేక ప్రశ్నలు చెలరేగాయి. ఆమె ఎంత ప్రయత్నించినా వాటికి జవాబులు దొరకలేదు. చదువుకాగానే శిక్షణా కాలాన్ని పూర్తి చేసింది. స్టడీ టూరులో ఇండియాకు రావటం జరిగింది. బొంబాయిలోనూ, పూనాలోను జరిగిన వైద్య సమావేశాల్లో పాల్గొని, మెహెరాబాదు గురించి పూనాలో విన్నది. వెంటనే బాబా తన ప్రశ్నలకు జవాబు చెపుతారనుకొని అహ్మదు నగరు వచ్చింది. అయితే మెహెర్ బాబా అప్పటికి చాలా ఏళ్ల క్రితమే 1969 జనవరి 31న శరీరం చాలించారని తెలుసుకొని, శరీరంతో లేనివారు తన ప్రశ్నలకు ఏం జవాబులు చెప్పగలరని అనుకున్నది.

ఎలాగూ ఇంత దూరం వచ్చాను గదా అని ఒక పర్యాయం మెహెరా బాదు కొండ ఎక్కి బాబా సమాధిని చూచి వద్దామని పైకి వెళ్ళింది. బాబా సమాధిని స్పృశించే సరికి, ఆ ప్రేమాంబుధి నుండి అలలు పైకి లేచాయి. ఆమె మనో వేదనను ముంచి వేశాయి. తన ప్రశ్నలన్నిటికీ ఒక్కొక్కటిగా జవాబులు దొరకసాగాయి. మరుక్షణంలోనే ఆమె ఆలోచనలన్నీ తుడిచి వేయబడినవి. వచ్చినపని పూర్తికాగానే ఫ్రాన్సు వెళ్ళి పోయింది. అయినా ఆమె మనస్సంతా బాబా వైపు లాగటంతో, మళ్ళీ మెహెరాబాదు వచ్చింది. ఈ పర్యాయం బాబా కోసమే వచ్చింది. ఒక డాక్టరుగా డా॥ గోహెర్ చేస్తున్న వైద్య సేవలను చూచి చలించిపోయింది. అప్పుడామెకు మానవ సేవే మాధవ సేవ అన్న అర్థం అవగతమైంది. తన కుటుంబంపైన మమకారం పోయింది. వారిని వదిలి ఇక్కడే ఉండిపోవాలని సంకల్పించింది.

అలా డా॥ ఆనీ పిలిగ్రిం సెంటరులో ఉంటూ బాబా సేవల్లో భాగంగా డాక్టరు వృత్తిని చేస్తోంది. అప్పుడప్పుడూ స్వదేశానికి వెళ్ళి వస్తూ అధిక కాలం పిలిగ్రిల సెంటరు ఆసుపత్రిలోనే సేవలందిస్తోంది. 1984లో ఆమె విజయవాడ వచ్చినప్పుడు ఈ వివరాలన్నీ మాకు చెప్పింది. ఆమె జీవితంలో ఇప్పుడేం జరిగినా బాబా ప్రేరణతోటే జరుగుతున్న మేల్కొలుపులుగా భావిస్తున్నానంటుంది. డా॥ ఆనీ 1994లో నాకు గుండెపోటు వచ్చి బాబా కృపవల్ల బయట పడిన తరువాత మెహెర్ బాబా దర్శనానికి మెహెరాబాదు వెళ్ళి నప్పుడు, సమాధి కొండ ఎక్కుతుండగా ఆయాసపడ్డాను. సో॥ బాలనాటు గారి సలహాపై డా॥ ఆనీ నాకు విశిష్ట వైద్య సేవలందించింది. అప్పుడామె, ప్రియతమ బాబా అందించే అద్భుత సహాయాన్ని గురించి కొన్ని సంఘటనలు చెప్పింది.

ఒక పర్యాయం తాను ఆమెరికా వెళ్ళినప్పుడు వైద్య వృత్తిలో ఉపయోగపడే లేజరు పరికరం ఒకటి ఒక తను కేవలం 300 డాలర్లకు ఇస్తానంటే వెంటనే కొని తెచ్చిందట. న్యాయానికా పరికరాన్ని మార్కెట్టులో కొనాలంటే కనీసం 3000 డాలర్లవుతుందట. ఇంత చౌకగా లభించటం బాబా కృపే నంటుంది డా॥ ఆనీ. ఆమె తల్లి దండ్రులు పూర్తిగా నాస్తికులే అయినప్పటికీ, ఆమె తల్లి మెహెరాబాదు వచ్చి బాబా సమాధిని దర్శించి, పూర్తిగా మారిపోయిందట. ఆమె బాబా

కుటుంబంలో పుట్టక పోయినా, అవతారుని సహవాస భాగ్యం దొరికినందు వల్ల తానెంతో అదృష్టవంతురాలనంటుంది డా॥ ఆనీ. మరో అనుభవాన్ని చెప్పింది.

1985లో ఆదీ. కె. ఇరానీ గారి దగ్గర టైపిస్టుగా పనిచేసిన ఫ్రాంజీ మరణించినప్పుడు, ఆ శవాన్ని అంత్యక్రియల కోసం అంబ్యులెన్సులో మెహెరాబాదు తీసుకువచ్చారు. రోడ్డు ప్రక్కగా అంత్య క్రియలకు ఏర్పాటు చేశారు. తీరా ఆంబ్యులెన్సు అక్కడ చేరే సరికి కారు మబ్బులు కమ్ముకొచ్చి వర్షం మొదలైంది. వాన తగ్గేవరకు శవాన్ని అంబ్యులెన్సు నుండి దించలేదు. కానీ అదే సమయంలో అటుగా ఒక ట్రక్కునిండా జనంతో వస్తున్న పెళ్లి బృందం వారి లారీ అంబ్యులెన్సు ఆగిన పక్కగా బురదకు స్లిప్పై బొల్తా కొట్టింది. అందులో ఉన్న దాదాపు 50, 60 మందికి పెద్ద దెబ్బలే తగిలి ప్రమాదం జరిగిపోయింది.

అప్పుడక్కడున్న వారిలో డా॥ ఆనీ ఒక్కతే డాక్టరు. ఆపదలో ఉన్నవారిని ఆదుకోవటమే వైద్య ధర్మమన్న విషయం ఆ సమయంలో డా॥ ఆనీకి గుర్తొచ్చి బాబాను మనసులోనే ఇలా ప్రశ్నించింది. "ఇంత మంది క్షతగాత్రులకు నేనొక్కతనే ఎలా వైద్య సమాయాన్నందించ గలను ? దీనికి తోడు మరో వైపున ఈ శవానికి దహన సంస్కారాలు జరగాలి కదా ! ఏమిటి నాకీ పరీక్ష ?" అని అనుకున్నదట. బాబా కరుణామయుడు. ఆమె ప్రశ్నలన్నింటికీ వెంటనే జవాబులు స్ఫురింప చేశారు. "ఇప్పుడిక్కడే ఆంబ్యులెన్సు ఉన్నది కదా ! అసలది ఇప్పటి వరకూ ఇక్కడ ఈ క్షతగాత్రులకు సహాయ పడేందుకు ఉన్నది సుమా ! అన్న భావన ఆమెకు స్ఫురించిందట. అంతే డా॥ ఆనీ క్షణమాలశ్యం చేయలేదు. సరిగ్గా అదే సమయానికి వర్షం కూడా ఆగిపోవటంతో శవాన్ని దింపి అంత్యక్రియలు మొదలు పెట్టారు. శవం అంతిమ యాత్రలో పాల్గొనేందుకు చాలామంది కార్లలో వచ్చి అక్కడే ఉన్నారు. వారందరి సహాయంతో క్షతగాత్రులందరినీ ఆంబ్యులెన్సులోను, వచ్చిన వారి కార్లలోను ఎక్కించి సకలంలో హాస్పిటలుకు చేర్చారు. దీనిని బట్టి మనం హృదయాంతరాళాల నుండి బాబాను పిలిచి ఏమి సంకల్పించినా, ఆ మరుక్షణంలోనే, ఆ భారాన్ని బాబా స్వయంగా వహించి ఎలా ఆదుకుంటారో విదితమవుతుంది.

# చరమాంకము

అవతారుడు తన జీవిత కాలం లోనే పనంతా మన కోసమే చేస్తాడు. గమ్యాన్ని చేరేందుకు మనం చేసే ప్రయాణంలో వదనిర్దేశం చేసి, అలా గమ్యాన్ని చేరుటకు ఎవరెవరు ఏఏ మార్గాల్లో ఏఏ ప్రయాణాలు చేయాలో నిర్దేశిస్తాడు. అలా చేసే ప్రయాణాల్లో వారివారి అవసరాలను బట్టి ఏవేవో సంఘటనల్ని కూడా కల్పిస్తాడు. ఆయా సంఘటనలను ఆయన చేతనే పూర్తి చేయబడినప్పుడు ఆకార్యక్రమం పూర్తవుతుంది. అప్పడు అవతారుడు తన అవతారాన్ని చాలించి దేహాన్ని వదిలేస్తాడు. ఆదరిమిలా ఆయన నిర్దేశించిన పధకం యాంత్రికంగా విశదపడటం మొదలవుతుంది. అయినా తనరూపరహిత స్థితిలో మరోవందేళ్లవరకూ తన ఆధిపత్యం లోనే పర్యవేక్షిస్తాడు.

మన కోసం చేసిన బాబా కార్యక్రమం విశదపడటం, ఆయన శరీరత్యాగానంతరం మొదలైంది. మెహెర్ బాబా సజీవులైయున్న రోజుల్లో ఆయనకు సమకాలికులైన వారీలో బహు స్వల్పశాతం మాత్రమే ఆయన్ని గుర్తించి, ప్రేమించి, అనుసరించారు. ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న బాబాఅనుచర గణాన్ని చూస్తుంటే, ఆ అనంత చైతన్యంవైపు ఎంత మంది మొగ్గుతున్నారో ఆశ్చర్యం వేస్తోంది. అనుక్షణం అవతారుడు గుర్తొచ్చి, శక్తికొద్దీ హృదయంతరాళాల్లోంచి పిలుస్తూ ఆయన సహాయాన్ని పొంది గమ్యం వైపు ప్రయాణిస్తున్న ఘట్టాలెన్నో జరుగుతూ అవతారుని ప్రత్యక్షీకరణ ఈ భూమి పై ప్రత్యక్షంగా ప్రకటితమవు తున్నది. ఆయన ఘన వైభవం వేనోళ్లకీర్తించబడుతోంది.

అవతారుడి గురించ చెప్పాలంటే ఆయన కృప ఉంటే కాని సాధ్యపడదు. సాక్షాత్తుభగవంతుడైన మెహెర్ బాబా జీవనం అవతారుడిగా శూన్యంలో గడిచినప్పటికీ ఆయన గడిపిన జీవనం మాత్రం శూన్యం కాదు. ఆయన జీవితం యధార్థ జీవనం. కనుక ఆయన గడిపిన జీవితం ద్వారా మనకు సత్యాన్నే అందించారు. అయితే మనలో ఉన్న బలహీనతల వల్ల ఆయా సంఘటనల్నీ అవగాహన చేసుకోలేక పోతున్నాం. బాబా ఎప్పుడూ, ఆధ్యాత్మిక కార్యక్రమంలో ఏకాంత వాసము, ఉపవాసములో నిమగ్నమై ఉండేవారు అయినప్పటికీ ఆయన నిర్వహించే ప్రతికార్యము దైవత్వంతోకూడిన హాశ్యంతో నిండి ఉడేంది. మనలో ఉండే బలహీనత అజ్ఞానం వల్ల ప్రేరితమవుతుంది. అయితే అవతారుడిలో కూడా బలహీనత ఉంటుందని బాబా చెప్పారు. ఆ బలహీనత దైవత్వంతో కూడిన హాశ్యంతో నిండి ఉంటుందని చెప్పారు.

1963లో గురుప్రసాద్‌లో ఉండగా మెహెర్‌బాబా తనలోని బలహీనత గురించి ముచ్చటించారు. తన పూర్వ అవతారుల గురించి చెపుతూ అందరి అవతారులలోనూ ఏదో ఒక బలహీనత ఉండేదని వివరించారు. జోరాష్ట్రరు శత్రువులతో చుట్టుముట్టడించ బడినప్పుడు, ఆయన ప్రార్థనలో మునిగిఉన్నాడట. శత్రువులను చూచి, తన రుద్రాక్షలను శత్రువుల ముఠానాయకునిపై విసిరివేయగా వాటినుండి వెలవడిన అగ్నిలో, ఆ నాయకుడు ఆహుతైపోయాడు. ఈ సంఘటన జోరాష్ట్రరులోని బలహీనత. శ్రీరాముడు లంకనుండి సీతాదేవిని రావణుని చెరనుండి విడిపించి తీసుకు వచ్చినప్పుడు, సీతా మహాసాధ్వి రాముని అగ్ని పరీక్షకు గురి కావలసి వచ్చింది. ఆమె స్వచ్ఛమైనదని, పరిశుద్ధమైనదని, రాముడికి తెలిసినా, అపవాదు రాకుడదని, రాముడూ చేశాడు ఇది రామునిలోని బలహీనత.

కృష్ణుడ్ని కేవలం తన చెలికానిగా మాత్రమే తీసుకున్న అర్జునుడు, కృష్ణుని మాటలపై విశ్వాసము ఉంచలేక యుద్ధం చేసేందుకు ఇష్టపడకపోతే అప్పుడు కృష్ణుడు తన విరాట్ స్వరూపాన్ని అర్జునుడికి చూపిస్తాడు ఇది కృష్ణునిలోని బలహీనత. పోతే బుద్ధుడు తన శిష్యులకు నిర్వాణం గురించి విశదీకరించాడు. కానీ నిర్వికల్ప సమాధి గురించి సవిస్తరంగా వివరించ లేదు. ఆయన నిర్వాణం తదుపరి స్థితుల గురించి విరించలేదు. మజూబియక్ సులూకియత్, కుతూబియత్‌ల గురించి వివరించక పోవటం, బుద్ధునిలోని బలహీనత. ఇందుకే ఈనాడు మానవులు తమ ఆధ్యాత్మిక మార్గాన్వేషణలో బుద్ధుడ్ని, అంతిమ వానిగా కీర్తిస్తున్నారు. దీనిని గురించి భగవత్ వచనములులో విరంగా తెలుపబడింది,

“జీసను శిలువపై ఎన్నడూ విలపించలేదు. కానీ “నా దైవమా ! ఓ నా దైవమా : నీవు నన్నేలక్షమించితివి?” అని మొరపెట్టుకున్నాడు. ఇదీ ఒక విధమైన బలహీనతే ! మహమ్మదు తాను భగవంతుడినని ఎన్నడూ ఎన్నడూ చెప్పుకోలేదు. తానొక మానవ మాత్రుడనేనని, చెప్పాడు. పవిత్ర ఖురాన్ గాబ్రియల్‌చే వ్రాయబడిందని చెప్పాడాయన. అదీ ఒక బలహీనతే.” అని మెహెర్ బాబా గత అవతారుల బలహీనతల గురించి చెపుతూ “మరి నేను కూడా ఈ జీవితంలోబలహీనతను కలిగి ఉన్నాను. మళ్లీ 700 సంవత్సరాలవరకూ ఆ బలహీనతేమిటో చెప్పదలచలేదు.” అని చెప్పారు.

కొందరు అవతారులు వివాహం చేసుకున్నారు. మరి కొందరు వివాహం చేసుకోలేదు ఎందుకని ? అనే విషయంపై బాబా చక్కని వివరణ నిచ్చారు.

అవతారుని నిత్య జీవనం, పైకి ఆయా కాలాల్లో ఉండే కాలమాన పరిస్థితులనుబట్టి ఉంటుంది. తత్కాలాను గుణ్యంగా తమ సమకాలికులైన మనవాళికి, ఆనాటి అలవాట్లు, ఆచార వ్యవహారాలనుబట్టే, తమ జీవన అలవాట్లు నిర్ణయించుకుంటారు. తమ కార్యక్రమాలన్నీ తమ సమకాలికులకు సరిపోయే రీతిలో ఆచరిస్తారు. పైకి భిన్నంగా ఆచరిస్తున్నట్లు కనిపించినా, వారంతా అంతరంగికంగా గడిపే జీవితం మాత్రం ఒకటే.

మహమ్మదు కాలంలో అరబ్బులలో ఒక ఆచారం ఉండేది. బహు భార్యాత్వం ఆనాడు తప్పుకాదు. చట్ట సమ్మతము. జీసను మాదిరిగా మహమ్మదు వివాహం చేసుకొని ఉండకపోతే, బ్రహ్మచర్యాన్ని పాటించి ఉండి ఉంటే, లేదా బహు భార్యా వివాహ వ్యవస్థను వ్యతిరేకించి ఉంటే, ప్రజల నుండి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొనవలసి వచ్చేది. బహు కొద్ది మందే మహమ్మదును అనుసరించి ఉండే వారు. ఆయన ప్రభోదించిన ఆదర్శాలను అతి తక్కువ మందే ఆచరించేవారు. మహమ్మదుకు తొమ్మిది మంది భార్యలు. ఆనాడు ఇలా బహు భార్యాత్వం కలిగి ఉండటం నేరం కాదు.

కృష్ణుడి రోజుల్లో, హిందువుల మధ్య ఐక్యత లేక ఒకరి కొకరు పోట్లాడు కొనేవారు. ఈర్ష్య ద్వేషం, ప్రబలింది. ఆధ్యాత్మిక జీవనపు అసలు అర్ధాన్ని వారు తెలుసుకోలేక పోయారు. అందుకే కృష్ణుడు తన బోధలన్నీటినీ ప్రేమ యొక్క చట్టాలపైనే కేంద్రీకరించాడు. జోరాష్టరు కాలంలో సమానత్వం లేదు. ఆనాటి మానవులు భౌతికవాదులు కారు. ఆధ్యాత్మిక వాదులూ కారు. పరస్త్రీ వ్యామోహాన్ని విడనాడి, వివాహం చేసుకున్న భార్యతో సంసారం చేయమని జోరాష్టరు బోధించాడు. ఆయన వివాహితుడు. "మంచి ఆలోచనలు, మంచి మాటలు, మంచి పనులు" అనేవి ఆయన బోధలలోని ముఖ్య సూత్రం.

బుద్ధుని కాలంలో మానవాళి, భౌతిక వాదంలో మునిగి ఉన్నది. తమకున్న భౌతిక వాంఛలు తప్పు అని రుజువు చేసేందుకు బుద్ధుడు తన భార్యా బిడ్డలను పరిత్యజించి, ప్రాపంచిక సుఖాల్ని వదులుకొని, వారంతా మాయ యొక్క బందీలని రుజువు పరిచాడు. సన్యాసిగా పరివ్రాజక జీవితాన్ని గడిపి, తన బోధల్ని సుభోదకం చేశాడు. జీసను కాలంలో రాగ ద్వేషాలు, గర్వం, క్రూరత్వం వంటివి ఆనాడున్న మానవ లక్షణాలు. స్త్రీ వివాహ విషయంలో వారికొక నమ్మకం ఉండేది. దానివల్ల అరేబియా దేశంలో మాదిరిగా, వారి అలవాట్లను మలచుకోవలసిన అవసరం లేకపోయింది. పెళ్లిని ఒక రుజువుగా ఉదహరించవలసిన అవసరం లేకపోయిందానాడు. జీసను, మానవత్వంతో

కూడిన అతి సామాన్య జీవితాన్ని కడు పేదరికంలో గడిపాడు. జీసస్ సాక్షాత్తు దైవం. పవిత్రమైన ఆదర్శంతో జీవించిన బ్రహ్మచారి. ప్రవక్తలంతా అవతరించిన దైవమే. అందుకే వారంతా కోరికలకు ఉద్రేకాలకు అతీతులయ్యారు. ఈ అవతారులందరూ ఒకే దైవం నుండి అవతరించినవారే".

"ప్రతి వారూ నన్ను తమకిష్ట వచ్చిన రీతిలో ఊహించుకోవచ్చును. నేను నిర్వహించే కార్యక్రమం గురించి తమ ఊహలకందిన విధంగా అర్థం చెప్పుకోవచ్చును. నా మాటలు, మీకనుకూలంగానో, మీరు భాష్యం చెప్పుకున్నట్లుగానో ఉండవచ్చును కానీ అవన్నీ మీ స్వంత భాష్యాలేనని మాత్రం మరవకండి. నన్ను గురించి మీరెలా భావిస్తే అలా ప్రకటించే అర్హత మీకున్నది. ఒక్క విషయం గుర్తుంచుకోండి. నేను అవతారుడనని మీరు ఎరుగరు. నేను ఎరుగుదును. నా మీద మీకున్న నమ్మకం, విధేయతలను ఎప్పటికీ చెక్కు చెదరనీయక పదిలపరచుకోండి" అన్నారు. ఒక్క క్షణంపాటు ఒక యోగి సమక్షంలో గడిపితే వందేళ్ళ తపస్సు చేసిన దానితో సమానమని సద్గురువు జాలాలుద్దీన్ రూమీ అన్నారు. మరి ఒక యోగి సన్నిధిలో అంతటి శక్తి ఉన్నప్పుడు, సద్గురువు, అవతారుల మాటేమిటి ? వీరు అటువంటి యోగలెందరినో తయారు చేయగల శక్తి వంతులు గదా ! మన పూర్వ జన్మ విశేషం చేత అవతారుని సాంగత్య భాగ్యం పొందే అదృష్టం మనకు లభించింది. రాక రాక దొరికిన ఈ అదృష్టాన్ని చేజార్చుకోకుండా, ప్రియతమ బాబాపై పరిపూర్ణ విశ్వాసాన్నుంచి, చిట్ట చివరివరకు బాబా కొంగు విడువక ఆయనకు విధేయులుగా ఉండటం మన కర్తవ్యం కావాలి.

గత ముప్పై ఏళ్లుగా అమరతిధికి మెహెర్ బాబా సాహిత్యంపై విషయ సేకరణ చేసి గ్రంథ రూపంలో పాఠక లోకానికి అందిస్తున్న సంగతి అందరికీ తెలిసిందే. బాబా ప్రేరణతో చెదురు మదురుగా అక్కడక్కడా పడి ఉన్న అమూల్యమైన బాబా అమృత గుళికల్ని వెతికి పట్టుకొని ఈ మెహెరామృత రూపంలో అందించే మహద్భాగ్యాన్ని ప్రియతమ బాబా కల్పించారు. ప్రపంచంలోని మతాలన్నీ దేవుడు ఒక్కడేనని ఘోషిస్తున్న తరుణంలో ఆ దేవుడే సకల సృష్టికి తండ్రి, నేనే ఆ తండ్రిని మానవులంతా ఒకే తండ్రి బిడ్డలవలె, ఈ భూమిపై జీవించాలని ప్రభోదించేందుకు నేను వచ్చాను అని బాబా మేల్కొలిపారు. అట్టి దివ్య సనాతనుడి కృపకు పాత్రులమయ్యేందుకు ఈ మెహెరామృత గ్రంథంలో విషయాలు సహాయపడాలని ఆకాంక్షిస్తూ అందరికీ జై బాబా !

జీవితము యొక్క పరమావధి, ఆధ్యాత్మిక సాధన భగవంతునిలో సమైక్యం కావటం. అవతారుని సమకాలికులుగా పుట్టిన మనం మన గమ్యాన్ని సాధించాలంటే మన దివ్య ప్రియతముని కృప తప్పని సరి. ఈ కృపకు పాత్రులం కావాలంటే పూజా పునస్కారాలు, యజ్ఞ యాగాదులు, ధ్యానము, తపస్సు, ఆరాధన వంటివేవీ సహాయపడవు. కేవలం ప్రేమ మాత్రమే. అవతారుని కృపకు పాత్రులను చేస్తుంది. "నా ప్రేమను మీకు పంచి, మీరు ప్రేమించేట్లు చేయుటకే నేను వచ్చాను. సదా నన్ను స్మరిస్తూంటే, నా ప్రేమకు అర్హులై, మోక్షాన్ని పొందే అనుగ్రహం అందుకుంటారు" అంటూ ఆతన అవతార మంత్రాంగంలో, ఎన్నో నిత్య సత్యాల్ని నోటి మాటలతో కాక, ఆచరణాత్మకంగా అందించిన అద్భుత అనుభవాలే ఈ "**మెహెరామృతం**" యుగ యుగాలుగా, మాటిమాటికి, అవతారమెత్తుతున్న భగవంతుడు ఈ ఆధునిక యుగంలో మెహెర్ అవతారుడై అవతరించి, తన జీవిత ఉదాహరణ ద్వారా ఆధ్యాత్మిక మేలుకొలుపు కలిగించి మానవ హృదయ క్షేత్రంలో ప్రేమ బీజాన్ని నాటిన అమృత గుళికలను, ఆస్వాదించుట కనువుగా అందిస్తున్న ఈ సంకలనం, ప్రియతముని కృపకుపాత్రులను చేయగలదని ఆశ!



- డి.వి.డి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్ చంద్ర)

